# ప్రపంచ చరిత్ర

## (మొదటి భాగం)

ఆంగ్లమూలం:
జవహర్‌లాల్ నెహ్రూ

ఆంధ్రీకరణము:
చింతా దీక్షితులు



సంస్కృతి ప్రచురణ

వెల రెండు రూపాయలు

# వి షయ సూ చి క

పుట.


జన్మదిన లేఖ .... .... 11

1. సంవత్సరాది బహుమానము .... .... 17
2. చరిత్ర మనకేమి బోధించును ? .... .... 21
3. ఇంకిలాబ్ జిందబాద్ .... .... .... 25
4. ఆసియా; యూరోపు .... .... .... 28
5. ప్రాతనాగరికలలు : మన వారసత్వము ... ... 31
6. హెల్లనీలు .... .... ... 36
7. గ్రీకుల నగరరాజ్యములు... .... .... 42
8. పడమటి ఆసియాలోని సామ్రాజ్యములు ... ... 45
9. ప్రాత సంప్రదాయముల భారము ... ... 50
10. ప్రాచీన హిందూస్థానమున గ్రామపంచాయతులు .... 56
11. వేయి సంవత్సరముల చీనాచరిత్ర .... .... 62
12. ప్రాచీనకాలము పిలుచు పిలుపు .... .... 68
13. ధన మెచ్చటికి పోవును ? .... .... 73
14. క్రీస్తుకు పూర్వము ఆరవ శతాబ్ది: మతము .... .... 78
15. పర్షియా : గ్రీసు .... .... ... 86
16. హెల్లాసు మహత్తర ప్రతిభ .... .... 94
17. ప్రసిద్ధవిజేత, కాని దురహంకారపూరితుడగు యువకుడు .... 99
18. చంద్రగుప్తమౌర్యుడు : అర్థశాస్త్రము .... .... 106
19. మూడుమాసములు .... .... .... 115
20. అరేబియా సముద్రము .... .... .... 118
21. సెలవుదినము : స్వప్నయాత్ర .... .... 123

22. బ్రతుకుకొరకు మానవుని పాట్లు .... .... 126
23. సింహావలోకనము .... .... .... 131
24. దేవానాంప్రియుడైన అశోకుడు .... .... 134
25. అశోకునికాలమునాటి ప్రపంచము .... .... 141
26. చిన్లు, హాన్లు .... .... .... 146
27. కార్తేజికి ప్రతికూలముగా రోము ... .... 152
28. రోమనుల ప్రజాప్రభుత్వము సామ్రాజ్యమగుట .... 158
29. దక్షిణ ఇండియా ఉత్తర ఇండియాను మరుగుపరచెను .... 165
30. కుషాణుల పొలిమేర సామ్రాజ్యము .... .... 171
31. ఏసుక్రీస్తు : క్రైస్తవమతము .... .... 176
32. రోమక సామ్రాజ్యము .... .... .... 183
33. రోముచీలిపోయి నామమాత్రావశిష్టమగుట .... .... 190
34. ప్రపంచ ప్రభుత్వము - అను భావన .... .... 196
35. పార్థియా : సస్సనీడులు .... .... .... 201


## ప ట ము లు


1. పడమటిఆసియాయొక్కయు, ఆగ్నేయ యూరోపుయొక్కయు నాగరికతలు 40
2. చీనాదేశ నాగరీక ప్రారంభము 63
3. గ్రీకులు - పర్షియనులు 90
4. అలెగ్జాండరు సామ్రాజ్యము 101
5. అశోకుడు (క్రీ. పూ. 268-226) 143
6. రోము సామ్రాజ్యమైనది 160
7. కుషాణ సామ్రాజ్యమునాటి ఇండియా 173

# మా మా ట

పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు తమ పుత్రిక ఇందిర విద్యాభ్యాసంలో యేవిధంగానూ తోడ్పడలేకపోయారు. దేశరాజకీయాల్లో పాల్గొంటూ, అడప దడప కారాగారంలో వుండడంలో తీరికనేలేకపోయింది. జైల్లో తీరిక నుపయోగించుకొని కుమార్తెకు ప్రపంచచరిత్రను లేఖల రూపంగా వ్రాశారు. ఈ లేఖలు బాల, బాలికలందరూ ప్రపంచచరిత్రను అర్థంచేసు కొనుటకు ఉపయోగపడేట్లు వ్రాశారు. 1933-35 లలో వ్రాసిన లేఖ లివి. ఆంగ్లమూలం 1934 లో ముద్రింపబడింది. ఇప్పటికి 12 ఏండ్లు దాటినా యింతదనుక యీ పుస్తకం తెనుగులో రాకపోవడం చింతనీయం.

మే మడుగగానే ఈ 'ప్రపంచచరిత్ర'ను ఆంధ్రీకరించి, ప్రచురించడానికి అనుమతినిచ్చిన రచయితకు, గృహచ్ఛిద్రా లెన్నో వున్నా శ్రమయనక యీ 1000 పేజీల పుస్తకంఅనువాదానికి పూనుకొని సాయపడిన మిత్రులు శ్రీ చింతా దీక్షితులుగారికీ మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

1-4-1947. ప్రకాశకులు.

# ఉపోద్ఘాతము

ఈ జాబులు ఎప్పుడు ఎక్కడ ప్రకటింపబడునో, అసలు ప్రకటింపబడునో లేదో చెప్పజాలను. నేటి ఇండియాలో పరిస్థితులు వింతగా ఉన్నవి. భావిని సూచించుట కష్టము. రేపు ఏమి జరుగునో తెలియదు కాబట్టి సావకాశ మున్నప్పుడే ఈ పంక్తులు వ్రాయుచున్నాను.

చరిత్రాత్మకమగు ఈ లేఖావళి వ్రాసినందుకు క్షమాపణ, సంజాయిషీ చెప్పుకొనవలసియున్నది. శ్రమ తీసికొని ఈ లేఖలు చదువువారికి అందు బహుశా క్షమాపణయు, సంజాయిషీయును గోచరించును. ముఖ్యముగా చదువరులు తుట్టతుది జాబు*ను చదువుదురుగాక. ఈ తలక్రిందుల ప్రపంచములో చివరనుండి మొదలుపెట్టుటకూడ మంచిదే.

ఈ జాబులు పెరిగినవి. ఈ పద్ధతిప్రకారము వ్రాయవలె నని నిశ్చయము చేసికొని వ్రాసినవి కా వీ జాబులు. ఈ జాబు లింతగ్రంథ మగునని నే ననుకోలేదు. సుమారు ఆరుసంవత్సరములక్రితము, మా అమ్మాయికి పదిసంవత్సరముల వయస్సు వచ్చినప్పుడు, ప్రపంచము యొక్క తొలిదశనుగూర్చి సులభముగా, సంగ్రహముగా కొన్ని జాబులు వ్రాసియుంటిని. ఈ తొలిజాబులు పిమ్మట గ్రంథరూపమును ధరించెను. ప్రజ లాగ్రంథము నాదరించిరి. ఇట్టి జాబుల నింకను వ్రాయవలెనని అనుకొనుచుంటిని. రాజకీయములలో నిరంతరము మునిగితేలు నా కట్టి సావకాశము చిక్కలేదు. చెరసాల నా కట్టి సావకాశము నిచ్చినది. అట్టి సావకాశమును నేను వినియోగించుకొంటిని.

చెరలో జీవనము గడపుటవలన లాభములు లేకపోలేదు. విశ్రాంతి, కొంతవరకు నిస్సంగత్వము చేకూరును. ఇబ్బందులు అందరికిని తెలిసినవే. పుస్తకభాండాగారము ఉండదు. మనము సలహాకోరు నిఘంటువులవంటి

---

* 196 వ జాబు.

గ్రంథములు కారాగారబద్ధుని వశమునం దుండవు. ఈ సందర్భములలో ఏ విషయమునుగూర్చి వ్రాయుట యన్నను, అందు ముఖ్యముగా చరిత్రను గూర్చి వ్రాయుట తెలివితక్కువ సాహసముతో కూడుకొన్న పని. నా వద్దకు కొన్ని గ్రంథములు వచ్చెను. కాని వాటిని నావద్ద నుంచుకొనుటకు వీలులేదు. అవి వచ్చినట్లే వెళ్ళినవి. పన్నెండు సంవత్సరముల క్రితము, తోడి దేశస్థులగు స్త్రీపురుషు లనేకులవలెనే నేనును కారాగారయాత్రలు చేయ మొదలిడినప్పుడు నేను చదివిన గ్రంథములనుండి ముఖ్యాంశములు వ్రాసిపెట్టుకొనుట అలవాటుచేసితిని. నా నోటుపుస్తకముల సంఖ్య నానాటికి పెరుగజొచ్చెను. నే నీజాబులు వ్రాయ మొదలిడినప్పు డవి నాకు ఉపయోగించినవి. ఇతరగ్రంథములును నాకు ఎక్కువగా సహాయము చేసినవి. వానిలో తప్పనిసరిగా చెప్పుకోదగ్గది హెచ్. జి. వెల్సువ్రాసిన 'చరిత్రసంగ్రహము'. కాని సలహాకు మంచి గ్రంథములు లేకుండుట ఇబ్బందిగానే ఉండెను. ఇందువల్లనే కొన్ని విషయములు దాటివేయవలసి వచ్చెను. కొన్ని కాలములు దాటివేయవలసివచ్చెను.

ఈ జాబులు మా అమ్మాయి చదువుకొనుట కుద్దేశింపబడినవి. మా అమ్మాయి చదువుటకుమాత్రమే ఉద్దేశింపబడిన ఆంతరంగికవిషయము లిందు కలవు. వాటి నేమి చేయవలెనో నాకు తోచుట లేదు. తొలగించుట సులభము కాదు. కాబట్టి వాటిని ముట్టుకొనకుండ ఉంచివేసితిని. చేయుటకు చేతినిండ పని లేనప్పుడు మన మంతర్ముఖుల మగుదుము. మనస్సు వివిధ స్థితులలో తిరుగాడుచుండును. మారుచున్న వివిధమనస్థ్సితు లీజాబులలో స్పష్టముగా కానవచ్చుచుండునని నా యూహ. చరిత్రకారులు విషయపరముగ చరిత్రమును వ్రాయుదురు. నే నట్లు చేయలేకపోతిని. నేను చరిత్ర కారుడ నని చెప్పుకొనుట లేదు. ఇందు చిన్నపిల్లలకు పనికివచ్చు సులభ విషయములును, అప్పుడప్పుడు పెద్దల అభిప్రాయముల చర్చలును అసహజముగా కలిసియున్నవి. పునరుక్తు లనేక మున్నవి. నిజమునకు ఈ జాబులందలి దోషముల కంతము లేదు. ఇవి లోతుకుపోకుండ

పైపైని స్పృశించుచు చెప్పుకొనిపోయిన సంక్షేపచారిత్రకవిషయములు మాత్రమే. రకరకముల గ్రంథములనుండి నేను నా అభిప్రాయములను, యథార్థవిషయములను సంగ్రహించితిని. అనేకదోషము లిందు వచ్చి పడ్డవి. సమర్థుడగు చరిత్రజ్ఞునిచే ఈజాబులను చదివించి సరిచేయించవలె నని నా ప్రథమోద్దేశము. కాని నేను కారాగారము విడిచి బయటనున్నది కొద్దికాలమే అగుటచే అటి ఏర్పాట్లు చేయుటకు నాకు సావకాశము చిక్కలేదు.

ఈ జాబులలో నేను తరుచు నా అభిప్రాయములను నిర్మొగమాటముగా ఖచ్చితముగా చెప్పియుంటిని. ఆ యభిప్రాయములు సరియైన వనియే నా యభిప్రాయము. కాని నే నీజాబులు వ్రాయుచున్నప్పుడే చరిత్రనుగూర్చిన నా యభిప్రాయములు క్రమముగా మారజొచ్చెను. నేడు అవి మరల వ్రాయవలసివచ్చినయెడల వేరొక విధముగా వ్రాయుదును. లేదా, వేరువిషయములకు ప్రాధాన్యము నిత్తును. కాని వ్రాసినదానిని చింపివేసి మరల వ్రాయజాలను.

జనవరి 1,1934. జవహర్‌లాల్ నెహ్రూ

పై వాక్యములు శ్రీ జవహర్లాల్ నెహ్రూ 1934 సంవత్సరమున వ్రాసియుండిరి.

తరువాత 1939-వ సంవత్సరమున నీ గ్రంథము తిరిగి ఇంగ్లాండులో ముద్రింపబడినది. అది జరుగుటకు ముందు గ్రంథకర్త గ్రంథము నంతయు సరిచూచెను. చాలభాగము తిరిగి వ్రాసెను. ఇందలి చరిత్రకథ 1938 సంవత్సరాంతమువరకు గ్రంథకర్తయే వ్రాసెను. ఈ కార్యము లన్నియు కారాగారమువెలుపల నున్నప్పుడే జరిగినవి. ఉపోద్ఘాతములో దొరలినవని చెప్పిన దోషము లన్నియు తొలగింపబడిన వనుట స్పష్టము.

1939-వ సంవత్సరమున ప్రకటింపబడిన గ్రంథమునకే ఈ యనువాదము.

అనువాదకుడు

# జన్మ దిన లేఖ

ఇందిరాప్రియదర్శినికి　　　　　　　నాయిని సెంట్రల్ చెరసాల
పదమూడవ పుట్టినరోజున　　　　　　　అక్టోబరు 26, 1930

నీవు పుట్టినరోజున బహుమతులను, ఆశీస్సులను అందుకొనుట నీ కలవాటు. ఈమాటుకూడ నీ వాశీస్సులు పుష్కలముగా అందుకొనగలవు. కాని ఈ నాయిని చెరసాలనుండి నీ కెట్టి బహుమతులను నే నంపగలను. నేను పంపు బహుమతులు వస్తురూపమున నుండజాలవు. వాయురూపమునగాని, మనోరూపమునగాని. ఆత్మరూపమునగాని ఉండవచ్చును? ఏయభిమానదేవతయైన నీ కీయగలిగిన విట్టి పారితోషికములే. వీనిని పంపుటకు చెరసాలఎత్తుగోడలుసైత మడ్డురాజాలవు.

ఉపదేశములు చేయుట, మంచిసలహాలనిచ్చుట నా కిష్టములేని పని యని నీవెరుగుదువుగదా, చిట్టితల్లీ. ఇట్లు చేయ నాకు బుద్ధిపుట్టినప్పుడు, నే నొకమారు చదివిన కథ జ్ఞప్తికి తెచ్చుకొనుచుందును. అది "మిక్కిలి తెలివి గల మనుష్యుని" కథ. ఈకథగల గ్రంథమును ముందుముందు నీవే చదువుదువేమో. పదమూడువందల సంవత్సరములకు పూర్వము, చీనాదేశమునుండి ఇండియాకు, వివేకము, జ్ఞానము నార్జించు ఉద్దేశముతో ఒక గొప్ప బాటసారి వచ్చెను. అతని పేరు యుఁవాఙ్చ్వాంగ్. ఉత్తర దిక్కున నున్న కొండలను దాటి, ఎడారులను దాటి ఆతడు వచ్చెను, ఎన్నియో అపాయములనుండి అతడు తప్పించుకొనెను. ఎన్నో యంతరాయముల నాతడు గడచెను—అతని జ్ఞానపిపాస యంత గొప్పది. నేడు పాట్నా యని పేర్కొనబడుచున్న పాటలీపుత్ర మను నగరమునకు సమీపమున ఆకాలమందున్న నలందా విశ్వవిద్యాలయమునం దాతడు ముఖ్యముగా తాను విద్యనభ్యసించుచు, ఇతరులకు విద్యగరపుచు పెక్కేండ్లు

గడపెను. యుఁవాన్‌చ్వాంగ్ విద్యాధికు డాయెను. అతనికి ధర్మాచార్యు డనః బిరుదము లభించెను. ఇట ధర్మమన బౌద్ధధర్మమని యభిప్రాయము. అతడు హిందూదేశమంతయు తిరిగెను. ఆకాలమున నీదేశమున నివసించు ప్రజల నాతడు చూచెను. వారినిగురించి తెలిసికొనెను, తరువాత నాతడు తన యాత్రలనుగూర్చి యొకగ్రంథమును రచించెను. నాకు జ్ఞాపకమువచ్చిన కథ ఈ గ్రంథములో నున్నది. దక్షిణహిందూ దేశమునుండి ఒకపురుషుడు కర్ణసువర్ణ నగరమునకు వచ్చెను. బీహారు రాష్ట్రమున నేడు భగల్పూరున్న చోటికి సమీపమున ఆ కర్ణసువర్ణ నగర ముండెను. ఇతడు నడుముచుట్టును రాగిరేకులు ధరించియుండెను. తలపై వెలుగుచున్న జ్యోతిని పెట్టుకొనెను. దండమును చేతబూని, సగర్వముగా, గంభీరముగా నాత డీవింత దుస్తులతో తిరుగుచుండెను. ఇట్టి వికృతవేషమునకు కారణ మెవ్వరైన అడిగిన నాతడు చెప్పు సమాధాన మేమన—నేనెంతో విద్యావంతుడను. అందుచే నాకడుపు పగులునను భయముచే నడుముచుట్టును రాగిరేకులు బిగించితిని. మూర్ఖులగు ప్రజలు అంధకారమున మునిగియుండుటచే జాలిజెంది తలపై జ్యోతిని పెట్టుకొంటిని.అయితే, తెలివి అధికమై పగిలిపోవుదునేమో యన్న భయము నాకు లేదు. కాబట్టి రాగిరేకులనుగాని, కవచమునుగాని ధరించవలసిన అవసరము నాకు లేదు. అయినను నాకున్న తెలివితేటలు నాకడుపులో లేవు. అవి ఎక్కడ ఉన్నను, అధికమునకు ఇంకను ఎంతో చోటున్నది. చోటు లేకపోవుట యను సందర్భ మెప్పటికి నుండదు. తెలివితేటలు ఇట్లు పరిమితముగా నున్నప్పుడు, నేను జ్ఞానవంతుడ నని ఎట్లు చెప్పుకోగలను ? ఇతరుల కెట్లు సదుపదేశములను చేయగలను ? న్యాయాన్యాయములను, కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించుటకు ఉపదేశములుచేయుట సరియైన మార్గము కాదనియు, ప్రసంగించుట, చర్చించుటవల్లనే నిజము బయల్పడుననియు నా నమ్మకము. నీతో చేసిన ప్రసంగములు నా కిష్టమైనవి. మన మెన్నో విషయములు ముచ్చటించుకొంటిమి. చర్చించు

కొంటిమి. పృథివి విపులమైనది. మన లోకమున కావల వింతలోకము లెన్నో కలవు. కాన క్రొత్తవిషయములు నేర్చుకొనుటకు మనకు విసుగు జనించరాదు. యుఁవాన్‌చ్వాంగ్ చెప్పిన కథలోని గర్వియగు తెలివి తక్కువ పురుషునివలె, తెలియదగిన సర్వమును తెలిసితిమనియు, పండితుల మైతిమనియు అనుకొనరాదు. మనము మిక్కిలి తెలివిగలవార మగుటకూడ కోరదగ్గదికాదు. అట్టివా రెవరైన నున్నచో, ఇక తెలిసికోదగిన దేదియు లేదుకదా యని వారు విచారగ్రస్తులు కాకతప్పదు. క్రొత్త విషయములను కనిపెట్టుటలోను, క్రొత్తవిషయములను గురించి నేర్చుకొనుటలోను గల యానందమునకు వారు దూరు లగుదురు. కోరినచో నట్టి యానందము మనకు చిక్కునుగదా.

కాబట్టి నే నుపదేశములు చేయరాదు. అయిన నే నేమి చేయవలసి యుండును? జాబు ప్రసంగమువంటిది కాదు. జాబులో ఒక్కరి భావములే వెల్లడియగును. కాన నేను చెప్పు విషయములలో మంచి సలహాలవలె తోచు విషయ ముండిన దానిని పరిహరించుము. మ్రింగరాని చెడ్డ మాత్రవలె దానిని పరిహరించుము. మన ముభయులము ప్రసంగించు కొనుచున్నట్లే యూహించి అట్టి విషయములు నేను నీకు నీ వాలోచించు కొనుటకై చేసిన సూచనలుగా భావించుము.

జాతులు తమ జీవితములో గొప్పయౌన్నత్యము చెందిన కాలముల గూర్చియు, గొప్పపురుషులనుగూర్చియు, స్త్రీలనుగూర్చియు, వారు చేసిన గొప్పకార్యములనుగూర్చియు మనము చరిత్రలో చదువుదుము. ఒక్కొక్కప్పుడు ఆయాకాలములందు మన మున్నట్లును ప్రాచీనవీరపురుషుల వలెను, వీరనారులవలెను సాహసకార్యములు చేయుచున్నట్లును ఊహించుకొని కలలు గనుచుందుము. నీవు మొట్టమొదట జీన్‌డఆర్కునుగురించి చదివినప్పుడు ఎంతటి యానందమును జెందితివో జ్ఞాపకమున్నదా? ఆమెవలె నీ వుండవలెనని యువ్విళ్లూరితివిగదా! సామాన్యస్త్రీపురుషులు సాధారణముగా వీరులు కారు. తిండినిగూర్చి, పిల్లలనుగూర్చి, సంసారపు

చిక్కులు మున్నగువానినిగూర్చి వారు తంటాలుపడుచుందురు. కాని ఒక మహాత్కార్యము సాధించుటకై ప్రజలు పూనుకొనవలసిన తరుణము వచ్చినప్పుడు సామాన్యస్త్రీపురుషులుసైతము వీరు లగుదురు. చరిత్ర యుద్రేకపూరిత మగును. నవయుగారంభ మగును. మహాపురుషులలో నేదియో శక్తి యిమిడియున్నది. వారు ప్రజలలో నావేశము పుట్టించి వారిచే ఘనకార్యములు చేయింతురు.

నీవు పుట్టిన సంవత్సరము (1917) చరిత్రలో జ్ఞప్తియం దుంచుకొనవలసిన సంవత్సరములలో నొకటి. అప్పు డొక మహానాయకుడు ఆర్తులపట్లను, పేదలపట్లను కరుణారసపూరితహృదయుడై, ఎన్నటికిని విస్మరింపరాని గొప్ప అధ్యాయమును చరిత్రలో తన ప్రజలచే వ్రాయించెను. నీవు పుట్టిన నెలలోనే లెనిన్ మహావిప్లవమును ప్రారంభించెను. దానిచే రష్యాసైబీరియాదేశముల స్వరూపమే మారిపోయెను. నేడు ఇండియాలో వేరొక మహానాయకుడు—ఆర్తజనరక్షణపరాయణుడు మన ప్రజలను పౌరుషమునకు పురిగొల్పి వారిచే మహాత్యాగములు చేయించెను. మరల వారు స్వేచ్ఛనందుటకును, క్షుధార్తులు, దరిద్రులు, పీడితులు బాధావిముక్తి నందుటకును ఈమహాప్రయత్నము. బాపుజీ (గాంధీ మహాత్ముడు) చెరసాలలో నున్నాడు. కాని యా మహాపురుషుని సందేశమను ఇంద్రజాలము హిందూదేశప్రజాకోటిహృదయముల బ్రవేశించెను. స్త్రీలు, పురుషులు, చిన్నపిల్లలుసైతము తమ చిన్నగూళ్ళనుండి బయటికి వచ్చి ఇండియాకు స్వాతంత్ర్యము సంపాదింప సైనికులైరి. ఇండియాలో మన మిప్పుడు చరిత్రను సృజించుచున్నాము. మన కన్నులముందు జరుగు నీవిషయములు నీవును, నేనును చూచుచున్నాము. ఈ మహోద్యమమున మనమును శక్తికొలది పాల్గొనుచున్నాము. మన మెంతటి యదృష్టవంతులమో!

ఈ మహోద్యమముపట్ల మన మెట్లు మెలగవలెను? మన మేమి చేయవలెను? ఏమి మనపాల బడునో నేను చెప్పజాలను. అది యేమైనను

మనము జ్ఞాపకముంచుకొనదగిన విషయ మొకటి యున్నది. మన యుద్యమమునకుగాని, మన ప్రజలకుగాని దుష్కీర్తి నాపాదించు కార్యములను మనము చేయరాదు. ఇండియాస్వేచ్ఛకు పోరాడు యోధులముగా మన ముండదలచినచో ఇండియాప్రతిష్ఠ మన చేతులలో నుండును. దానిని నిలుపుట మన పవిత్రమగు బాధ్యత. తరుచు మనము కర్తవ్యవిమూఢులము కావచ్చును. ఏది సరియైన మార్గమో, ఏది కాదో నిర్ణయించుట సులభము కాదు. సంశయముగా నున్నప్పుడెల్ల నీ వీవిషయమును జ్ఞప్తియం దుంచుకొనుము. దానివల్ల నీకు లాభ ముండును. ఏకార్యమును రహస్యముగా చేయకుము, ఇతరులకు తెలియజేయరాని కార్యము నెన్నడును చేయకుము. దాచవలె నను కోరిక భయలక్షణము. భయపడుట మంచిది కాదు. నీకు తగదు. ధైర్యము వహించియుండుము. పిమ్మట సర్వమును సక్రమముగా నడచును. నీవు ధైర్యముగా నున్న నీకు భయముండదు. సిగ్గుపడవలసిన పని ఎట్టిదియు నీవు చేయజాలవు. బాపుజీనాయకత్వమున నడుచుచున్న మన గొప్పస్వాతంత్ర్యోద్యమమున రహస్యవ్యాపారములకు తావు లేదు. దాచుకోవలసినది మన కేమియు లేదు. మనము చేయు కార్యములను చూచి మనము భయపడము. మనము చెప్పు మాటలను చూచి మనము భయపడము. పట్టపగలు సూర్యకాంతిలో మనము పని చేయుదుము. అట్లే మన సొంతజీవితములందు సైతము సూర్యునితో సఖ్యము చేయుదము. సూర్యకాంతిలో పనులు నెరవుదము. రహస్యముగా మన మేకార్యములు చేయవద్దు. చాటుమాటులు మన కుండవచ్చును. ఉండవలసినదే. కాని రహస్యము వేరు; చాటుమాటులు వేరు. తల్లీ, ఈవిధముగా నీవు చేసినయెడల నీవు పెరిగి పెద్దదానవై వెలుతురుబిడ్డ వగుదువు. నీకు భయ ముండదు. ఏది ఎట్లు వచ్చినను క్షోభచెందవు. శాంతముతో నుందువు.

నీకు చాల పెద్ద జాబును వ్రాసితిని. ఇంకను నీకు చెప్పదలచుకొన్న దెంతయో కలదు. జాబులో అదంతయు ఎట్లిముడగలదు ?

నేను చెప్పినట్లుగా నీ వదృష్టవంతురాలవు. మన దేశమున విజృంభించిన స్వాతంత్ర్యోద్యమము నీవు కన్నులార చూచుచున్నావు. మీఅమ్మ ఎంత ధైర్యశాలిని! ఎంత ఉత్తమురాలు! ఇట్టి తల్లి నీకుండుట ఎంత అదృష్టము. నీకెన్నడైన సంశయము కలిగినను, చిక్కులు తట స్థించినను ఆమెకన్న నీకు ప్రియమగు సఖు లెవరు?

ఉందునా యింక, చిట్టితల్లీ. హిందూదేశమునకు సేవచేయుటకై నీవు ధైర్యశాలిని వగు యోధాగ్రణి వగుదువుగాక. నీకు నా ప్రేమాశీస్సులు.

---

# 1

# సంవత్సరాది బహుమానము

సంవత్సరాది 1931.

నీవు ముస్సోరీలోను, నేను అలహాబాదులోను ఉన్నప్పుడు, రెండు సంవత్సరములక్రితము, నేను నీకు వ్రాసిన జాబులు జ్ఞాపకమున్నవా? అవి బాగున్నవని నీవు నాతో చెప్పియుంటివి. అట్టి జాబులను మరల వ్రాసి ఈ మన ప్రపంచమునుగూర్చిన అధికవిషయములు నీకు చెప్ప కూడదా యని యాలోచించుచుంటిని. కాని అట్లు చేయుటకు సంకోచించితిని. ప్రపంచముయొక్క గతచరిత్రను, మహాపురుషులను, నారీమణులను, మహత్కార్యములను స్మరించుట సంతోషముతోకూడిన పనియే. చరిత్ర చదువుట మంచిదే. అంతకన్న మనోజ్ఞమైన, సంతోషకరమైన విషయము చరిత్రను నిర్మించుటకు తోడ్పడుట. ఈ దేశములో నేడు చరిత్ర నిర్మింపబడుచున్నదన్న విషయము నీకు తెలిసినదేకదా! ఇండియాపూర్వచరిత్ర పెద్దదేకాని అది అజ్ఞాతముగా నున్నది. అందు కొంతభాగము విచారకరమైనది; దుఃఖకరమైనది. తలచుకొన్నచో మనము తలలువాల్చి కంట తడిపెట్టుకోవలసివచ్చును. కాని మొత్తముమీద ఇండియాపూర్వచరిత్ర దివ్యమైనది. మనము గర్వింపదగినది. తలచుకొని సమ్మోదము నందదగినది. అయినను పూర్వచరిత్ర స్మరించుటకు నేడు మనకు తీరిక లేదు. ఇండియాభావియే మన హృదయముల నాక్రమించుకొన్నది. ఈ భావికే మన మిప్పుడు రూపము నిచ్చుచున్నాము. మన కాలమును, శక్తిని దేని కొరకై వినియోగించుచున్నామో అట్టి వర్తమానముకూడ మన మనస్సుల నాక్రమించుకొన్నది.

ఇక్కడ నాయినీచెరసాలలో ఇష్టము వచ్చినట్లు చదువుటకుగాని, వ్రాయుటకుగాని నాకు తీరిక కలదు. కాని నామనస్సు కుదురుగా నుండుట

లేదు. బయట జరుగుచున్న గొప్ప పోరాటమునుగూర్చి నే నూహించు కొనుచుందును. ఇతరు లేమి చేయుచున్నారో, వారితో నున్న నే నేమి చేసియుండెడివాడనో యని ఆలోచించుకొనుచుందును. వర్తమానమును, భావియు నన్ను పూర్తిగా ఆక్రమించుకొన్నవి. గతకాలమునాటి విషయ ములను తడవుటకు నాకు తీరిక యేదీ? కాని నా యభిప్రాయము పొర పాటని నే ననుకొనుచున్నాను. బయట జరుగు కార్యములలో నేను కలుగజేసికొనలేనప్పుడు నే నేల విచారించవలెను?

అయితే నేను వ్రాయకుండుటకు నిజమైన కారణము—రహస్య ముగా నీ చెవిలో చెప్పుదునా—వేరొకటి యున్నది. నీకు బోధించుటకు నా కెంతమాత్రము జ్ఞానమున్నదని నేను సందేహించుచున్నాను. నీవా ఆనాటికానాడు వడివడిగా పెరుగుచున్నావు. జ్ఞానార్జన చేయుచున్నావు. నేను పాఠశాలలోను, కాలేజీలోను, తరువాతను నేర్చుకొన్నదంతయు నీకు నేర్పుటకు చాలినంత లేదు. అథవా అది నీకు తెలిసిన విషయమై చప్పగా నుండవచ్చును. కొంతకాలమైనపిమ్మట నీవే నాకు తెలియని విషయము లెన్నో బోధించవచ్చును. నీజన్మదినమున నీకు వ్రాసిన జాబులో చెప్పినట్లు నేను మిక్కిలి తెలివిగల పురుషునివంటివాడను కాను. తెలివి యధికమై పగిలిపోదునేమో యన్న భయముతో నాతడు రాగిరేకులను తనచుట్టును బిగించుకొన్నాడట.

నీవు ముస్సోరీలో నున్నప్పుడు ప్రపంచముయొక్క బాల్యమును గూర్చి నేను నీకు వ్రాసియుంటిని. అప్పుడు వ్రాయుట నాకు సులభము గానే యుండెను. ఏలయన ఆకాలమునకు సంబంధించిన విషయములు మనకు స్పష్టముగ తెలియవు. అతిప్రాచీనకాలమునుండి వెలువడినతోడనే చరిత్ర క్రమక్రమముగా ప్రారంభమగును. మానవుడు వివిధప్రాంతముల తన వింతజీవితయాత్ర ప్రారంభించును. ఒకప్పుడు వివేకయుక్తముగాను, వేరొకప్పుడు పిచ్చిగాను, తెలివితక్కువగాను ఉండు మానవుని చర్యలను గ్రహించుట సులభసాధ్యము కాదు. గ్రంథసహాయమున గ్రహించుటకు

మనము ప్రయత్నించవచ్చును. కాని నాయినిచెరసాలలో పుస్తకభాండా గారము లేదు. పూర్వాపరసందర్భములతో ప్రపంచచరిత్ర నీకు చెప్పవలె నని యున్నదిగాని అట్లు చేయుట సాధ్యముకాదని తోచుచున్నది. బాల బాలికలు ఒక్కదేశముయొక్క చరిత్రమాత్రమే నేర్చికొనుట—అదైనను ఏవో కొన్నిసంవత్సరములు, కొన్నియంశములు కింఠస్థముచేయుట—నా కెంతమాత్ర మిష్టములేదు. అన్యోన్యసంబంధము కలిగి సమగ్రముగా నుండునది చరిత్ర. ప్రపంచమున ఇతరభాగములందు జరుగు వృత్తాంత ములు తెలిసినగాని ఏయొక్క దేశచరిత్రయైనను నీ కర్థముకాదు. ఒకటిరెండు దేశములకు సంబంధించిన చరిత్రను మాత్రమే, యిట్టి సంకుచితపద్ధతిని నీవు నేర్చుకోవని నమ్ముచున్నాను. ప్రపంచచరిత్రను పరీక్షచేయుదు వనియు నమ్ముచున్నాను.

మన మనుకొనునట్లు వివిధమానవవర్గములలో గొప్పభేదము లేదని సదా జ్ఞప్తియం దుంచుకొనుము. పటములును, అట్లాసులును వేర్వేరు రంగులతో దేశములను మనకు ప్రదర్శించును. మానవులలో భేదములున్నమాట వాస్తవమేకాని వారిలో దగ్గరపోలికలుకూడ ఉన్నవి. పటములలోని రంగులనుబట్టిగాని, దేశముల పొలిమేరలనుబట్టిగాని మనము భ్రమపడరాదు. ఈ విషయమును మనము మనస్సులో పెట్టుకో వలెను.

నా కిష్టమున్న చరిత్రనుగూర్చి నేను నీకు వ్రాయజాలను. గత కాలమునుగూర్చియు, గతకాలమున నివసించి ప్రపంచనాట్యరంగమున పెద్దపాత్రలు ధరించినట్టి పురుషులనుగూర్చియు నీ కప్పుడప్పుడు వ్రాయుదును.

నా జాబులు నీ కిష్టముగా నుండునో లేదో, అవి నీ కౌతుకమును రేపెట్టునో లేదో నేను చెప్పలేను. నిజమునకు వాని నెప్పుడు నీవు చూతువో, అసలు చూతువో లేదోకూడ నాకు తెలియదు. చిత్రము! మన మింత సమీపములో నుండియు ఇంత దూరముగా నున్నాము. ముస్సోరీలో

నీవు ఎన్నియో వందలమైళ్లదూరములో నున్నావు. అయినను నా కిష్టమై నన్నిమారులు నేను నీకు జాబులు వ్రాయగలను. నిన్ను చూడవలెనని గట్టిగా బుద్ధిపుట్టిన నేను నీకడకు పరుగెత్తిరాగలను. ఇప్పుడు మనము యమునానది కద్దరిని ఇద్దరిని ఉన్నాముగదా! దూరములో లేముకదా! అయినను నాయినీచెరసాల ఎత్తైన గోడలు మనలను కలిసికోకుండ చేయు చున్నవి. పక్షమున కొకజాబు నేను వ్రాయవచ్చును. పక్షమున కొకజాబు నాకు రావచ్చును. పక్షమున కొకసారి ఇరువదినిముషములపాటు మిత్రులో, బంధువులో నన్ను సందర్శించి మాటాడుటకు రావచ్చును. అయినప్పటికి ఇట్టి కట్టుబాట్లు మంచివే. సులభముగా లభించు వస్తువులపై మనకు గౌరవ ముండదు. కారాగారానుభవము వాంఛింపదగిన విద్యాశిక్షణ యని నాకు నానాటికి నమ్మకము కలుగుచున్నది. ఎంత యదృష్టమోకాని నేడు మన దేశప్రజలు వేలకొద్ది యిట్టి విద్యాశిక్షణ నందుచున్నారు!

ఈ జాబులను నీవు చూచి ఇష్టపడుదువో లేదో నేను చెప్పజాలను. నా యానందముకొరకే నేను వీనిని వ్రాయ సంకల్పించితిని. అవి నిన్ను నా సమీపమునకు తీసికొనివచ్చును. నీతో సంభాషణ చేయుచున్నట్లే నేను భావించుకొందును. తరుచుగా నేను నిన్ను తలచుకొనుచుందును. ఈ రోజున నా మనస్సులో నీవు లేని క్షణము లేదు. ఈ దినము సంవత్సరాది. తెల్లవారుజామున పరుపుపై పరుండి నక్షత్రములను చూచుచు గతించిన సంవత్సరమునుగురించియు, అది తెచ్చిపెట్టిన ఆశలు, సంతాపములు, సంతోషములనుగురించియు, ఆచరించిన సాహసముతో కూడిన మహత్కార్యములనుగురించియు నేను మననముచేసితిని. ఎరవాడచెర సాలగదిలో కూర్చుండి, తన ఇంద్రజాలస్పర్శవల్ల మన మాతృదేశమునకు మరల యౌవనమును, శక్తిని కలిగించిన బాపుజీని స్మరించితిని. తాత*ను, ఇతరులను పెక్కురను స్మరించితిని. ముఖ్యముగా మీ అమ్మను, నిన్ను తలచుకొంటిని. తరువాత కొంతసేపటికి ఉదయమున వార్తవచ్చినది—

---

* ఇందిర తాతగారైన మోతీలాల్ నెహ్రూ.

మీ అమ్మను పట్టుకొని జైలుకు తీసికొనివెళ్లిరని. అది నా కింపైన ఉగాదిబహుమానము. ఇట్లు జరుగునని ఎంతకాలమునుండియో అనుకొనుచున్నాను. అమ్మ పూర్తిగా సుఖముగాను, సంతుష్టితోను ఉండుననుటకు సందేహము లేదు.

కాని నీవు ఒంటరివి అయితివి. పక్షమున కొకమారు నీవు అమ్మను చూడవచ్చును. పక్షమున కొకమారు నీవు నన్ను చూడవచ్చును. మా సందేశము ఒకరివి ఇంకొకరితో చెప్పవచ్చును. అయితే కాగితము, కలము తీసికొని నేను కూర్చుందును. నిన్ను తలచుకొందును. అప్పుడు నీవు సన్నసన్నగా నాపజ్జకు వత్తువు. మన మెన్నియోవిషయములనుగూర్చి ప్రసంగించుకొందము. గతకాలమునుగూర్చి కలలుకందము. గతకాలము కన్న భావికాలమును గొప్పగా చేయుటకు మార్గములు కనుగొందము. కాబట్టి ఈ సంవత్సరాదిదినమున మనము దృఢసంకల్పము చేసికొందము. ఈ సంవత్సర మవసానదశకు వచ్చి అంతమొందుటకుపూర్వమే మనము భావినిగూర్చి కన్న కలలను వర్తమానమునకు దగ్గరగా తీసికొని రాగలుగుటకు సంకల్పము చేసికొందము. ఇండియాగతచరిత్ర కొక దేదీప్యమానమగు పుటను చేర్పగలుగుటకు సంకల్పము చేసికొందము.

## 2

# చరిత్ర మనకేమి బోధించును?

జనవరి 5, 1931

చిట్టీ, నీకు నే నేమి వ్రాయను ? ఎక్కడ మొదలుపెట్టను ? గతకాలమును స్మరించినంతనే అసంఖ్యాకములగు చిత్రములు నా మనస్సులో పరుగులుదీయును. కొన్ని చిత్రములు మిగతవానికన్న ఎక్కువకాలము నిలుచును. అవి నాకు ప్రియమైనవి. వానినిగురించి నేను మననము చేయ ప్రారంభింతును. అనుకొనకుండనే గతసంఘటనలను నేటి

సంఘటనలతో పోల్చుదును. అందుండి నాకు మార్గదర్శకముగా నుండు ఉపదేశములను కనుగొనుటకు ప్రయత్నింతును. కాని మానవుని మనస్సు ఎంతటి వింత కలగూరగంప? సంబంధములేని ఆలోచనలు, క్రమము తప్పిన చిత్రములు దానినిండ యుండును. అది ఒక క్రమములో చిత్ర పటము లమర్చని ఒక చిత్రశాలవంటిది. అయితే తప్పు పూర్తిగా మనది కాదు. మనలో పెక్కురము తమ మనస్సులలో జరిగిన కార్యము లొక క్రమపద్ధతిని ఇంతకన్న చక్కగా నమర్చుకొనగలముకాని ఒక్కొక్క ప్పుడు ఆకార్యము లెంతో వింతగా క్లిష్టముగా నుండి ఏ క్రమపద్ధతిలోను ఇముడవు.

ప్రపంచము నెమ్మదిగానైనను నిస్సందేహముగా నభివృద్ధిజెందిన దనియు, సామాన్య అల్పజంతువులు పరిణమించి పెద్ద జంతువులుగా మారినవనియు, చివరకు ఉత్తమజంతువగు మానవుడు వచ్చినాడనియు, మేధాశక్తివలన నితరజంతువులను మించినాడనియు చరిత్ర మనకు బోధించవలయు నని ఇదివరలో నీకు వ్రాసియుంటి నని నాయూహ. అనాగరికస్థితినుండి నాగరికస్థితికి మానవుడు అభివృద్ధిచెందివచ్చుటయే చరిత్ర చెప్పవలసిన యంశ మందురు. జనులందరును కలిసిమెలిసి పని చేయవలె నను భావము—అనగా సహకారభావము ఎట్లు వృద్ధియైనదో నేను కొన్ని యుత్తరములలో వ్రాసియుంటిని. లోకకల్యాణముకొరకు మన మందరము కలిసి పనిచేయుట మన యాదర్శముగా పెట్టుకొనవలయు ననియు కొన్ని లేఖలలో నేను నీకు తెలియజేసితిని. కాని ఒక్కొక్కప్పుడు పెద్దచరిత్రభాగములను చూచినప్పుడు ఈ ఆదర్శము ముందడుగు వేసినదా యని సందేహము కలుగును; మనము నాగరీకులము, అభివృద్ధిచెందితిమి అని చెప్పుటకు నోరాడదు. నేడు సహకారలోపము కావలసినంత యున్నది. స్వార్థపరత్వముతో ఒక దేశ మింకొకదేశముపైని, ఒకజాతి యింకొక జాతిపైని బడి పీడించుచున్నవి. ఒక మానవు డింకొక మాన వుని లోబరుచుకొని లాభమందుచున్నాడు. కోట్లకొలది సంవత్సరముల

యభివృద్ధియనంతరమున మన మిట్టి హీనస్థితితో, లోపములతో నున్న ప్పుడు వివేకము, విజ్ఞానము గల మానవులవలె సంచరించుట నేర్చు కొనుటకు మరెంతకాలము పట్టునో! ఒక్కొక్కప్పుడు, మన కాలమున కంటెను మెరుగుగా కనిపించు గతకాలమునుగురించి మనము చరిత్రలో చదువుదుము. అప్పటివా రెక్కువ విజ్ఞానవంతులుగను, నాగరీకులుగను కనిపింతురు. ఇది చదివినప్పుడు మనలోకము ముందుకుపోవుచున్నదో, వెనుకకు పోవుచున్నదో చెప్పుట సందేహాస్పదముగా నుండును. గత కాలమున మన దేశచరిత్రలో, నిస్సంశయముగా, దీవ్యత్ఘట్టములు కలవు. నేటికాలమునకన్న నన్నివిధముల నుత్తమమైన వవి.

పలుదేశములలో గతకాలమున దివ్యఘట్టము లున్నమాట వాస్త వమే—ఇండియాలో, ఈజిప్టులో, చీనాలో, గ్రీసులో, ఇంకను ఇతర దేశములలో. ఈ దేశములలో అనేకము హీనస్థితికి పడిపోయిన మాట కూడ వాస్తవమే. ఇట్లు జరిగినప్పటికిని మన మధైర్యము జెందరాదు. ప్రపంచము విపులమైనది. కొంతకాలముపాటు ఒకదేశము ఉచ్చస్థితికి వచ్చినను, నీచస్థితికి పడిపోయినను దానివలన లాభముగాని, నష్టముగాని మొత్తము ప్రపంచమునకు ఉండదు.

నేటికాలమున పలువురు మన గొప్ప నాగరీకతను తలుచుకొనియు, శాస్త్రము కనిపెట్టిన యద్భుతవిషయములను తలుచుకొనియు మురిసి పోవుట కద్దు. శాస్త్రము అద్భుతవిషయములను కనిపెట్టినమాట నిజమే. శాస్త్రజ్ఞులు గౌరవార్హులే. కాని డాబులుకొట్టువా రెన్నడును గొప్పవారు కారు. అనేకవిషయములలో మానవు డితరజంతువుకన్న నెక్కువ యభి వృద్ధిలోనికి రాలేదని జ్ఞాపకముంచుకొనుట మంచిది. కొన్నివిషయములలో కొన్నిజంతువులు మానవునికన్న ఉత్తమస్థితిలో నున్నవని చెప్పవచ్చు నేమో. ఇది తెలివితక్కువమాటగా తోచవచ్చును. తెలివితక్కువ మను ష్యులు నవ్వవచ్చును. నీ విప్పుడే మీటర్లింకువ్రాసిన తేనెటీగజీవితమును గురించియు, చెదపురుగులను, చీమలను గురించియు చదివియున్నావు.

ఈ కీటకములు తమ సంఘముల నెట్లు క్రమపద్ధతిలో పెట్టుకొన్నవో చూచి నీ వాశ్చర్యపడియుందువు. చేతనములందెల్ల నీ కీటకములు మిక్కిలి నీచములని మనము వీనిని ఈసడింతుము. అయినప్పటికిని ఈ చిన్నజీవులు మానవునికంటె బాగుగా సహకారవిద్య నేర్చుకొన్నవి; సంఘక్షేమమునకై ఆత్మార్పణము చేయుట నేర్చుకొన్నవి. అన్యోన్య సహకారము, సంఘశ్రేయస్సును గోరి ఆత్మార్పణముచేయుట నాగరీక లక్షణములైనచో చెదపురుగులును, చీమలును మానవునికన్న మిన్నలని చెప్పక తప్పదు.

మన ప్రాచీనసంస్కృతగ్రంథములలో నొక శ్లోక మున్నది. దాని భావ మిది—"కుటుంబముకొరకు వ్యక్తిని పరిత్యజించుము. సంఘము కొరకు కుటుంబమును పరిత్యజించుము. దేశముకొరకు సంఘమును పరిత్యజించుము. ఆత్మకొరకు లోకమును పరిత్యజించుము" ఆత్మయన నేమో బహుకొద్దిమందికి తెలియును. వారు దానినిగురించి చెప్పగలరు. మనలో ప్రతియొక్కడు దానికి ఒక్కొక్కవిధముగా అర్థము చెప్పవచ్చును. కాని ఈ సంస్కృతశ్లోకమునుబట్టి మనము నేర్చుకొనవలసిన విషయము— సహకారము, సంఘక్షేమమునకై ఆత్మార్పణము. చాలకాలమునుండి మనము గొప్పతనమునకు దారిచూపు ఈపరమధర్మమును విస్మరించితిమి. అందువల్లనే పతితుల మైతిమి. కాని మరల నేడు దానిఛాయలు పొడగట్టు చున్నవి. దేశమునందు కదలిక పుట్టినది. పురుషులు, స్త్రీలు, బాలురు, బాలికలు చిరునవ్వుతో మాతృదేశవిముక్తికై కష్టములను, బాధలను గణించకుండ ముందంజవేయుట చూచిన ఎంత యాశ్చర్యకరముగా నుండును! వారు మందహాసము చేయవలసినదే. సంతోషముగా నుండవలసినదే. మహదుద్యమమున పాల్గొను ఆనందము వారిది కాదా! అం దదృష్టవంతులకు త్యాగానందముకూడ రాగలదు. నేడు మనము ఇండియాసంకెళ్లు సడలించుటకు ప్రయత్నించుచున్నాము. అది మహత్కార్యము. అంత కన్న మహత్కార్యము మానవకోటిశ్రేయస్సుకొరకు పనిచేయుట. బాధను,

దుఃఖమును పారదోలుటకు మానవకోటి చేయుచున్న పోరాటములో మన పోరాట మొక భాగమని మనము భావించుచున్నాము కాబట్టి లోకకల్యాణమునకు చేతనైనంతవరకు మనమును సహాయము చేయుచున్నట్లు భావించుకొని సంతసింపవచ్చును.

అంతదనుక నీవు ఆనందభవనములో కూర్చుండుము. మీ అమ్మమలకా చెరసాలలో కూర్చుండును. నేనీ నాయినీ చెరసాలలో కూర్చుందును. ఒకరి నొకరము చూచుకోలేకపోతిమిగదా యని అనుకొనుచుందుము కాదూ? మనము ముగ్గురము మరల కలిసికొనబోవు రోజును తలుచుకొనుము. ఆ రోజు ఎప్పుడు వచ్చునా యని నేను కనిపెట్టుకొనియుందును. ఆ యాలోచనవల్ల నా గుండెలో బరువు తగ్గినట్లుండును. నాకుత్సాహము కలుగును.

## 3

# ఇంకిలాబ్ జిందబాద్ *

జనవరి 7, 1931

ప్రియదర్శినీ,—దృష్టికి ప్రియముగానుందువు నీవు. దృష్టిసాధ్యము కానప్పుడు ప్రియతమవు. నీకు వ్రాయుటకు నేడు నేనిచ్చట కూర్చుండగా దూరముననుండి వచ్చు మేఘగర్జనములవలె అస్పష్టధ్వనులు నాకు వినిపించెను. అవి యెట్టిధ్వనులో మొట్టమొదట నాకు అవగతము కాలేదు. కాని ఆ ధ్వనులు నాకు పరిచితముగా వినిపించుచున్నవి. నా హృదయమున ప్రతిధ్వనించి ప్రత్యుత్తరము పొందుచున్నవి. క్రమక్రమముగా ఆ ధ్వనులు సమీపించుచున్నట్లున్నవి. పెద్దవగుచున్నవి. త్వరలోనే వాని నిజస్వరూపము తెలియవచ్చినది. "ఇంకిలాబ్ జిందబాద్!" "ఇంకిలాబ్ జిందబాద్" అను వీరహుంకారములకు కారాగారము మారుమ్రోసెను. ఆ

---

* 'ఇంకిలాబ్ జిందబాద్' అనగా 'విప్లవము చిరకాలము జీవించుగాక' యని అర్థము.

కేక విన్న మాహృదయములు సంతసించినవి. చెరసాలవెలుపల, మా కెంతో సమీపమందు మన రణదుందుభి మ్రోయించినవా రెవరో నాకు తెలియదు. వారు నగరమునుండి వచ్చిన స్త్రీ పురుషులో ? పల్లెలనుండి వచ్చిన జానపదులో ? నేడు వా రట్లు ఎట్టిసందర్భములో చేయుచున్నారో కారణ మూహింపలేను. వా రెవరైననేమి ? మా కుత్సాహము కల్పించిరి. వారి పరామర్శకు మేము మౌనముగా సమాధాన మిచ్చితిమి. ఆ సమాధానముతో మా యభినందనములును వెళ్ళినవి.

"ఇంకిలాబ్ జిందబాద్" అని మనమేల ఘోషింపవలెను? విప్లవమును, మార్పును మన మేల కోరవలెను ? నేడు ఇండియాలో గొప్ప మార్పు కలుగవలసియున్నమాట వాస్తవమే. కాని మన మందరము కోరు పెద్దమార్పు ఇండియాకు వచ్చినపిమ్మట, ఇండియా స్వాతంత్ర్యమును సాధించిన పిమ్మట మనము చేతులుకట్టుకొని కూర్చుండ వీలులేదు. ఈ లోకమున ప్రాణమున్న ప్రతిజీవియు మారుచునేయుండును. దినమునకు దినము, నిమిషమునకు నిమిషము ప్రకృతి సర్వమును మారును. ప్రాణము పోయిన జీవి మార్పుచెందదు. కదలక మెదలక పడియుండును. నదీజలము ప్రవహించుచుండును. దాని నడ్డిన మురిగిపోవును. మానవుని జీవితముకూడ అంతే. జాతిజీవితము కూడ అంతే. మన కిష్టమున్నను లేకున్నను ముసలితనము వచ్చును. శిశువులు చిన్నపిల్ల లగుదురు. చిన్న పిల్లలు స్త్రీ లగుదురు. స్త్రీలు ముదుసలు లగుదురు. ఈ మార్పులను మనము సహించియుండవలసినదే. కాని ప్రపంచము మారునని ఒప్పుకొననివారు పలువురున్నారు. వారు తమ మనస్సులను మూసికొని బీగము వేసికొందురు. నూతనాభిప్రాయములను వారు సమీపమునకు రానీయరు. స్వతంత్రముగా ఆలోచించుటకు వారు భయపడుదురు. కాని పర్యవసాన మేమి ? ఇట్టివా రున్నప్పటికిని ప్రపంచము కదలిపోవుచునేయున్నది. మారుచున్న పరిస్థితులలో ఇముడని యట్టివారును, వారివంటివారును ఉన్నారుకాబట్టి అప్పు డప్పుడు ఉత్పాతములు సంభవించుచున్నవి. పెద్ద విప్లవములు పుట్టు

చున్నవి. నూటనలుబది సంవత్సరముల క్రితము రేగిన ఫ్రెంచివిప్లవము, పదమూడుసంవత్సరముల క్రితము రేగిన రష్యన్‌విప్లవము అట్టివే. ఆ విధముగానే మనదేశమునందును నేడు మనము విప్లవముమధ్య నున్నాము. మనకు కావలసినది స్వాతంత్ర్యమే. కాని మనకు కావలసిన విషయము లింకను ఉన్నవి. మురుగుగుంటలను బాగుచేసి స్వచ్ఛజలము నంతటను ప్రవేశపెట్టవలసియున్నది. మనము మన దేశమునుండి మాలిన్యమును, దారిద్ర్యమును, దుఃఖమును తుడిచివేయవలెను. మనము చేయబూనిన ఘనకార్యములను గురించి ఆలోచించి సహకారముచేయుటకు పలువురి మనస్సులు సమ్మతించుటలేదు. చేతనైనంతవరకు అట్టివారి మనస్సుల నంటియున్న బూజునుకూడ మనము తుడిచివేయవలెను. మనము చేయ బూనినది గొప్ప పని. వెంటనే జరుగదు. కొంతకాలము పట్టునేమో. అయినా అధమపక్షము, దానిని కొంచెముముందుకు నెట్టుదము—ఇంకి లాబ్ జిందబాద్!

మన విప్లవగేహాళిపై మన మిప్పుడు నిల్చియున్నాము. భావికాల మున నేమి జరుగనున్నదో చెప్పలేము. మన కష్టములకు మంచి ప్రతి ఫలము వర్తమానమునందు సైతము మనకు ముట్టినది. హిందూదేశ స్త్రీలను పరికించుము, ఈ పోరాటమున వా రెంత గంభీరముగా ముందంజ వేసికొనిపోవుచున్నారో! శాంతముతోకూడిన ధైర్యము, స్థైర్యము—వా రెట్లు ఇతరులకు మార్గదర్శకులైయున్నారో. ఇక ఘోషామాట—మన ధీరాంగ్రగు సౌందర్యవతులను మరుగుపరచిన ఘోషా, వారికిని, వారి దేశమునకును చేటుతెచ్చిన ఘోషా—అది ఇప్పుడు ఎక్కడ నున్నది? ప్రాతకాలమునాటి వస్తువులను జాగ్రత్తపెట్టు వస్తుప్రదర్శనశాలల బీరువా లలో తలదాచుకొనుట కది చల్లగా జారుచున్నది కాదా?

పిల్లలను—బాలబాలికలనుకూడ పరికించుము—ఆ వానరసేనలు, ఆ బాలసభలు, ఆ బాలికాసభలు. ఈపిల్లల తల్లిదండ్రులు పెక్కురు

వెనుక భీరువులవలెను, బానిసలవలెను ప్రవర్తించియుండవచ్చును. కాని మన తరమునందలి బాలబాలికలు బానిసత్వమును, భీరుత్వమును సహింపలేరను మాట ఎవరు సందేహింప సాహసింతురు ?

ఈవిధముగా పరివర్తనచక్రము తిరుగుచుండును. క్రిందకు వచ్చినవారు పైకి పోవుదురు. పైకి వచ్చినవారు క్రిందికి పోవుదురు. మన దేశమున నాచక్రము ఇదివరలోనే తిరుగవలసినది. కాని ఈ మారు మనము దానిని గట్టిగా త్రిప్పి వదరితిమి. ఎవ్వరును దాని నాపలేరు.

ఇంకిలాబ్ జిందబాద్!

# 4

# ఆసియా : యూరోపు

జనవరి 8, 1931

ప్రతివస్తువును నిరంతరమును మారుచుండునని వెనుకటిజాబులో నేను చెప్పియుంటిని. అసలు చరిత్ర యనగా నేమి—పరివర్తన వృత్తాంతమేగదా ! గతకాలమున కొద్దిమార్పులే జరిగియున్నట్లయిన, వ్రాయదగ్గ చరిత్ర కొద్దిగానే యుండెడిది.

మనము బడులలోను, కళాశాలలలోను నేర్చుకొను చరిత్ర సామాన్యముగా హెచ్చుగా నుండదు. ఇతరులసంగతి నాకు అట్టే తెలియదు కాని నా సంగతి చెప్పవలసివచ్చిన బడిలో నేను నేర్చుకొన్న చరిత్ర బహుకొద్ది. హిందూదేశచరిత్రను కొద్దిగా, బహుకొద్దిగా నేర్చుకొంటిని. ఇంగ్లాండు దేశచరిత్ర కొద్దిగా నేర్చుకొంటిని. నేను నేర్చుకొన్న హిందూదేశచరిత్రయైనను చాలభాగము తప్పు; లేదా వికృతరూపము ధరించినది. దానిని వ్రాసినవారు మన దేశముపై సవతితల్లిప్రేమ కలవారు. ఇతర దేశముల చరిత్రనుగురించి నేను నేర్చుకొన్నది అంతంత. కళాశాలను వదలిపెట్టిన పిమ్మటనే యథార్థ చరిత్రమును కొంత నే నభ్యసించితిని.

అదృష్టవశమున నా జ్ఞానమును వృద్ధిచేసికొనుటకు సావకాశము నాకు నా కారాగారావాస మొసగెను.

ఇండియా ప్రాచీననాగరీకతను గురించియు, ద్రావిడులనుగురించియు, ఆర్యుల యాగమనమును గురించియు ఇదివరలో నీకు వ్రాసిన జాబులలో చెప్పియుంటిని. ఆర్యుల రాకకుముందున్న కాలమునుగురించి నేను వ్రాయలేదు. నాకు దానిని గురించి అట్టే తెలియదు. ఈ మధ్యనే కొద్ది సంవత్సరములకు లోపుగనే, మిక్కిలి ప్రాచీన నాగరికతా శిథిలములు ఇండియాలో కనుగొనబడినవన్న విషయము నీ కుత్సాహము కలిగించవచ్చును. ఇవి ఇండియాకు వాయవ్యదిశను మొహంజొదారొ అనే గ్రామపరిసరముల నున్నవి. బహుశా 5000 సంవత్సరములకు పూర్వమందున్న కాలమునకు సంబంధించిన ఈ శిథిలములను త్రవ్వితీసిరి. ఈజిప్టులోని రక్షిత మానవకశేబరములవంటి కశేబరములుకూడ కనుగొనబడినవి. ఇదంతయు ఆర్యులు వచ్చుటకు పూర్వము - వేలకొద్ది సంవత్సరముల క్రితముసుమా! అప్పుడు యూరోపు ఒక అరణ్యమై యుండును.

నేడు యూరోపు బలముగాను, శక్తివంతముగాను ఉన్నది. అందలి ప్రజలు ప్రపంచమునందంతలోను నాగరీకులమనియు, విజ్ఞానవంతుల మనియు ననుకొనుచున్నారు. ఆసియాయన్నను, ఆసియాలోని ప్రజలన్నను వారికి ఈసడింపు. ఆసియాఖండమందలి దేశములకు వచ్చి చేతచిక్కిన దెల్ల వా రాదేశములనుండి గ్రహించుచున్నారు. కాల మెట్లు మారినది! యూరోపును, ఆసియాను పరిశీలించి చూతము. అట్లాసును తెరిచిచూడుము. పెద్దదగు ఆసియాఖండమున కంటుకొని చిన్నదగు యూరోపు ఎట్లున్నదో చూడుము. ఆసియా కొద్దిగా విస్తరించుటవల్ల యూరోపు తయారైనట్లున్నది. నీవు చరిత్ర చదివినప్పుడు నీకు విశదమగు విషయ మేమనగా—దీర్ఘమగు కొన్నికాలములపాటు ఆసియా ప్రబలముగా నుండెను. ఆసియాప్రజలు తడవులుతడవులుగావెళ్ళి యూరో

పును జయించిరి. యూరోపును వారు ధ్వంసముచేసిరి. యూరోపునకు వారు నాగరీకము నిచ్చిరి. ఆర్యులు, సిథియనులు, హూణులు, అరబ్బులు, మంగోలులు, తురుష్కులు—వీరందరును ఆసియా ఏమూలనుండియో వచ్చి ఆసియాయూరోపులను క్రమ్ముకొనిరి. జట్టిమిడుతలవలె అధిక సంఖ్యాకులగు వీరిని ఆసియా ఉత్పత్తిచేసినది. నిజమునకు యూరోపు చిరకాలము ఆసియావలసభూమిగా నుండెను. నేటి యూరోపులో నున్న ప్రజలు పెక్కురు ఆసియానుండి దండెత్తిపోయినవారి సంతానమే. కాళ్లు చేతులు చాపుకొని పడియున్న గొప్ప ఎద్దెరాక్షసుని మాదిరి దేశపటమున కడ్డముగా ఆసియా వ్యాపించియున్నది, యూరోపు చిన్నది. ఇట్లనిన పరిమాణమునుబట్టి ఆసియా గొప్పదనియు, యూరోపు పరిగణింపదగ్గది కాదనియు అర్థముచేసికొనరాదు. ఒక మానవునియొక్కగాని, దేశము యొక్కగాని ఘనతను నిర్ణయించుటకు పరిమాణము తుచ్ఛసాధన మగుచున్నది. ఖండములలోకెల్ల చిన్నదైనను యూరోపు నేడు ఉన్నత స్థితిలో నున్నదని మనకు తెలియును. ఆ ఖండమందలి దేశము లనేకము నకు దివ్యమగు చరిత్రభాగము లుండినవనికూడ మనకు తెలియును. ఆదేశములలో గొప్పశాస్త్రజ్ఞులు పుట్టిరి. వారు క్రొత్తవిషయములు కని పెట్టుటవల్లను, నూతనసాధనములు కల్పించుటవల్లను మానవనాగరీకమును అత్యుచ్చస్థితికి తెచ్చిరి. కోట్లకొలది స్త్రీ పురుషుల జీవితభారమును తగ్గించిరి. ఆదేశములలో గొప్ప గ్రంథకర్తలు, తత్త్వజ్ఞులు, చిత్ర కారులు, గాయకులు, కార్యశూరులు ఉద్భవించిరి. యూరోపు ఘనతను ఒప్పుకొనకుండుట తెలివితక్కువ.

కాని ఆసియాఘనతను మరచిపోవుటకూడ అంతటి తెలివితక్కువే. యూరోపు తళుకుబెళుకులు కొద్దిగాచూచి మనము మోసపోయి, గత మును విస్మరించవచ్చును. ఆసియాలోనే తత్త్వజ్ఞులు తలచూపిరి. లోక మున వారిప్రభావ మప్రతిమాన మైనది. ప్రధానమతములను స్థాపించిన ఆచార్యపురుషులు వారు. ఈ విషయము మనము మరచిపోరాదు. నేడున్న

మతము లన్నింటికన్న ప్రాచీనమైన హిందూమతమునకు జన్మభూమి ఆసియా. నేడు చీనాదేశములోను, జపాను, బర్మా, టిబెట్టు, సిలోను దేశములలోను కాలు నిలువద్రొక్కుకొన్న సోదరమతము బౌద్ధముకూడ ఆసియాలో జన్మించినదే. యూదుల మతము, క్రైస్తవమతముకూడ ఆసియాలో పుట్టినవే. ఆసియాకు పశ్చిమతీరమందున్న పాలస్తీనాలో నవి తలయెత్తినవి. పారశీకుల మతమగు జొరాష్ట్రియన్ మతము పర్షియాలో ప్రారంభమైనది. అరేబియాదేశములోని మక్కాపట్టణమున మహమ్మదు ప్రవక్త జన్మించెను. కృష్ణుడు, బుద్ధుడు, జొరాష్ట్రరు, క్రీస్తు, మహమ్మదు, చీనాదేశ తత్త్వజ్ఞులగు కంఫ్యూసియసు, లావోచే—ఆసియాలో పుట్టిన తత్త్వజ్ఞుల పేళ్ళతో పేజీలు నింపవచ్చును. ఆసియాలోని కార్యవాదుల పేళ్ళతో కూడ పేజీలు నింపవచ్చును. ప్రాతకాలములో ఈ మన ప్రాత ఖండము ఎంత గొప్పగా, వీర్యవంతముగా నుండెడిదో ఇంకను అనేక విధములుగా నేను చెప్పగలను.

కాల మెట్లు మారినదో! మన కన్నులయెదుట కాలము మరల మారుచున్నది. సామాన్యముగా శతాబ్దులగుండ చరిత్ర మెల్లగా పనిచేయుచు పోవును. అప్పుడప్పుడు తొందరగా పోవుట, ఉత్పాతముపుట్టుటకూడ కద్దు. అయినను నేడు ఆసియాలో అది తొందరగా పోవుచున్నది. దీర్ఘ నిద్రనుండి ఈ ప్రాత ఖండము మేల్కొనుచున్నది. ప్రపంచము దానిని పరికించిచూచుచున్నది. ఎందుకనగా భావికాలమున ఆసియా ప్రాముఖ్య మధికముగా వహింపబోవుచున్నదని యందరికిని తెలియును.

## 5

# ప్రాతనాగరికతలు: మన వారసత్వము

జనవరి 9, 1931

వారమునకు రెండుసారులు బాహ్యప్రపంచవర్తమానములు కొన్ని హిందీవార్తాపత్రికయగు 'భారత్' మాకందిచ్చుచుండును. మలక్కాచెర

సాలలో అమ్మను సరిగా చూచుట లేదని నిన్న ఆ పత్రికలో చదివితిని. నాకు కొద్దిగా కోపము వచ్చినది. మనస్సు వికలమైనది. 'భారత్'లో ప్రకటించిన వదంతి యథార్థము కాదేమో. దానినిగురించి సందేహములో పడుటకూడ మంచిది కాదు. ఆత్మార్థము బాధ, ఇబ్బంది సహించుట సులభమే. అది అందటికిని మంచిదే. లేకున్న మనము మరీ మెత్తని మనస్సుకలవార మగుదుము. ప్రేమాస్పదులగు మనవారు పడుచున్న బాధలను తలచుకొనుట—అందు ముఖ్యముగా మన మేమియు చేయలేని స్థితిలో నున్నప్పుడు—సులభమును కాదు, సుఖకరమును కాదు. 'భారత్' పత్రిక చదువుటవల్ల నామనస్సులో పుట్టిన సందేహమువల్ల అమ్మను తలచుకొని వ్యాకులపడుచున్నాను. ఆమె ధీరురాలు; ఆడుసింహముహృదయమువంటి హృదయ మామెది. కాని యామె దుర్బలశరీర. ఆమెశరీరము మరీ దుర్బలమగుట నా కనిష్టము. మన మెంత వజ్రహృదయులమైనప్పటికి, మన శరీరములు దుర్బలముగా నున్నప్పుడు మన మేమి చేయగలము? ఏకార్యమునైనను చక్కగా చేయవలెనన్న మన కారోగ్య ముండవలెను. బల ముండవలెను. దృఢకాయము లుండవలెను.

అమ్మను లక్నో పంపించుదురట. అది మంచిదే యని తోచుచున్నది. అక్కడ ఆమెకు సదుపాయము లెక్కువగా ఉండవచ్చును. సుఖముగా ఉండవచ్చును. లక్నోచెరసాలలో సహచరులు కొందరుందురు. మలక్కాలో ఆమె బహుశా ఒంటరిగా నున్నదికాబోలు. అయినప్పటికిని ఆమె దూరముగా లేదుగదా యని యనుకొనుట సంతోషకరము. మా చెరసాలకు నాలుగైదుమైళ్ళ దూరములోనే ఆమె ఉండుట. కాని ఇది తెలివితక్కువభ్రమ. రెండు చెరసాలల ఎత్తుగోడలు మధ్యగా నున్నప్పుడు 5 మైళ్లైనను 150 మైళ్లైనను ఒక్కటే.

తాత అలహాబాదుకు తిరిగివచ్చినారనియు, కులాసాగా ఉన్నారనియు విని సంతోషించితిని. మలక్కాచెరసాలలో ఉన్న అమ్మను చూచుటకు వెళ్ళినారనికూడ విని చాల సంతోషించితిని. బహుశా రేపు, అదృష్ట

మున్న, మిమ్మందరిని చూడగలను. రేపు నాకు సమావేశదినము. ములా కత్ కాదిన్ చెరసాలలో గొప్ప రోజు. తాతను చూచి రెండునెల లయినది. తాతను చూచి, నిజముగా కులాసాగా ఉన్నది లేనిది తెలిసికొందును. పక్షముదినములైనవి నిన్ను చూచి. ఇంత దీర్ఘకాలమైనపిమ్మట నిన్ను చూడగలను. అమ్మవర్తమానమును, నీవర్తమానమును అప్పుడు నీవు నాకు చెప్పుదువుకానిలే.

అయ్యో! ప్రాచీనచరిత్రనుగూర్చి నీకు వ్రాయుటకు కూర్చుండి చిల్లరవిషయములనుగూర్చి వ్రాయుచున్నాను. వర్తమానమును ప్రస్తుతము మరిచిపోదము. 2000, లేదా 3000 సంవత్సరముల వెనుకకు పోదము.

ఈజిప్తునుగూర్చియు, క్రీటులోని ప్రాచీననగరమగు క్నోసోస్‌ను గూర్చియు కొద్దిగా ఇదివరలో నీకు వ్రాసియుంటిని. ప్రాచీననాగరికతలు ఈ రెండు దేశములలోను, నేడు ఇరాక్, లేదా మెసపొటేమియా అని పిలువబడు దేశములోను, చీనాలోను, ఇండియాలోను, గ్రీసులోను వేళ్ళు తన్నినవని చెప్పియుంటిని. మిగతవానికన్న గ్రీసు కొంచెము ఆలస్యముగా వచ్చియుండును. కాన ఇండియాలోని నాగరికత సాటినాగరికతలుగల ఈజిప్టు, చీనా, ఇరాక్ నాగరికతలతో వయస్సున సమానమగుచున్నది. ప్రాచీనగ్రీసుదేశముసైతము వీని చెల్లెలే. ఈ ప్రాచీననాగరికత లేమైనట్లు? క్నోసోస్ నామమాత్రావశిష్టమైనది. సుమారు 3000 సంవత్సరములకు పూర్వమే అది అంతరించినది. చిన్నదైన గ్రీసునాగరికతకు సంబంధించిన ప్రజలు వచ్చి దానిని నాశముచేసిరి. ఈజిప్టుయొక్క ప్రాచీననాగరికత వేలకొలది సంవత్సరములు దివ్యముగా వెలిగి అంతరించినది. గొప్ప పిరమిడులు, స్ఫింగ్సువిగ్రహము, గొప్ప దేవాలయముల శిథిలములు, రక్షితమానవకళేబరములు మున్నగునవి తప్ప నాగరికచిహ్నము లేమియు మిగులలేదు. ఈజిప్టుదేశ మక్కడనే యున్నది. నైలునది పూర్వమువలె ప్రవహించుచునేయున్నది. ఇతరదేశములందువలెనే స్త్రీ పురుషు లందు నివసించియున్నారు. కాని నేడు నివసించు ప్రజలకును,

వారి దేశముయొక్క ప్రాచీననాగరికతకును సంబంధము తెగిపోయినది. ఇరాక్, పర్షియాదేశముల మాట—ఎన్ని సామ్రాజ్యము లందు వెలిసినవి కావు, ఒకదానివెనుక నొకటి అంతరించినవి కావు! ప్రాచీనతమమైన పేళ్లు చెప్పిన చాలును—బాబిలోనియా, అస్సీరియా, చాల్డియా మహా నగరములగు బాబిలన్, నినేవాల మాట. బైబిలులోని ప్రాతనిబంధనలో ఈ ప్రజల వృత్తాంతము కలదు. కొంతకాలమైనపిమ్మట, ప్రాచీనచరిత్ర కాకరమైన ఈ భూమిలో ఇతరసామ్రాజ్యములు వర్ధిల్లినవి. తరువాత వర్ధిల్లుట మానినవి. ఇక్కడ బాగ్దాదు ఉండెను—అరేబియన్ రాత్రుల కథలలో వచ్చు అద్భుతనగరము. కాని సామ్రాజ్యములు వచ్చును, సామ్రాజ్యములు పోవును. నిరుపమానశౌర్యోపేతులు, అభిమానపూరితులు నగు రాజులు, చక్రవర్తులు కొంచెముకాలమే ప్రపంచనాటకరంగమున సగర్వముగా సంచరింతురు. కాని నాగరికతలు నశించవు. అవి నిలిచి యుండును. ఇరాక్, పర్షియాలలోమాత్రము ప్రాచీననాగరికత, ఈజిప్టు ప్రాచీన నాగరికతవలెనే, పూర్తిగా అంతరించెను.

ప్రాచీనకాలమున గ్రీసు ఉన్నతస్థితియం దుండెను. ఇప్పుడుకూడ దాని ప్రఖ్యాతినిగూర్చి ప్రజ లాశ్చర్యముతో చదువుదురు. చలువరాతివిగ్ర హముల సౌందర్యమును తిలకించునప్పుడు మనలో గౌరవాశ్చర్యములు పెనగొనును. మనవరకును వచ్చిన దాని ప్రాచీనసారస్వతఖండములను పఠించునపుడు విస్మయమును,పూజ్యభావమును కలుగును.నవీనయూరోపు, కొన్నివిధములుగా చూచిన, ప్రాచీనగ్రీసుయొక్క బిడ్డయే యని చెప్పు దురు. ఆ మాట నిజమే. గ్రీకుల అభిప్రాయములును, ఆచారములును యూరోపుపై తమ ప్రభావమును అంతగా చూపినవి. కాని గ్రీసుప్రఖ్యాతి నే డెచ్చట నున్నది? ప్రాచీననాగరికము అంతరించి ఎంతకాలమో గడచినది. క్రొత్తపద్ధతులు ప్రవేశించినవి. నేడు గ్రీసు యూరోపుకు ఆగ్నేయముగా నున్న ఒక చిన్న దేశముమాత్రమే.

ఈజిప్టు, క్నోసోస్, ఇరాక్, గ్రీసు—ఇవన్నియు మాయమైనవి. వాని ప్రాచీననాగరికతలు, బాబిలన్, నినేవానగరములవలెనే అంతరించి

నవి. అయితే ఈ ప్రాచీననాగరీకముల కూటములోని మిగత యిద్దరు వృద్ధులమాట యేమిటి? చీనాఇండియాల మాట యేమిటి? ఇతరదేశము లందువలెనే సామ్రాజ్యముతరువాత సామ్రాజ్యము ఈ దేశములందును పుట్టినవి. దండయాత్రలు, విధ్వంసములు, దోపుళ్ళు బ్రహ్మాండముగా జరిగినవి. వందల సంవత్సరములు రాజవంశము లేలినవి. వానికి బదులు క్రొత్తవంశములు వచ్చినవి. ఇతరదేశములందువలెనే ఇండియాలోను, చీనాలోనుకూడ ఇట్లు సంభవించినది. కాని ఇండియాచీనాలలోతప్ప మరెచ్చటను నాగరీకము అజ్యధారవలె ఎడతెగక సాగలేదు. ఈ రెండు దేశములందును మార్పులు వచ్చినప్పటికిని, యుద్ధములు, దండయాత్రలు సంభవించినప్పటికిని ప్రాచీననాగరీకతంతువు ఒక్కవిధిని సాగిపోయినది. ఈ రెండుదేశములును తమ యుచ్చస్థితినుండి చాలవరకు జారినమాట వాస్తవమే. దీర్ఘకాలము గడచుటవల్ల ప్రాచీనవిజ్ఞానములపై కుప్పలుగా దుమ్మును, ఒకప్పుడు మాలిన్యమునుకూడ పడినమాట వాస్తవమే. అయి నప్పటికిని అవి నిలిచియున్నవి. ప్రాచీన హిందూనాగరికత నేడుకూడ హైందవజీవితమునకాధారముగానున్నది. నేడు ప్రపంచమున నూతనపరిస్థితు లేర్పడినవి. పొగయోడలు, రైళ్లు, కర్మాగారములు వచ్చుటవల్ల ప్రపంచ స్వరూపమే మారిపోయినది. ఇండియాస్వరూపమునుకూడ అవి మార్చ వచ్చునేమో, అప్పుడే మార్చుచున్నవికూడ. ఐతే చరిత్ర ఉదయించినది మొదలు,మన కాలమువరకు, దీర్ఘయుగములగుండ నిరంతరాయముగ సాగిన హైందవవిజ్ఞాన నాగరికతలను తలచుకొన్న ముచ్చటగానేకాదు, విస్మయజనకముగకూడ ఉండును.ఒకవిధముగాచూచిన ఇండియాలోనున్న మనము ఆ వేలకొలది సంవత్సరములకు వారసులము. బ్రహ్మావర్త మనియు, ఆర్యావర్త మనియు, భారతవర్ష మనియు, హిందూస్థాన మనియు పేరుగడించిన సుక్షేత్రములలోనికి వాయవ్యకనుమలగుండా దిగినప్రాచీనుల వంశవృక్షములోనివారమే బహుశా మనము. కొండకనుముల గుండ దిగి ఈ క్రొత్తదేశమునకు వారు నడిచివచ్చుచుండుట నీకు కన

బడుట లేదా ? ధైర్యముతో, తెగువతో ఏమి రానున్నదో యని భయ పడక ముందుకు పోవుటకు వారు సాహసించిరి. మృత్యువే తటస్థించినను వారు లెక్కచేయలేదు. చిరునగవుతో దాని నెదుర్కొనిరి. జీవితముపై వారికి ప్రీతి మెండు. భయము లేకుండుట, అపజయము విపత్తులు వచ్చి నప్పుడు మనోవైకల్యమును జెందకుండుటవల్లనే జీవితసుఖముల ననుభ వించవచ్చునని వా రెరుగుదురు. భయరహితులవద్దకు అపజయమును, విపత్తులును రావు. ఆ మన పూర్వికులను, దూరబంధువులను ఒకమారు తలచుకొనుము. నడిచినడిచి వచ్చి, సముద్రమును చేరుటకు గంభీర ముగా ప్రవహించుచున్న గంగానదీతీరమును వారు హఠాత్తుగా చేరుట తలచుకొనుము. గంగానదీతీరదర్శనము వారి కెంత ప్రమోదమును గూర్చి నదో. గంగానదికి వారు ప్రణమిల్లిరన నాశ్చర్యమేమి ? సమృద్ధము, శ్రావ్యము నగు వారిభాషతో స్తుతించిరన నాశ్చర్యమేమి ?

ఈ యుగములకు వారసుల మనుకొనుట ఎంత గొప్పగా నున్నది. కాని మనము దురహంకారము చెందరాదు. ఈ యుగములకు వారసుల మన్నప్పుడు మంచికిని వారసులమే, చెడ్డకును వారసులమే. ఇండియా లోని ఈ మన వారసత్వపు ఆస్తిలో చెడుగు చాల చేరినది. ప్రపంచ ములో మన మధమస్థానమున నుండుట కది కారణము. దివ్యమగు మనదేశము దారిద్ర్యములో పడిపోవుట కది కారణము. మన దేశ మితరులచేతులలో ఆటబొమ్మ యగుట కది కారణము. ఈ పరిస్థితు లిక ముందు ఎంతమాత్రము సాగకూడదని మనము నిశ్చయించుకొంటిమి కాదా ?

## 6
# హెల్లనీలు

జనవరి 10, 1931.

ఈరోజున నన్ను చూచుటకు మీ రెవ్వరును రాలేదు. ములాకత్-కా దిన్ వట్టి శుష్కదిన మైపోయినది. నా కాశాభంగ మైనది. సమావేశ

మిప్పుడు జరుగక ఇంకొకమారు జరుగుననుట కిచ్చిన కారణము విచార కరముగా నున్నది. తాత కులాసాగా లేరని మాకు తెలిసినది. సరి, ఇక ఈరోజున సమావేశము జరుగదని తెలిసికొని నా రాటమువద్దకు వెళ్ళి కొంతసేపు వడకితిని. నేను అనుభవమువల్ల తెలిసికొనిన విషయ మేమనగా — రాటముమీద నూలువడకుట, నవారునేయుట మనస్సున కానందమును, ఊరటను కల్పించు నని. కాబట్టి సంశయాత్మ వైనప్పుడు నూలువడకుము !

వెనుకటి జాబులో యూరోపు, ఆసియాల భేదసాదృశ్యములను గమనించితిమి. ప్రాతయూరోపును — ఎట్లున్నదని యూహింపబడు చున్నదో యట్టి ప్రాతయూరోపును — ఒకమారు కొంచెము చూతము. చాలకాలమువఱకు యూరో పనగా మధ్యధరాసముద్ర ప్రాంతములందున్న దేశము లనియే యభిప్రాయము. ఆ రోజులలో యూరోపు ఖండమందలి యుత్తరదేశములను గూర్చి చెప్ప ఆధారము లేమియు లేవు. జర్మనీ, ఇంగ్లాండు, ఫ్రాంసు దేశములలో అనాగరికజాతులు నివసించుచుండి రని మధ్యధరాసముద్రప్రాంత జనులు ఊహించుచుండిరి. అసలు ప్రారంభమున, నాగరీకము తూర్పు మధ్యధరా ప్రాంతములలోనే నెల కొనిన దని యూహింపబడుచున్నది. ఈజిప్టును (ఇది ఆఫ్రికాలోనున్నది సుమా, యూరోపులో కాదు). క్నోసోసును ప్రప్రథమమున ముందంజ వేసిన దేశములు. క్రమక్రమముగా ఆసియానుండి ఆర్యులు పడమటి దిక్కునకు బహుసంఖ్యాకులుగా వచ్చిపడి, గ్రీసుమీదను, సమీపదేశముల మీదను దండయాత్రలు సాగించిరి. వీరే ఆర్యులగు గ్రీకులు. వీరినే మన మెరుగుదుము. ప్రాచీన గ్రీకులని మెచ్చుకొనుచున్నాము. బహుశా అంతకుముందు ఇండియాలో ప్రవేశించిన ఆర్యులకును, వీరికిని మొదట అధిక భేదములు లేవని నే ననుకొందును. తరువాత భేదములు ప్రవేశించి యుండవలెను. క్రమక్రమముగా ఆర్యుల ఈ రెండు శాఖలును అంతకంత కెక్కువగా వేరుపడిపోయినవి. అప్పటికే ఇండియాలో నున్న, అంతకన్న

ప్రాచీనమైన నాగరికత ఇండియాకువచ్చిన ఆర్యులపై తన ప్రాభవమును చూపినది. అది ద్రావిడుల నాగరికత కావచ్చును. లేదా మొహెంజొదారో వద్ద నేడు మనము చూచు శిథిలములకు సంబంధించిన నాగరీకావశేషము కావచ్చును. ఆర్యులు ద్రావిడులనుండి ఎన్నో విషయములు నేర్చుకొనిరి. వారి కెన్నో విషయములు నేర్పిరి. అట్లే ద్రావిడు లార్యులనుండి ఎన్నో విషయములు నేర్చుకొనిరి. వారి కెన్నో విషయములు నేర్పిరి. ఈ విధముగా వా రుభయులును కలిసి ఉమ్మడిగా ఇండియాలో విజ్ఞానమును సృష్టించిరి.

ఇట్లే ఆర్యగ్రీకులు గ్రీసుకు వచ్చినప్పుడు అచ్చట క్నోసోస్ యొక్క ప్రాచీన నాగరికత వర్ధిల్లుచున్నది. వారిపై ఈ నాగరికత తన ప్రభావము నధికముగా చూపియుండవలెను. అయినను, వారు క్నోసోసును నాశనముచేసిరి, దాని బాహ్యనాగరికతను హెచ్చుభాగము నాశనము చేసిరి. దాని శిథిలములపై తమ నాగరికతను నిర్మించుకొనిరి. ఆ రోజులలో ఆర్య ఇండియనులును, ఆర్య గ్రీకులును మోటుగా నుండిరనియు, యుద్ధప్రవీణులనియు మనము జ్ఞాపకముంచుకొనవలెను. వారు వీర్యవంతులు. వారికి తటస్థించిన దేశములలో ఎక్కువ నాగరీకులైన ప్రజలుండి వారు మెత్తనివారైనచో వారిని నాశనముచేయుచుండిరి. లేదా వారిని తమలో కలుపుకొనుచుండిరి.

క్రీస్తు పుట్టుకకు సుమారు 1000 సంవత్సరముల ముందు క్నోసోస్ నాశనముచేయబడెను. క్రొత్తగా వచ్చిన గ్రీకులు గ్రీసులోను, తత్ప్రాంత ద్వీపములలోను స్థిరనివాసము లేర్పరుచుకొనిరి. సముద్రమార్గముగుండా ఆసియామైనరు పశ్చిమతీరమునకును, దక్షిణ ఇటలీకిని, సిసిలీకిని, ఫ్రాంసు దక్షిణమునకు సైతము వారు వెళ్ళిరి. ఫ్రాంసులోని మార్సెల్సు పట్టణమును వారు స్థాపించిరి. కాని బహుశా వారు వెళ్లుటకు ముందే ఫొనీషియను లచట నివాస మేర్పాటుచేసికొని యుందురు. నీకు జ్ఞాపకమున్నదో లేదో—ఫొనీషియనులు ఆసియామైనరులోని ఒక

గొప్ప నావికజాతివారు. వర్తకమునకై వారు నాలుగు దిక్కులకు వెళ్లు చుండిరి. ఇంగ్లాండు అనాగరిక దేశముగా నున్న ఆ రోజులలో, జిబ్రాల్టరు జలసంధి ద్వారా పోవుట ప్రమాదకరమైనప్పటికిని. వారు ఇంగ్లాండును సైతము చేరిరి.

గ్రీసు దేశములో ప్రఖ్యాత నగరములు వెలిసినవి: ఏథెన్సు, స్పార్టా, థీబ్సు, కోరింత్. గ్రీకులనే హెల్లనీ లందురు. వారి తొలినాళ్ళ ముచ్చటలు రెండు మహాకావ్యములలో వర్ణింపబడినవి. అవి 'ఇలియడ్' 'ఒడిస్సె' అను పేర్లుగలవి. వీనిని గురించి నీకు కొంచెముగా తెలియును గదా. అవి మన రామాయణ మహాభారతముల వంటివే. అంధకవియగు హోమరు వానిని రచించెను. పారిస్ అనువాడు హెలెన్ అను సుందరిని తన పట్టణమైన ట్రాయికి కొంపోయినట్లును, గ్రీకురాజులును, ప్రముఖులును ఆమెను తిరిగి వశపరుచుకొనుటకు ట్రాయిపట్టణమును ముట్టడించినట్లును ఇలియడ్ చెప్పుచున్నది. ఒడిసస్ (యులిసస్) అనువాడు ట్రాయి ముట్టడినుండి తిరిగి వచ్చుచు చేసిన ప్రయాణములను ఒడిస్సె వర్ణించుచున్నది. ఆసియామైనరులో, తీరమునకు సమీపమున నీ ట్రాయి పట్టణముండెను. ఇప్పు డది లేదు. అది అంతరించి యెంతోకాలమైనది. కాని ఆ కవిప్రతిభ దాని కమరత్వ మిచ్చినది.

హెల్లనులు (గ్రీకులు) త్వరత్వరగా (కొద్దికాలమే నిలిచిన) ఉచ్చ స్థితి నందుచున్న కాలములో వేరొకజాతి చల్లగా తలయెత్తుచుండెను. తరువాత ఆ జాతి గ్రీసును జయించి దానిస్థానము నాక్రమించెను. ఈ కాలముననే రోముపట్టణము ప్రతిష్ఠింపబడినదని చెప్పుదురు. ప్రపంచ రంగమున పలువందల సంవత్సరములవరకు అది ముఖ్యపాత్రను ధరించలేదు. కాని శతాబ్దులకాలము యూరోపులో అగ్రస్థానము పొంది, "ప్రపంచలక్ష్మి" యనియు, "శాశ్వత నగర"మనియు పేరొందిన గొప్ప నగరముయొక్క జనన వృత్తాంతమును మనము చెప్పుకొనక తప్పదు. రోము ప్రతిష్ఠను గూర్చి వింత కథలను చెప్పుదురు. రీమస్, రోములస్

అను ఇద్దరు శిశువులను ఒక ఆడుతోడేలు తీసికొనిపోయి పెంచినట్లును, వారు రోమును ప్రతిష్ఠించినట్లును, ఇత్యాదిగా. నీ కా కథ తెలియునేమో.

రోమునగరమును నిర్మించునప్పుడో, అంతకు కొంచెముముందో వేరొకనగరము నిర్మించబడినది. దీనిపేరు కార్తేజి. ఇది ఆఫ్రికా ఉత్తర తీరమందున్నది. దీనిని ప్రతిష్ఠించినది ఫొనీషియనులు.. సముద్రముపై అధికారము చలాయించు గొప్పజాతిగా అది యభివృద్ధిచెందినది. దానికిని, రోమునకును తీవ్రస్పర్థలు చెలరేగినవి. యుద్ధము లెన్నో జరిగినవి. చివరకు రోముజయమునందినది. కార్తేజిని మూలముట్టుగ నాశనము చేసినది.

ఈ దినమున విరమించుటకు ముందు పాలస్తీనా నొక్కమారు సంగ్రహముగా చూతము. పాలస్తీనా యూరోపులో లేదు. చారిత్రక ప్రాముఖ్యము దానికి ఎక్కువలేదు. కాని బైబిలులోని ప్రాతనిబంధనలో ఉండుటచే పలువురకు దాని ప్రాచీనచరిత్రపై ఇష్టము. ఈ చిన్ని ప్రదేశములో నివసించిన యూదులలోని కొన్నిజాతులను గురించియు, వారి కిరుప్రక్కల పొరుగుననుండు ప్రబలులవల్ల వారు పొందిన కష్టములను గురించియు అందు వర్ణింపబడెను. ఆ పొరుగువారు—బాబిలోనియా, అస్సీరియా, ఈజిప్టు. యూదులయొక్కయు, క్రైస్తవులయొక్కయు మతములలో ఈ కథ ప్రవేశింపకున్నచో దాని సంగతి ఎవరికిని తెలిసెడిది కాదు.

ఇస్రాయేలు పాలస్తీనాలో ఒక భాగము. క్నోసోస్ నాశనమైన కాలమున ఇస్రాయేలుకు రాజు సాల్ అనువాడు. తరువాత డేవిడ్, ఆ తరువాత సోలమన్ రాజులైరి. సోలమన్ విజ్ఞాని యని పేరొందెను. ఈ మూడు పేళ్ళను ఉదహరించుటకు కారణము నీవు వారినిగురించి విని యుండవచ్చును, లేదా చదివియుండవచ్చును అని.

# 7
# గ్రీకుల నగరరాజ్యములు

జనవరి 11, 1931.

వెనుకటిజాబులో గ్రీకులను (హెల్లనీలు) గురించి కొంత చెప్పితిని. వారి నింకొకమారు చూచి వా రెట్టివారో తెలిసికొందము. మన మెప్పుడునుచూడనివారిని గురించిగాని, వస్తువులను గురించిగాని సరియైన, యథార్థమైన అభిప్రాయము మనకు కలుగుట మిక్కిలి కష్టము. మనము ప్రస్తుతపరిస్థితుల కలవాటు పడియున్నాము. మన బ్రతుకు వేరు. ఇట్టి మనము పూర్తిగా భిన్నముగా నున్న ప్రపంచము నూహించుకొనుట కష్టము. ప్రాచీనప్రపంచము - ఇండియాకాని, చీనాకాని, గ్రీసుకాని - నేటి ప్రపంచమునకు పూర్తిగా భిన్నముగా నుండును. మనము చేయగలిగిన దేమనగా—వారి గ్రంథములయొక్కయు, భవనములు మున్నగు శిథిలములయొక్కయు సహాయముతో ఆకాలపు ప్రజ లెట్లుండెడివారో ఊహించుకొనుటయే.

గ్రీసును గురించిన యొక విషయము మిక్కిలి మనోహరముగ నుండును. పెద్ద రాజ్యములన్నను, సామ్రాజ్యములన్నను గ్రీకుల కిష్ట మున్నట్లు తోచదు. వారికి నగరరాజ్యములపై ఇష్టము. అనగా, ప్రతి నగరమును ఒక స్వతంత్రరాజ్యము. అవి చిన్న ప్రజాప్రభుత్వములు. మధ్యను నగరముండును. దానిచుట్టును పొలము లుండును. వానినుండి నగరమునకు కావలసిన భోజనపదార్థములు వచ్చును. ప్రజాప్రభుత్వమున రా జుండడని నీకు తెలియునుకదా, ఈ గ్రీకు నగరరాజ్యములకు రాజులు లేరు. ధనవంతులగు పౌరులే వానిని పరిపాలింతురు. సామాన్యప్రజకు పరిపాలనతో ఎట్టి సంబంధమును లేదు. పలువురు బానిస లుందురు. వారికి హక్కు లుండవు. స్త్రీలకుకూడ హక్కులు లేవు. నగరరాజ్యముల

లోని జనసంఖ్యలో ఒకభాగమే పౌరులు. కాన వారే రాజకీయ విషయములను గూర్చి వోటు ఇయ్యవచ్చును. ఒక్కస్థలమున పౌరులందరిని చేర్చుట సులభముకాన వారు వోటువేయుట కష్టము కాదు. అది చిన్న నగర రాజ్యము కాబట్టే ఇట్లు చేయుటకు సాధ్యమగుచున్నది. ఒకే దొరతనము క్రిందనున్న పెద్ద దేశమైన నిది సాధ్యము కాదు. ఇండియాలో ఉన్న వోటర్లు అందరునుకాని, పోనీ బెంగాలురాష్ట్రమందలి వోటర్లందరును గాని, ఆగ్రాలోని వోటర్లందరునుగాని ఒకచోట కూడుట యన నేమో ఊహించుకొనుము. అది ఎంతమాత్రము సాధ్యముకాదు. పిదపకాలములో నితరదేశములం దిట్టికష్టము తటస్థించినది. దానిని పరిష్కరించుటకు "ప్రతినిధిప్రభుత్వము"ల నేర్పాటుచేయవలసివచ్చెను. అనగా ఒకవిషయ మును నిర్ణయించుటకు ఆ దేశమందలి వోటరులందరును ఒకచోట కూడుటకుబదులు, వారు వారి ప్రతినిధుల నెన్నుకొందురు. ఆ ప్రతినిధు లందరును సమావేశమై దేశమునకు సంబంధించిన రాజకీయ వ్యవహార ములను గూర్చి యాలోచించి శాసనములను నిర్మింతురు. ఈ విధముగా సామాన్యుడగు వోటరు తన దేశపరిపాలనకు పరోక్షముగా సాయపడు చున్నాడు.

ఇదంతయు గ్రీసుతో సంబంధించినది కాదు. ఇట్టి కష్టసమస్య రాకుండ గ్రీసుచేసికొన్నది. నగరరాజ్యములకంటె పెద్దరాజ్యముల నది పెట్టుకొనలేదు. నేను చెప్పినట్లుగా గ్రీకులు గ్రీసునంతను, దక్షిణఇటలీని, సిసిలీని, ఇతర మధ్యధరాతీరములను ఆక్రమించినప్పటికిని వారు సామ్రాజ్య మును స్థాపింప ప్రయత్నించలేదు. వారి వశములో నున్న యావత్ప్ర దేశములకును ఒకే ప్రభుత్వము పెట్టుకొన ప్రయత్నించలేదు. పోయిన చోట్ల నెల్ల వారు తమ ప్రత్యేక నగరరాజ్యమును స్థాపించిరి.

ఇండియాలో కూడ, తొలిరోజులలో చిన్న ప్రజాప్రభుత్వము లుండెడివి. అవి గ్రీకునగరరాజ్యములవంటి రాజ్యములు. కాని అవి చిరకాలము జీవించినట్లు లేదు. పెద్దరాజ్యములలో అవి లీనమైపోయినవి.

ఆ విధముగానే చాలకాలమువరకు మన గ్రామపంచాయతులు గొప్ప పలుకుబడి సంపాదించినవి. ప్రాచీనకాలమునాటి ఆర్యులు, తాము పోయిన చోట్ల నెల్ల చిన్న నగరరాజ్యములు స్థాపించవలెనని యుద్దేశించియుండవచ్చును. భూగోళమునకు సంబంధించిన పరిస్థితులును, ప్రాచీననాగరికతలతో సంసర్గమును వారు నివసించిన పెక్కు దేశములలో తమ యుద్దేశమును క్రమముగా వదలుకొనుటకు కారణము లాయెను. ముఖ్యముగా పర్షియాలో గొప్పరాజ్యములును, సామ్రాజ్యములును వర్ధిల్లినవి. ఇండియాలో కూడ రాజ్యములు పెద్దవిగా పెరుగుట కున్ముఖములైనవి. కాని గ్రీసులో నగరరాజ్యములు చిరకాలము నిలిచియుండెను. చివరకు, చరిత్రలో ప్రసిద్ధినందిన గ్రీకుపురుషు డొకడు ప్రపంచమును జయించుటకు, మనకు తెలిసినంతమట్టుకు, మొదటి ప్రయత్నము చేసెను. అతడు ఘనుడగు అలెగ్జాండరు. ముందుముందు అతనినిగురించి కొంచెము చెప్పుకొందము.

తమ నగరరాజ్యముల నన్నింటిని కలిపి ఒక రాష్ట్రముగానో, రాజ్యముగానో, ప్రజారాజ్యముగానో చేయుటకు గ్రీకులు సమ్మతించలేదు. నగరరాజ్యములు వేటి కవి ప్రత్యేకముగా స్వతంత్రముగా నుండుటయే గాక అవి దాదాపు ఎల్లకాలముల అన్యోన్యము పోరాడుచుండెను. వారిలో వారికి తీవ్రమగు స్పర్థ లుండుటచే, తరుచు యుద్ధములలోనికి దిగుచుండిరి.

అయినను ఈ నగర రాజ్యముల నేకముగా బంధించు సమాన విషయములు లేకపోలేదు. వారికి భాష సమానము, విజ్ఞానము సమానము, మత మొక్కటే. వారి మతమున ననేక దేవుళ్లు, దేవతలు ఉన్నారు. ప్రాచీన హిందువుల పురాణములవంటి అందమైన, అమూల్యమైన పురాణములు వారికిని గలవు. సుందరమగుదానినెల్ల వా రుపాసించిరి. ప్రాతకాలమునాటి వారి చలువరాతి విగ్రహములు, శిలావిగ్రహములు కొన్ని నేటికికూడ నిలిచియున్నవి. అవి సౌందర్యమును వెలిగ్రక్కుచున్నవి. శరీరముల నారోగ్యముగా, అందముగా పెట్టుకొనుట వారు విధిగాచూతురు.

అందుకై ఆటలను, పోటీపందెములను వా రేర్పాటుచేసికొనుచుండెడి వారు. గ్రీసులోని ఓలింపియా యను ప్రదేశమువద్ద అప్పుడప్పు డీ యాటలు మిక్కిలి వైభవముగా జరుగుచుండెడివి. అప్పుడు గ్రీసుదేశ మన్నిప్రాంతములనుండి జనులు వచ్చి సమావేశమగుచుండిరి. నేడుకూడ జరుగుచున్న ఓలింపిక్ ఆటలనుగూర్చి నీవు వినియుందువు. ఓలింపియాలో జరిగిన గ్రీకుల ఆటలనుండి గ్రహించి ఈపేరు నేడు వేర్వేరు దేశములకు జరుగు పోటీపందెములకును, ఆటలకును పెట్టబడినది.

కాబట్టి గ్రీకునగరరాజ్యములు ప్రత్యేకముగా జీవించుచుండెడివి. ఆటలప్పుడు కలిసికొనుచుండెడివి. తమలోతాము పోరాడుచుండెడివి. కాని బయటినుండి ఏదైన గొప్ప ప్రమాదము వచ్చినప్పుడు అవి యన్నియు ఏకమై వారించుచుండెడివి. అట్టిప్రమాదము పర్షియనుల దండయాత్ర. ముందుముందు దానినిగురించి కొంత చెప్పవలసి యున్నది.

# 8

# పడమటి ఆసియాలోని సామ్రాజ్యములు

జనవరి 13, 1931.

నిన్నను మిమ్మందరిని చూచుట మంచిదయినది. కాని తాతను చూచినప్పుడు నా కెంతో విచారము కలిగినది. ఆయన నీరసముగాను, జబ్బుగాను ఉన్నట్లు కనిపించిరి. మరల పుష్టిగట్టి యథాస్థితికి వచ్చువరకు ఆయనను జాగ్రత్తగా కనిపెట్టి చూచుచుండుము. నిన్న నీతో సరిగా మాటాడలేకపోతిని. సమావేశ మంత కొద్దికాలములో జరుగవలసి యున్నప్పు డెవరేమి చేయిగలరు ? మనము కలపలేని సమావేశములకు, చెయ్యలేని ప్రసంగములకు బదులు ఈ ఉత్తరములను వ్రాయుచున్నాను. కాని ఇవి వానివంటివి కావుగదా ? ఈ నటన చిరకాలము నిలువజాలదు, కాని ఇట్టి నటనకూడ ఒక్కొక్కప్పుడు మంచిదే.

ఇక మనము ప్రాచీనులవద్దకు పోదము. ఇప్పటివరకు ప్రాచీన గ్రీకులవద్ద నుంటిమి. ఈ కాలమున ఇతరదేశము లెట్లున్నవి? యూరోపులో నున్న యితర దేశములను గురించి మనము తెలిసికోవలసినది అట్టేలేదు. వానినిగురించి తెలిసికోదగ్గ విషయము లున్నట్లు లేవు, ఉన్నను నాకు తెలియవు. ఉత్తర యూరోపుయొక్క శీతోష్ణస్థితి బహుశా మారుచు ఉండవచ్చును. ఇందువల్ల క్రొత్త పరిస్థితు లేర్పడియుండ వచ్చును. నీకు జ్ఞాపకమున్నదేమో - ఎన్నో సంవత్సరములకు పూర్వము ఉత్తర యూరోపును, ఉత్తర ఆసియాయును శీతలముగా నుండెడివి. ఈ కాలమునకు హిమయుగ మని పేరు. పెద్ద హిమానీనదులు మధ్య యూరోపువరకు ప్రవహించెడివి. అకాలమున బహుశా మానవుడు లేడేమో. ఒకవేళ ఉన్నను మానవత్వముకన్న పశుత్వమే అతనిలో ఎక్కువగా నుండెను. ఆ కాలమున హిమానీనదు లున్నవని యిప్పుడు మన కెట్లు తెలియునని అనుకొనుచున్నావేమో, ఆ కాలములో పుస్తకములుగాని, గ్రంథకర్తలుగాని లేరు కాబట్టి ఆ విషయములు వ్రాసిన గ్రంథము లుండవు. కాని ప్రకృతి వ్రాసిన గ్రంథమున్నవని నీవు మరిచి పోలేదనుకొందును, తన కొండలమీదను, రాళ్ళమీదను ప్రకృతి తన చరిత్రను తన పద్ధతిప్రకారము వ్రాయును. చదువవలచినవా రందు చదువ వచ్చును. అది యొకవిధమగు స్వీయచరిత్ర. హిమానీనదులు వాని యునికిని తెలుపుటకు కొన్ని గుర్తులను వదలును. ఒకమారు వానిని గుర్తించుట తెలిసికొన్నచో మన మెప్పుడును పొరపాటుపడము. ఈ గుర్తులను తెలిసికోగోరినచో హిమాలయములలో గాని, ఆల్ప్సు పర్వతములలోగాని, ఇతర ప్రదేశములందుగాని యిప్పుడున్న హిమానీనదుల వద్దకు వెళ్ళవలెను. ఆల్ప్సులలోని బ్లాంకుశిఖరము చుట్టును ఉన్న హిమానీనదులను నీవు చూచియుంటివిగదా. కాని అప్పుడీ గుర్తులు నీ కెవరును చూపలేదు కాబోలును. కాశ్మీరములోను, హిమాలయములం దితరభాగములలోను చక్కని హిమానీనదులు పెక్కులున్నవి. మనకు మిక్కిలి

దగ్గర నున్నది పిండారీ హిమానీనది. ఆల్మోరా కది వారము దినముల ప్రయాణములో నుండును. నేను చిన్నపిల్లవాడనుగా నున్నప్పుడు — ఇప్పుడు నీకంటె చిన్నగా నున్నప్పుడు—అక్కడి కొకమారు వెళ్ళితిని. ఆ దృశ్య మింకను కన్నులకు కట్టినట్లున్నది.

చరిత్రను, గతకాలమును గురించి చెప్పుటకుబదులు హిమానీ నదులను, పిండారీని గురించి చెప్పుచున్నాను. నటనవల్ల వచ్చిన ఫలిత మది. నీవు నాయెదుట ఉన్నప్పుడు నీతో నేను మాటాడు విధముగా మాటాడుచున్నాను. అట్టి సందర్భములో మన మప్పుడప్పుడు హిమానీ నదులకో, ఇంకొక చోటికో షికార్లు పోవలెనుగదా.

హిమానీనదులను గురించి చర్చించుటకు కారణము నేను హిమ యుగముపే రెత్తితినికాబట్టి. మధ్యయూరోపులోనికిని, ఇంగ్లాండులోనికిని హిమానీనదులు వచ్చిన వనుటకు కారణము వానిగుర్తు లాదేశములలో మనము చూడవచ్చును కాబట్టి. ప్రాతకొండలపై నవి కానవచ్చును. అప్పుడు మధ్యయూరోపు, ఉత్తరయూరోపు మిక్కిలి శీతలముగా నుండెనని దీనినిబట్టి మన మూహించవచ్చును. తరువాత ఆ దేశములు వేడియగుటచే హిమానీనదులు క్రమముగా తగ్గిపోయినవి. భూగర్భ శాస్త్రజ్ఞులు—అనగా భూమిచరిత్రను పరిశోధించువారు—శీతలయుగము పోయి ఉష్ణయుగము ప్రవేశించిన దని చెప్పుదురు. అప్పుడు యూరోపు నేటి యూరోపుకన్న ఉష్ణముగా నుండెడిది. ఈ యుష్ణము కారణముగా యూరోపునం దంతటను అరణ్యములు దట్టముగా పెరిగెను.

ఆర్యులు తమ సంచారములలో మధ్యయూరోపునకు కూడ వచ్చిరి. అక్కడ ఆకాలమున వారు చెప్పుకోదగిన కార్య మేమియు చేసినట్లు లేదు. కావున వారిని ప్రస్తుత ముపేక్షింతము. నాగరీకులగు గ్రీకులును, మధ్యధరా ప్రాంతప్రజలును మధ్యయూరోపు, ఉత్తరయూరోపులందు నివసించువారిని అనాగరికులుగా ఈసడించుచుండిరని తోచును. కాని యీ "అనాగరికులు" వారి అడవులలోను, గ్రామములలోను ఆరోగ్య

ముగా వీరుల బ్రతుకు బ్రతుకుచుండిరి. దక్షిణముననున్న నాగరికజాతులపై వచ్చిపడి వారి ప్రభుత్వమును తలక్రిందులు చేయుటకు, అనుకొనకుండ, తయారగుచుండినారు కూడ. కాని ఇది ఎంతోకాలము తరువాతగాని జరుగలేదుకాబట్టి ముందుగా దానిని మనము తలచుకొన నవసరములేదు.

ఉత్తర యూరోపునుగురించి కొద్దిగా మనకు తెలియునుగాని గొప్ప భూఖండములను గురించియు, కొన్ని దేశభాగములను గురించియు మన కసలే తెలియదు. కొలంబసు అమెరికాను కనుగొనె నని చెప్పుదురుకాని అంతకుముందు అక్కడ నాగరికత గల ప్రజలు లేరని కాదు. ఆ సంగతి ఇప్పుడిప్పుడు మనము తెలిసికొనుచున్నాము. ఏది యెట్లున్నను మనము ప్రసంగించుకొనుచున్న కాలమున అమెరికా యెట్లుండెడిదో మన కేమియు తెలియదు. ఈజిప్టు, మధ్యధరాతీరము తప్ప మిగత ఆఫ్రికాఖండమునుగూర్చి మన కేమియు తెలియదు. ఈకాలమున బహుశా ఈజిప్టుయొక్క ఘనమగు ప్రాచీననాగరికత క్షీణించుచున్న ట్లున్నది. అయినప్పటికిని ఆ కాలమున నది మిక్కిలి యభివృద్ధి జెందిన దేశ మనకతప్పదు.

ఆసియాలో ఏమి జరుగుచున్నదో ఇప్పుడు మనము చూతము. ఇచ్చట, నీ వెరుగుదు వనుకొందును, ప్రాచీననాగరికతా కేంద్రములు మూడుండెను. మెసపొటేమియన్ కేంద్రము, ఇండియన్ కేంద్రము, చైనీసు కేంద్రము.

మెసపొటేమియా, పర్షియా, ఆసియామైనర్లలో, ఆ తొలిరోజుల లోనే, సామ్రాజ్యమువెనుక సామ్రాజ్యము వచ్చి తొలిపోయెను. అస్సీరియన్ సామ్రాజ్యము, మీడియన్ సామ్రాజ్యము, బాబిలోనియన్ సామ్రాజ్యము, తరువాత పర్షియన్ సామ్రాజ్యము. ఈ సామ్రాజ్యములు ఒకటితో నొకటి ఎట్లు పోరాడుకొన్నవో, లేదా కొన్నాళ్ళపాటు ఎట్లు అన్యోన్యముగా ఉన్నవో, ఒండొరుల వినాశము నెట్లు చేసుకొన్నవో ఆ వివరములలోనికి మనము దిగనవసరములేదు. గ్రీకునగరరాజ్యములకును, పడమటి ఆసియా

సామ్రాజ్యములకును ఉండు భేదము నీవు గమనించవలెను. మిక్కిలి ప్రాచీనకాలమునుండియు ఈ దేశములలో ఒక గొప్ప రాజ్యమో, సామ్రాజ్యమో వెలయవలయునని ఆకాంక్ష ఉన్నట్లున్నది. అంతకు ముందున్న ప్రాతనాగరికత దానికి కారణము కావచ్చును, లేదా యితర కారణము లుండవచ్చును.

ఒక్క పేరును వినుటకు నీ విష్టపడవచ్చును. ఆపేరు క్రోసస్. ఇతనినిగురించి నీ విదివరలో వినియుండవచ్చును. క్రోసస్అంత ధనవంతుడగుట—ఇది ఇంగ్లీషులో ప్రసిద్ధలోకోక్తి. ఈతనిని గురించిన కథలుకూడ నీవు చదివియుండవచ్చును, అత డెంత ధనాఢ్యుడో, ఎంతటి గర్వియో, ఎట్లు పరాభవింపబడెనో. లిడియా అను పేరుగల దేశమునకు క్రోసస్ రాజు. ఆసియాకు పడమటితీరమున, నేడు ఆసియా మైనరున్నచోట ఈ లిడియా యుండెను. సముద్రము నంటియున్న దేశ మగుటచే బహుశా వాణిజ్య మధికముగా జరుగుచుండెను. అతని కాలము లోనే సైరస్పాలనమందున్న పర్షియన్ సామ్రాజ్యము అభివృద్ధిజెంది శక్తివంత మగుచుండినది. సైరస్కును, క్రోసస్కును యుద్ధము తటస్థించెను. అందు క్రోసస్ను సైరస్ ఓడించెను. ఈ పరాజయమును గూర్చియు, హీనస్థితికి వచ్చి గర్వియగు క్రోసస్ ఎట్లు బుద్ధితెచ్చు కొన్నదియు హిరొడేటస్ అను గ్రీకుచరిత్రకారుడు వ్రాసియున్నాడు.

సైరస్కు ఒక గొప్ప సామ్రాజ్య ముండెను. అది బహుశా తూర్పున ఇండియావరకు కూడ విస్తరించియుండెను. అతని తరువాత వచ్చిన డరయస్కు అంతకన్న గొప్ప సామ్రాజ్య ముండెను. ఈజిప్టు, మధ్యఆసియాలో చిన్నభాగము, సింధునది వద్దనున్న ఇండియాలోని చిన్న రాష్ట్రముసైతము అందుండెను. ఇండియాలో నున్న ఈ రాష్ట్రమునుండి పసిడిరజము రాసులుగా, కప్పముక్రింద అతనికి చెల్లించుచుండిరట. ఆ రోజులలో బంగారుపొడి సింధునదీప్రాంతమున దొరకుచుండవలెను. ఇప్పు డక్కడ ఏమియు దొరకదు. అది ఎక్కువభాగము బీడుగానున్నది. శీతోష్ణస్థితి ఏవిధముగా మారినదో దీనినిబట్టి గ్రహించవచ్చును.

నీవు చరిత్ర చదివి వెనుకటి పరిస్థితులను నేటి పరిస్థితులతో పోల్చి చూచినప్పుడు ఒక్క విషయము నీమనస్సు నెక్కువగా ఆకర్షించును. అది మధ్యఆసియాలో వచ్చిన మార్పు. ఒకప్పు డాప్రదేశమునుండి అసంఖ్యాకులగు మనుష్యజాతులును, గుంపులు గుంపులుగా స్త్రీపురుషులును బయలుదేరి దూరదేశములకు వ్యాపించిరి. ఒకప్పు డాప్రదేశమునందు అద్భుతమగు గొప్పనగరములు ప్రాచీనకాలమున వెలిసినవి—భాగ్యవంతమైనవి, జనసంకీర్ణమైనవి, నేటి యూరోపియన్ ముఖ్యనగరములకు సాటివచ్చునవి. నేటి బొంబాయి కలకత్తానగరములకన్న ఎంతో పెద్దవి. ఎక్కడ చూచినను ఉద్యానములే. ఎక్కడ చూచినను పచ్చికబయళ్లే. శీతోష్ణస్థితి సమశీతోష్ణముగా నుండెను—అంత వేడియు లేదు. అంత చలియు లేదు. ఇవి వెనుకటికాలముమాటలు. నేడో, చాలావందల సంవత్సరములనుండి అది వాసయోగ్యముకాని గొడ్డుదేశమైనది. ఎడారితో సమానముగా నున్నది. ఆ నాటి గొప్పపట్టణములు కొన్ని నేటికి నిలిచి యున్నవి—సమర్కండ్, బొఖారా అనునవి రెండుపట్టణములు. వాని పేళ్లు విన్నంతనే మనకు ప్రాతవిషయము లెన్నో స్మృతిపథమునకు తగులును. కాని నేటి పట్టణములు వెనుకటి పట్టణముల ఛాయలుమాత్రమే.

మరల నేను రాబోవు విషయములను ముందు చెప్పుచున్నాను. మనము ప్రసంగించుకొనుచున్న కాలములో సమర్కండ్ బొఖారాలు లేవు. ఇదంతయు ముందు రాబోవు విషయము. భావికాల మను తెర దానిని మరుగుచేసినది. మధ్యఆసియా గొప్పతనమును, పతనమును ముందుకాలపు విషయములు.

## 9

# ప్రాతసంప్రదాయముల భారము

జనవరి 14, 1931

నేను చెరసాలలో క్రొత్త అలవాట్లను చేసికొన్నాను. అం దొక్కటి అరుణోదయము కాకముందే లేచుట. కడచిన వేసగినుండియు ఈ అల

వాటు చేసికొన్నాను. ఉషఃకాలము వచ్చి క్రమక్రమముగా నక్షత్రముల నార్పివేయుట చూడ నాకు సరదాగా నుండును. ఉషఃకాలమునకు ముందుండు వెన్నెల నెప్పుడైన చూచితివా? రాత్రి మెల్లగా మారి పగలగుట చూచితివా? వెన్నెలకును, ఉషఃకాలమునకును జరుగు పోరాటము నెన్ని పర్యాయములో చూచితిని. చివరకు విజయ మెప్పుడును ఉషఃకాలముదే. వింతగా నుండు ఆ సగము వెలుగులో అది వెన్నెలయో, లేక రానున్న పగటివెలుగో చెప్పుట కొంతసేపటివరకు కష్టము. పిమ్మట, హఠాత్తుగా సందేహము తొలగును. అది పగలే. వెలవెలవారు చంద్రుడు పోరాటమున ఓడిపోయి వెడలిపోవును.

నా అలవాటుచొప్పున నేడు నక్షత్రము లుండగనే నేను లేచితిని. తెల్లవారుటకు ముందు గాలిలో ఏదో ఉండును. వానినిబట్టి తెల్లవారుచున్న దని మనము గ్రహించవచ్చును. నేను కూర్చుండి చదువుకొనుచుండగా, దూరమునుండి కంఠధ్వనులు, కోలాహలము అంతకంతకతిశయించుచు వినిపించి ఉదయకాలప్రశాంతిని చెడగొట్టినవి. అది సంక్రాంతిదిన మని జ్ఞాపకముచేసికొంటిని. మాఘమేళోత్సవమున మొదటిదిన మది. గొప్పదినము. త్రివేణీసంగమస్థలమున ప్రాతఃస్నానము చేయుటకు యాత్రికులు వేలకువేలు నడిచి వెళ్లుచున్నారు. గంగాయమునలును, (అంతర్వాహినిగాన) అగోచరమగు సరస్వతియును కలిసి త్రివేణీసంగమ మేర్పడుచున్నది. నడుచుచు వా రొకప్పుడు పాటలు పాడుచుండిరి; ఒకప్పుడు 'గంగామాయికి జై' అని జయధ్వనులు చేయుచుండిరి. నాయిని చెరసాలగోడలు దాటి వారి కంఠధ్వనులు నా చెవుల బడెను. బహుళ సంఖ్యాకుల నీ నదివద్దకు లాగుకు వచ్చినట్టియు తాత్కాలికముగా వారు తమ దరిద్రమును, దుఃఖమును విస్మరించునట్లు చేసినట్టియు భక్తిప్రభావ మెట్టిదోగదా యనుకొంటిని. సంవత్సరము సంవత్సరము త్రివేణిలో స్నానము చేయుటకై ఎన్నివందల, లేదా ఎన్ని వేల సంవత్సరములనుండి యాత్రికులు వెళ్లుచున్నారోగదా యనుకొంటిని.

మనుష్యులు రావచ్చును, మనుష్యులు పోవచ్చును; రాజ్యములు, సామ్రాజ్యములు కొంతకాల మధికారము చలాయించవచ్చును; తరువాత భూతకాలములో అంతరించిపోవచ్చును. కాని ప్రాచీన సంప్రదాయము ఒకే విధముగా సాగిపోవుచుండును. తరతరములవారు దానిని శిరసా వహించుచుందురు. సంప్రదాయ సిద్ధమగు ఆచారములో మంచి చాలా ఉన్నది. ఒక్కొక్కప్పు డది దుర్భరభార మగును. ముందు సాగిపోవుటకు మన కది యాటంకములు కల్పించును.

అస్పష్టము, దూరము అగు భూతకాలముతో సంబంధము కలుపు అవిచ్ఛిన్నమగు ఈ గొలుసును తలుచుకొన్నాను, 1300 సంవత్సరముల క్రితము వ్రాసిన మేళముల వృత్తాంతములు చదువుకొన్నాను—అప్పుడు కూడ మేళములు ప్రాచీన సంప్రదాయమేసుమా—రమణీయముగా నుండును. కాని మనము ముందుకు పోదలచినప్పు డీ గొలుసు మనల నంటుకొనియుండును. సంప్రదాయబద్ధులమై మనము చేయి కాలు కదుపలేము. భూతకాలముతో సంబంధము మనము నిలుపుకొనవలసినదే కాని మన పురోభివృద్ధికి ఆటంకముగా నుండు సంప్రదాయమును మాత్రము విచ్ఛిన్నము చేయకతప్పదు.

2500, 3000 సంవత్సరములకు పూర్వము ప్రపంచ మెట్లుండెనో తెలిసికొనుటకు వెనుకటి మూడుత్తరములలోను ప్రయత్నించితిమి. నేను తేదీలను, సంవత్సరములను ఉదహరించలేదు. తేదీయు, సంవత్సరములు అన్న నా కిష్టములేదు. నీవుకూడ ఆ గొడవ పెట్టుకోకు. ప్రాచీన కాలమున నే సంవత్సరమున నేమి సంభవించెనో సరిగా తెలిసికొనుట కష్టము. పోనుపోను కొన్ని తేదీలు జ్ఞాపకముంచుకొనుట అవసరమగును. మన మనస్సులలో సరియైన క్రమమున జరిగిన సంగతుల నుంచుకొనుటకా తేదీ పనికివచ్చును. ప్రస్తుతము మనము ప్రాచీనప్రపంచస్వరూపమును తెలిసికొన ప్రయత్నించుచున్నాము.

గ్రీసు, మధ్యధరాప్రాంతము, ఈజిప్టు, ఆసియామైనరు, పర్షియాలనుగురించి కొంత తెలిసికొంటిమి. ఇప్పుడు మనము మన దేశమునకు

తిరిగివచ్చెను. హిందూదేశముయొక్క తొలుతటి చరిత్రనుగురించి తెలిసికొనుట కొక పెద్ద యిబ్బంది ఉన్నది. తొలుతటి ఆర్యులు—వీరినే ఇండో - ఆర్యులు అందురు—చరిత్ర లేమియు వ్రాయలేదు. వారు ఎన్నివిధములుగానో ఎంతో గొప్పవా రని వెనుకటి ఉత్తరములలో మనము చూచియుంటిమి. వారు ప్రచురించిన గ్రంథములు, వేదములు, ఉపనిషత్తులు, రామాయణము, మహాభారతము. ఇంకను ఇతర గ్రంథములు మహామహులు రచించినవై యుండవలెను. ప్రాచీనచరిత్రను తెలిసికొనుట కీగ్రంథములును, ఇతర సామగ్రియు సహాయకారు లగుచున్నవి. మన పూర్వుల ఆచార వ్యవహారములు, వారి ఊహాపోహలు, వారి జీవనపద్ధతి పై గ్రంథాదులనుండి మనము గ్రహించవచ్చును. కాని అవి నిర్దుష్టచరిత్ర కాదు. తరువాతి కాలమునాటికి సంబంధించిన యథార్థచరిత్ర ఒకటి సంస్కృతములో నున్నది. అది కాశ్మీరదేశమును గురించి. ఈ గ్రంథముపేరు రాజతరంగిణీ, గ్రంథకర్త కల్హణుడు. కాశ్మీరరాజుల చరిత్ర ఇందు వర్ణితము. విన్నావో లేదో. * రంజిత్ మామ ఈ గొప్ప కాశ్మీర చరిత్రను సంస్కృతమునుండి ఇప్పుడే తర్జుమా చేయుచున్నాడు. సుమారు సగముగ్రంథ మప్పుడే పూర్తిఅయినది. అది చాల పెద్దపుస్తకము. తర్జుమా పూర్తిఅయినపిమ్మట మన మంద రము తప్పక దాని నుత్సాహముతో చదువుదము. దురదృష్ట వశాత్తు మనకు చాలినంత సంస్కృతజ్ఞానము లేకపోవుటవల్ల సంస్కృతగ్రంథము చదువలేము. అది చక్కని గ్రంథమని మాత్రమే కాదు దానిని మనము చదువుట, అది గతకాలమునుగూర్చి అనేకవిషయములు చెప్పును. ముఖ్యముగా కాశ్మీరమునుగురించి. నీ వెరుగుదువా, కాశ్మీరము మన పూర్వుల జన్మభూమిసుమా !

ఆర్యులు ఇండియాలో కాలుపెట్టునరికి ఇండియా నాగరికతగల

---

* రంజిత్. యస్. పండితుడు జవహర్లాలు బావమరిది. అప్పు డతడు కూడ చెరసాలలోనున్నాడు.

దేశముగానే యుండెను. వాయవ్యదిశ నున్న మొహంజొదారొవద్ద దొరికిన శిథిలములనుబట్టి చూచిన, ఆర్యులు రాకముందే ఇక్కడ నాగరికత గొప్పగా నుండెనని ధ్రువపడుచున్నది. కాని దీనినిగురించి మన కింకను ఎక్కువగా తెలియదు. పురాతన వస్తుశాస్త్రజ్ఞులు—అనగా ప్రాశశిథిలములను పరీక్షచేయువారు—అక్కడ దొరుకు పదార్థముల . నన్నింటిని త్రవ్వి బయటకు తీసినపిమ్మట, కొద్ది సంవత్సరములలో మన కింకను ఎక్కువవిషయములు తెలియవచ్చును.

ఈ విషయ మిట్లుండనిచ్చినను, ఆకాలమున దక్షిణ హిందూదేశమున—బహుశా ఉత్తర హిందూస్థానమునకూడ—ద్రావిడులు గొప్ప నాగరికత కలిగియుండిరి. వారి భాషలు ఆర్యుల సంస్కృతమునుండి పుట్టినవి కావు. అవి పురాతనభాషలు. వానికి చక్కని సారస్వతములు కలవు. తమిళము, తెలుగు, మళయాళము, కన్నడము—ఇవియాభాషలు. ఈభాష లన్నియు దక్షిణఇండియాలో నేడుకూడ వర్ధమానమగుచున్నవి. నీకు తెలియు ననుకొందును—జాతీయ మహాసభ (కాంగ్రెసు), బ్రిటిషు దొరతనమువలెగాక, ఇండియాను భాషలనుబట్టి రాష్ట్రములుగా విభజించినది. ఇది నేడున్న పద్ధతికన్న ఉత్తమపద్ధతి. ఎందుకనగా సాధారణముగా సమాన ఆచార వ్యవహారములు గలిగి, ఒకే భాష మాటాడు ఒకేమాదిరి ప్రజలు ఒక రాష్ట్రములో నుందురు. దక్షిణముననున్న కాంగ్రెసు రాష్ట్రము లేవనగా—ఆంధ్రదేశము, లేదా ఆంధ్ర రాష్ట్రము: ఇది చెన్నపట్టణమున కుత్తరమున నున్నది. ఇచ్చట మాటాడు భాష తెలుగుభాష; తమిళనాడు, లేదా తమిళరాష్ట్రము: ఇచ్చట అరవము మాటాడుదురు; కర్ణాటకము: ఇది బొంబాయికి దక్షిణముగా నున్నది. ఇచ్చట మాటాడు భాష కన్నడము, లేదా కర్ణాటకము; కేరళము: ఇది కొంచెె మెచ్చుతక్కువగా మలబారుదేశము. ఇచ్చటి భాష మళయాళము. ముందుముందు భాషాప్రయుక్తరాష్ట్రములు రాష్ట్రభాషల యభివృద్ధికొరకెక్కువగా పాటుపడగలవనుటకు సందేహము లేదు.

ఇండియాలోని భాషలను గురించి మరికొంత చెప్పెదను. యూరోపులోను, ఇంకను ఇతరదేశములలోను కొందరు ఇండియాలో వందల కొలది భాష లున్నవని భ్రమపడుదురు. ఇది అసందర్భము. ఇట్లు చెప్పెడువాడు తన యజ్ఞానమును ప్రకటించుకొనుచున్నాడు. ఇండియా వంటి పెద్దదేశములో అనేక ప్రాంతీయభాష లున్నవి—ఒకే భాష వేర్వేరు ప్రాంతములందు భిన్నరూపము ధరించుచుండును. కొండజాతులవా రెందరో యున్నారు. ప్రత్యేకభాషలు గల సంఘములు కొన్ని యున్నవి. మొత్తము ఇండియానుగురించి మాటాడుచున్నప్పు డివి యన్నియు అప్రధానవిషయములు. జనాభాకొరకే వాని ప్రాధాన్యము. ఇండియాలోనున్న అసలు భాషలు—ఈ విషయ మిదివరలో నీకు వ్రాసితినేమో— రెండు కుటుంబములకు చెందియున్నవి. ఒకటి ద్రావిడ కుటుంబము. దీనినిగురించి పైని చెప్పియున్నాను. రెండవది ఇండో ఆర్యను కుటుంబము. ప్రధానమగు ఇండో ఆర్యనుభాష ఇండియాలో సంస్కృతమే. ఇండియాలోని ఇండో ఆర్యనుభాష లన్నిటికిని సంస్కృతము మాతృక. అవి హిందీ, బెంగాలీ, గుజరాతీ, మరాటీభాషలు, ఇవిగాక అస్సాంలో అస్సామీసుభాషయు, ఒరిస్సాలో (ఉత్కళము) ఓఢ్రభాషయు వాడుకలోనున్నవి. హిందీభాష భిన్నస్వరూపమే ఉర్దు. హిందూస్తానీ అను మాట హిందీకిని, ఉర్దుకునుకూడ చెల్లును. కాన ఇండియా ప్రధానభాషలు సరిగా పది. హిందూస్తానీ, బెంగాలీ, గుజరాతీ, మరాటీ, తమిళము, తెలుగు, కన్నడము, మళయాళము, ఓఢ్రము, అస్సామీసు. ఈ భాషలలో మన మాతృభాషయైన హిందూస్తానీ ఉత్తర హిందూస్థానమందంతటను వాడుకలో నున్నది.—పంజాబులో, సంయుక్తరాష్ట్రములలో, బీహారులో, మధ్యరాష్ట్రములలో, రాజపుటానాలో, ఢిల్లీలో, మధ్య ఇండియాలో. ఇది పెద్ద భూభాగము. ఇందు 15 కోట్లమంది నివసించుచున్నారు. కొద్ది తేడాలతో 15 కోట్లమంది అప్పుడే హిందూస్థానీ మాటాడుచున్నారుగదా. ఇంతేకాదు, హిందూస్తానీ

భాష ఇండియా అన్నిప్రాంతములందును అర్థమగు నన్నమాట నీకు బాగుగా తెలియును. అది ఇండియా కంతకును సామాన్యభాష కాగలదు. ఇందువల్ల, పైన నేను చెప్పిన ప్రధానభాషలు అంతరించిపోవలె నని అర్థముకాదు. అవి రాష్ట్రభాషలుగా ఉండవలసినదే. ఎందువల్ల ననగా, వాని సారస్వతములు చక్కనివి. సర్వతోముఖముగా అభివృద్ధిగాంచిన భాషను, ఆభాష మాటాడు ప్రజలకు కాదని తీసివేయుట కెవ్వరును ఎప్పుడును ప్రయత్నించరాదు. స్వభాషద్వారానే ప్రజలు వృద్ధిగాంతురు. వారి పిల్లలు విద్య నభ్యసింతురు. నేడు ఇండియాలో సర్వమును తల క్రిందులుగా నున్నది. మనలో మన మెక్కువగా ఇంగ్లీషుభాషను వాడుకొనుచున్నాము. నేను నీకు ఇంగ్లీషులో జాబులువ్రాయుట హాస్యాస్పదము: కాని నేను వ్రాయుచునేయున్నాను. ఈ అలవాటు త్వరలో మనము తప్పించుకొందు మని ఆసించుచున్నాను.

# 10

# ప్రాచీన హిందూస్థానమున గ్రామ పంచాయతులు

జనవరి 15, 1931

ప్రాచీనచరిత్ర పరిశీలనమున మనము ముందుకు సాగిపోవుట ఎట్లు? నే నెప్పుడును బాటవదలి ప్రక్కపుంతలకు పోవుచున్నాను. క్రిందటిజాబులో విషయము నెత్తుకొనబోవుచు ఇండియాలోని భాషలనుగురించి చెప్పితిని.

ప్రాచీన హిందూస్థానమునకు మనము తిరిగిపోదము. ఇప్పుడు ఆఫ్ఘనిస్థాన మనబడు దేశము అప్పుడును, తరువాత ఎంతోకాలమువరకును హిందూదేశభాగమైయుండెను. ఇండియా వాయవ్యదేశమును గాంధార మనెడివారు. హిందూదేశమున నుత్తరమునం దంతటను, గంగా సింధు మైదానములలో ఆర్యులు పెద్ద వలస లేర్పరుచుకొనిరి.

ఈ ఆర్యులు భవననిర్మాణచాతురి కలవారై యుందురు. వారిలో పలువురు పర్షియా, మెసపొటేమియాలలోని తమ వలసప్రదేశములనుండి వచ్చియుందురు. అప్పటికే ఆదేశములందు మహానగరము లుండెను. ఆర్యుల వలసల మధ్యమధ్య అడవులు పెక్కు లుండెను. ముఖ్యముగా ఉత్తర దక్షిణ హిందూదేశములకు మధ్య ఒక గొప్ప యడవి యుండెను. ఈ యడవిని దాటి ఉత్తరముననుండి దక్షిణమున కార్యులు వలసకై పోయియుండరు. కాని దేశపరిశోధనార్థమును, వర్తకముకొరకును, ఆర్యసంస్కృతిని ఆర్యుల సంప్రదాయములను వ్యాపింపజేయుటకును దక్షిణమునకు పలువురు పోయియుండవలెను. దక్షిణమునకు పోయిన మొట్టమొదటి ఆర్యుడు అగస్త్యముని యని పెద్దలు చెప్పుదురు. అతడు దక్షిణాపథమునకు ఆర్యుల మతమును, సంస్కృతిని తీసికొనిపోయెను.

అప్పుడే ఇండియా విదేశములతో వర్తకమును బాహాటముగా చేయుచుండెను. దక్షిణదేశమున దొరకు మిరియాలు, బంగారము, ముత్యములు సముద్రమున కావలనున్న విదేశీయుల నాకర్షించెను. బియ్యమునుకూడ బహుశా ఆకాలమున ఎగుమతి చేసెడివారు. బాబిలన్‌లోని పురాతనభవనములందు మలబారు టేకుకలప కానవచ్చినది.

క్రమక్రమముగా ఆర్యులు ఇండియాలో తమ గ్రామపద్ధతిని ప్రారంభించి వృద్ధిలోనికి తెచ్చిరి. ఇది ప్రాచీన ద్రావిడగ్రామము యొక్కయు, నవీన ఆర్యాభిప్రాయములయొక్కయు సమ్మేళనమే. ఈ గ్రామములు సర్వస్వతంత్రము లనియే చెప్పవచ్చును. గ్రామస్థు లెన్నుకొన్న పంచాయతీ లీ గ్రామమును పరిపాలించుచుండెను. కొన్ని గ్రామములో, చిన్న పట్టణములో చేరి యొక రాజుయొక్కగాని, నాయకుని యొక్కగాని పరిపాలనమం దుండెను. వీరి నొక్కొక్కప్పుడు ఎన్నుకొనుచుండిరి. ఒక్కొక్కప్పుడు వీరు వంశ పారంపర్యముగా వచ్చినవారై యుందురు. తరుచుగా వేర్వేరు గ్రామసంఘములు చేరి అందరి శ్రేయస్సునకును అవసరమైన పనులు చేయుచుండెడివారు. రోడ్లు

వేయుట, సత్రములు నిర్మించుట, పంటకాల్వలు త్రవ్వుట మున్నగు నిట్టి సంఘశ్రేయమున కుద్దేశింపబడిన కార్యములు చేయుచుండెడివారు. రాజ్యమున తాను ప్రధానపురుషుడైనప్పటికి రాజు తన యిష్టమువచ్చినట్లు చేయుటకు వీలుండెడిది కాదట. ఆర్యధర్మములకును ఆచారములకును ఆతడు కట్టుబడియుండవలెను. అతనిని పదభ్రష్టుని చేయుటకుగాని, అతనిపై దండుగ (జుల్మానా) విధించుటకుగాని ప్రజలకు హక్కు కలదు. రాజ్యమును నేనే అని రాజు చెప్పుకొనుట లేదు. గత లేఖలలో ఈ విషయము నీకు వ్రాసితిని. దీనినిబట్టిచూడ ఆర్యుల నివాసభూములం దొకవిధమగు ప్రజాపరిపాలన ముండెడిదని తెలుచున్నది.—అనగా ఆర్యులగు ప్రజలు కొంతవరకు పరిపాలనమునం దధికారము వహించెడివా రన్నమాట.

ఈ హిందూ ఆర్యులను ఆర్యగ్రీకులతో పోల్చిచూడుము. భేదములు చాలా కనిపించునుకాని సాదృశ్యవిషయములుకూడ పెక్కులున్నవి. రెండుచోట్లను ఒకవిధమగు ప్రజాపరిపాలన మమలులో నుండెను. ఆర్యు లున్నచోటనే సాధారణముగా ఇట్టి ప్రజాపరిపాలన ముండెనని మనము జ్ఞాపకముంచుకోవలెను. వారి బానిసలు—అనగా తక్కువవర్ణస్థులు ఇట్టి ప్రజాపరిపాలనమునుగాని, స్వేచ్ఛనుగాని ఎరుగరు. వర్ణములు నేడున్నట్లు, ఆ కాలమున అనేక విభాగములతో లేవు. ఆ రోజులలో హిందూ ఆర్యులందు నాలుగు సంఘభాగములు, అనగా నాలుగు వర్ణములుమాత్రమే ఉండెను. అవి యెవ్వియన — బ్రాహ్మణులు:—వీరు పండితులు, పురోహితులు, ఋషులు; క్షత్రియులు:—పరిపాలకులు; వైశ్యులు:—వర్తకముచేయువారు; శూద్రులు:—పాటుపడి పనిచేయు కార్మికులు. కాన వర్ణవిభాగము వృత్తులనుబట్టి వచ్చెనని స్పష్టమగుచున్నది. తమచే జయింపబడిన జాతులతో తాము కలియకుండ ఉండు తలంపుతో వర్ణవిభాగము ఆర్యులు చేసియుండవచ్చును కూడ. ఆర్యులు అభిమానపూరితులు. ఇతరజాతులను వారు తిర

స్కారభావముతో చూచునంతటి దురహంకారపూరితులు. కాన తమ జాతివా రితరజాతులతో కలియుట వారి కిష్టము లేకుండును. సంస్కృత ములో వర్ణ మను పదమునకు రంగు అని యర్థము. దీనినిబట్టి హిందూదేశమునకు వచ్చిన ఆర్యులు అచ్చటి యాదిమనివాసులకంటె సుందర మైనవారు, శుభ్రవర్ణులు అని తేటపడుచున్నది.

ఆర్యులు కార్మికుల నణచిపెట్టి వారిని తమ ప్రజాపరిపాలనమునం దేవిధముగను కలుగజేసికొనకుండ చేసి రను విషయ మొక్కటియు, తమలో తాము స్వేచ్ఛ ననుభవించుచుండి రను విషయ మొక్కటియు మనము జ్ఞాపకముంచుకోవలెను. వారి రాజులుగాని, పాలకులుగాని అక్రమముగా ప్రవర్తించుటకు వారు సమ్మతించలేదు. ఒకవేళ అక్రమ ముగా ప్రవర్తించినచో అట్టివారిని పదభ్రష్టులను చేయుచుండిరి. సాధా రణముగా రాజులు క్షత్రియ వర్ణస్థులై యుండెడివారు. ఒక్కొక్కప్పుడు యుద్ధతరుణములందును, కిష్టకాలములందును తక్కువవర్ణస్థుడగు శూద్రుడు సైతము స్వసామర్థ్యముచే రాజు కావచ్చును. కాలము గడ చినకొలది ఆర్యులు క్షీణదశకు వచ్చిరి. వర్ణవిభాగము మార్పుచెందు టకు వీలులేకుండ కర్కశమయ్యెను. అనేకవిభాగము లుదయించుటచే దేశము బలహీనమై పతనమయ్యెను. ఇదివరలో వా రవలంబించిన స్వేచ్ఛనుగూర్చిన భావములుకూడ అంతరించెను. ఆర్యు డెన్నడును బానిస కాడనియు, ఆర్యనామమున కపకీర్తి కలిగించుటకన్న చావు మేలనియు వెనుకటి రోజులలో చెప్పుచుండెడివారు.

ఆర్యుల వలసలు, పట్టణములు, పల్లెలు ఒక క్రమపద్ధతి ననుస రించి నిర్మింపబడినవి. రేఖాగణితము ననుసరించి యీ పద్ధతు లున్న వని చెప్పిన నీ వాశ్చర్యపడుదువు. రేఖాగణితము ననుసరించి యంత్ర ములు వేసి వేదకాలమున పూజించుచుండెడువారుకూడ. నేడుకూడ హిందూగృహములు పెక్కింటిలో ఇట్టి యంత్రపూజలు జరుగుచున్నవి. గృహనిర్మాణమునకును, పట్టణనిర్మాణమునకును రేఖాగణితము దగ్గరి

సంబంధము కలిగియున్నది. ప్రాచీనార్యుల గ్రామము బహుళా ఒక దుర్గమైయుండెడిది. అప్పుడు శత్రుభయ మధికము, శత్రుభయము లేనప్పుడు సైతము నిర్మాణపద్ధతిలో మార్పురాలేదు.

ఒక సమచతురస్రము. దానిచుట్టును ప్రహరీగోడలు, నాలుగు పెద్ద ద్వారములు, నాలుగు చిన్న ద్వారములు—ఇది వారి పద్ధతియై యుండును. గోడల మధ్య ప్రదేశమున ఒక క్రమమున వీథులును, ఇండ్లును ఉండును. గ్రామమధ్యమున పంచాయతీగృహ ముండును. గ్రామపెద్ద లీ గృహమందు సమావేశమగుచుందురు. చిన్న గ్రామములలో పంచాయతీగృహమునకు బదులు ఒక పెద్దచెట్టు ఉండును. ప్రతి సంవత్సరము గ్రామములోని స్వతంత్రు లందరును చేరి తమ పంచాయతీ నెన్నుకొందురు.

పండితులు పలువురు పట్టణములకు, పల్లెలకు సమీపమందున్న అడవులకు, శాంతముగా జీవితమును గడుపుటకో, అధ్యయనాదులు జరుపుకొనుటకో పోయెడివారు. వారిని ఆశ్రయించుటకు శిష్యులు వచ్చి చేరుచుండెడివారు. ఇట్లు క్రమముగా క్రొత్త వలసలు ఉపాధ్యాయులతోను, శిష్యులతోను తయారగుచుండెను. ఈ వలసలు విశ్వవిద్యాలయములని మనము భావించవచ్చును. అచ్చట చక్కని భవనము లనేకములు లేవు గాని జ్ఞానార్జనకై దూరప్రాంతములనుండి ఆ విద్యాస్థానమునకు పలువురు వచ్చుచుండిరి.

ఆనందభవనమున* కెదురుగా భారద్వాజాశ్రమ మున్నది. నీ కది బాగుగా తెలియును. రామాయణకాలమున భరద్వాజుడు ఋషి యనియు, వనవాసకాలమున శ్రీరామచంద్రు డాతనిని దర్శించెననియు నీకు తెలిసియే యుండవచ్చును. అతని ఆశ్రమమున వేలకొలది విద్యార్థు లుండెడివారని చెప్పుదురు. భరద్వాజుడు ప్రధానాచార్యుడుగా నది యొక పెద్ద విశ్వవిద్యాలయమై యుండవలెను. ఆ రోజులలో ఆశ్రమము గంగాతీరమున

* అలహాబాదులో నెహ్రూ కాపురముండు ఇల్లు.

నుండెను. ఇప్పుడు గంగ ఒక మైలుదూరముగా పోయినది. మన తోట భూమి కొన్నిచోట్ల ఇసుకమయము. ఆ దినములలో నిది గంగ పారు ప్రదేశమై యుండవచ్చును.

హిందూదేశమున నున్న ఆర్యుల కా తొలిదినములు ఉచ్ఛకాలమైయుండెను. ఈ కాలమునకు మన దురదృష్టవశమున. చరిత్ర లేదు. మనకు తెలిసిన విషయము లన్నియు చరిత్రకాని గ్రంథములనుండి గ్రహించినవే. ఆ కాలమునాటి రాజ్యములు, ప్రజాప్రభుత్వరాజ్యములు ఏవనగా—దక్షిణ బీహారులోని మగధరాజ్యము; ఉత్తర బీహారులోని విదేహరాజ్యము; కాశీరాజ్యము; అయోధ్య రాజధానిగా గల కోసల రాజ్యము (అయోధ్యనే నేడు ఫైజాబాదు అందురు); గంగా యమునలకు మధ్యనున్న పాంచాలదేశములు. పాంచాల రాజ్యములందలి ప్రధాననగరములు మథుర కాన్యకుబ్జములు. ఇవి తరువాతికాలపు చరిత్రలోకూడ ప్రసిద్ధి వహించినవి. ఈ రెండు నగరములును ఇప్పుడున్నవి. కాన్యకుబ్జమునకు నేటిపేరు కనోజ్. ఇది కాన్పూరుసమీపమున నున్నది. ఆ రోజులలో ఉజ్జయినికూడ ఉండెను. నేడది గ్వాలియరుసంస్థానములో చిన్నపట్టణము.

పాటలీపుత్రము (పాట్నా)నకు సమీపమున వైశాలి యను నగరముండెను. ప్రాచీన హిందూదేశచరిత్రలో ప్రసిద్ధిజెందిన లిచ్ఛవులతెగకు చెందిన ముఖ్యపట్టణ మిది. వారి రాజ్యము ప్రజాప్రభుత్వరాజ్యము. ప్రసిద్ధ పురుషుల సంఘము ఈ రాజ్యమును పాలించెను. ఈ సభకు ఎన్నుకొన్నఅధ్యక్షు డుండెను. అతనిని నాయకు డనువారు.

కాలము గడువగా పెద్ద పట్టణములు, నగరములు పెరుగజొచ్చెను. వర్తకము వృద్ధియయ్యెను. శిల్పవిద్యలు, వృత్తులు వికాసముచెందెను. నగరములు గొప్ప వర్తకకేంద్రము లయ్యెను. బ్రాహ్మణులు శిష్యులతో నివసించు వనవాటికలలోని ఆశ్రమములు గొప్ప విశ్వవిద్యాలయపట్టణములైనవి. ఈ విద్యాసంస్థలలో అప్పటి శాస్త్రము లన్నియు బోధించెడి

వారు బ్రాహ్మణులు ధనుర్విద్యనుసైతము బోధించెడివారు. జ్ఞాపకమున్నదా, మహాభారతకథలోని పాండవుల గురువు ద్రోణాచార్యు డని. ఇతడు బ్రాహ్మణుడు. ఇతరశాస్త్రములతోపాటు ఈతడు రణవిద్యను కూడ శిష్యులకు బోధించెను.

## 11

# వేయిసంవత్సరముల చీనాచరిత్ర

జనవరి 16, 1931.

బయటి ప్రపంచమునుండి వార్తలు వచ్చినవి. మనోవ్యాకులత్వము దుఃఖము కలిగించు వార్తలు. అయినను గర్వము, సంతోషము పొందదగిన వార్తలు. షోలాపూరు ప్రజల దుర్భరావస్థ మాకు వినవచ్చినది. ఈవార్త విన్నప్పుడే దేశము నలుమూలల జరిగిన సంగతులుకూడ మాకు కొద్దిగా తెలియవచ్చినవి. మన యువకులు తమ ప్రాణము లర్పించుచున్న సమయమున, వేలకొద్ది మన స్త్రీ పురుషులు క్రూరమగు లాఠీదెబ్బలకు గురియగుచున్న సమయమున, ఇచ్చట చేతులుకట్టుకొని కూర్చుండుట కష్టముగానున్నది. ఇది మనకు మంచి తరిబీదు. మనలో ప్రతియొక్క స్త్రీకిని పురుషునకును తమతమ సామర్థ్యములు పరీక్షించుకొనుటకు తగిన తరుణములు తటస్థించునని యూహించెదను. బాధల నెదుర్కొనుటకు మనవారు ఎట్లు సాహసముతో ముందంజవేయుచున్నారో తలచుకొనినప్పుడును, శత్రువు ఉపయోగించు ప్రతి క్రొత్తసాధనము, కొట్టు ప్రతిదెబ్బ ఎట్లు వారిని బలయుతులనుగాను, ప్రతిఘటించు పట్టుదల గలవారినిగాను చేయుచున్నవో తలచుకొనినప్పుడును మన హృదయము ఉప్పొంగుచున్నవి.

ప్రస్తుత వార్తలు మనస్సు నాక్రమించినప్పుడు ఇతర విషయములనుగూర్చి యాలోచించుట కష్టము. కాని వట్టి ఊహలవలన ప్రయోజనము లేదు. నికరముగా పనిచేయవలసి వచ్చినప్పుడు మన మనస్సులను

మనము నిగ్రహించుకొనవలెను. కాన మనము ప్రాతకాలమునకు పోవుదము. కొంతసేపు మన ప్రస్తుత కష్టములకు దూరముగా ఉందము.

ప్రాచీనచరిత్రలో ఇండియాకు సోదరియైన చీనాకు పోదము. చీనాలోను, తూర్పు ఆసియాలోని ఇతరదేశములైన జపాను, కొరియా, ఇండోచీనా, సయాం, బర్మాలలోను ఆర్యుల ప్రశంసరాదు. ఇచ్చట నున్న వారు మంగోలియాజాతులు.

5000 సంవత్సరములకు పూర్వమందో, అంతకంటెను పూర్వమందో పడమటినుండి చీనాపై దండయాత్ర వచ్చినది. దండయాత్ర చేసిన తెగలుకూడ మధ్యఆసియానుండియే వచ్చినవి. వారు నాగరీకమున కొంత వృద్ధిచెందినవారే. వ్యవసాయము వారికి తెలియును. వారు పశువుల మందలను పెట్టుకొనుచుండిరి. మంచి యిండ్లు కట్టుట వారికి వచ్చును. వారి సంఘము బాగుగా అభివృద్ధి జెందియుండెను. వారు హోయాంగ్‌హో, అనగా పచ్చనదివద్ద నివాసము లేర్పాటుచేసికొని రాజ్యతంత్రమును నిర్మించుకొనిరి. చాలా వందల సంవత్సరముల కాలములో చీనాదేశమును వారు వ్యాపించిరి. వారి శిల్పములను, కళలను వృద్ధిజేసికొనిరి. చీనాప్రజలు ముఖ్యముగా వ్యవసాయదారులు. వారి నాయకులు నిజముగా కులపెద్దలే. వీరినిగురించి ఇదివరలో నీకు వ్రాసియుంటిని. 6, 7 వందల సంవత్సరములకు తరువాత—అనగా నేటికి 4000 సంవత్సరములకు పూర్వము—యావో అను పురుష డొకడు చక్రవర్తి యనిపించుకొన్నట్లు మనకు తెలియుచున్నది. ఇతడు చక్రవర్తి బిరుదమును పెట్టుకొన్నప్పటికిని కులపెద్దవంటివాడే కాని ఈజిప్టు మెసపొటేమియాలనేలిన చక్రవర్తులవంటివాడుమాత్రము కాడు. చీనాప్రజలు వ్యవసాయదారులుగానే ఉండిపోయిరి. కేంద్రప్రభుత్వము వారికి లేదు.

తమ ప్రజలచే కులపెద్ద లెన్నుకొనబడెడివారని నీకు చెప్పియుంటిని. తరువాత ఆ పదవి వంశపరంపరగా సంక్రమించుచుండెను. చీనాలో ఇట్లు సంభవించెను. యావో అనంతరము ఆతని పుత్రుడు చక్రవర్తి

కాలేదు. దేశమునందు మిక్కిలి సమర్థుడగువాని నింకొకనిని అతడే నియమించెను. కొంతకాలమైన పిమ్మట చక్రవర్తి బిరుదము వంశపరంపరాగత మయ్యెను. 400 సంవత్సరముల పైకాలము హిసియావంశము చీనాను పరిపాలించెనని చెప్పుదురు. చిట్టచివరి హిసియా చక్రవర్తి మిక్కిలి క్రూరుడై యుండుటచే ప్రజలు తిరుగుబాటు చేసి యతనిని పదభ్రష్టుని చేసిరి. షంగ్ వంశము, లేదా ఈన్‌వంశము అని చెప్పబడు వేరొకవంశము తరువాత ప్రభుత్వమునకు వచ్చెను. సుమారు 650 సంవత్సరములపాటు ఈ వంశము రాజ్యము చేసెను.

వేయి సంవత్సరములకు పైబడిన చీనా చరిత్రను ఒక చిన్న పేరాలో, రెండుమూడు వాక్యములతో నేను చెప్పివేసితిని. విశాలమగు చరిత్రభాగముల నిట్లు చేయగలుగుట ఆశ్చర్యకరముకాదా? కాని నా చిన్న పేరామాత్రము 1000, లేదా 1100 సంవత్సరముల కాలమును కుదించలేదని నీవు గ్రహించవలెను. రోజులు, నెలలు, సంవత్సరములలో కాలమును గణించుటకు మన మలవాటు పడితిమి. నూరు సంవత్సరముల కాల మనినేమో స్పష్టముగా ఊహించుట మనకు కష్టము. నీ వయస్సు పదమూడు సంవత్సరములు ఎంతో పెద్దకాలముగా కనిపించును. కాదూ? ఒక్కొక్క సంవత్సరము గడచినకొలది నీవు పెద్దదాన వగుచుందువు. ఇట్టి సందర్భములో వేయి సంవత్సరముల చరిత్రయన నీ వెట్లు గ్రహించగలవు? అది దీర్ఘ కాలము. తరమువెంబడి తరము వచ్చును, పోవును. పట్టణములు గొప్పనగరము లగును. పిమ్మట శిథిలమగును. వాటి స్థానే క్రొత్తనగరములు జన్మించును. కడచిన వేయి సంవత్సరముల చరిత్రను తలచుకొనుము. అప్పుడు బహుశా ఈ దీర్ఘ కాలము నీ కర్థముకావచ్చును. ఈ వేయి సంవత్సరములలో ప్రపంచమం దెట్టియా శ్చర్యకరమగు మార్పులు కలిగినవో?

చిరవిజ్ఞాన సంప్రదాయములతోను, 500 లేదా 600 సంవత్సరములో, అంతకు పైబడియో నిలిచిన వంశములతోను కూడుకొన్న చీనా చరిత్ర అద్భుతమైనది.

5

ఒక పేరాలో నేను ముగించిన 1100 సంవత్సరములలో చీనా ఎంత మందముగా అభివృద్ధి జెందినదో ఊహించుకొనుము. క్రమక్రమముగా కులపెద్దలు రాజ్యము చేయుపద్ధతి క్షీణించిపోయినది. కేంద్ర ప్రభుత్వము తలయెత్తి అభివృద్ధిలోనికి వచ్చినది. సర్వాంగ శోభితమగు రాజ్యము పొడచూపినది. ప్రాచీనకాలమందు సైతము వ్రాత యను కళ చీనాకు తెలియును. కాని చీనావారి వ్రాత మన వ్రాతకు భిన్నముగా నుండును. ఇంగ్లీషు, ఫ్రెంచివ్రాతలకును భిన్నముగా నుండును. దానికి అక్షరమాల లేదు. వారి వ్రాత చిహ్నముల రూపముననో, బొమ్మల రూపముననో ఉండును.

640 సంవత్సరములు పరిపాలనచేసిన పిమ్మట షాంగ్‌వంశము విప్లవము కారణముగా అంతరించెను. పిమ్మట ఒక క్రొత్తవంశము— చౌవంశము ప్రభుత్వమునకు వచ్చెను. ఈ వంశము షాంగ్‌వంశము కన్న ఎక్కువకాలము రాజ్యముచేసెను. ఇది 867 సంవత్సరములు నిలిచెను. ఈవంశము రాజ్యముచేయుచున్న కాలమునందే చీనారాజ్యము సర్వాంగశోభిత మయ్యెను. ఈ కాలమునందే చీనాతత్త్వజ్ఞు లిద్దరు— కంఫ్యూసియస్ అనునతడును, లోచే అనునతడును నివసించియుండిరి. ముందుముందు వీరినిగురించి కొంత నేర్చుకొందము.

షాంగ్‌వంశమును ప్రజలు తరిమివేసినప్పుడు, వారి పెద్దయుద్యోగులలో ఒకడైన కీచే అనువాడు చౌవంశమువారిని కొలుచుట కిష్టపడక దేశాంతరవాసము చేసెను. 5000 మంది అనుచరులతో అతడు చీనా విడిచి కొరియాకు పోయెను. ఆ దేశమున కీతడు చోజన్ అను పేరు పెట్టెను. చోజన్ అనగా ఉదయప్రశాంతి గల దేశము అని యర్థము. కొరియా (చోజన్) చీనాకు తూర్పుగా నున్నది. కాన కీచే తూర్పుగా ఉదయసూర్యునివైపు వెళ్లె నన్నమాట. బహుశా అతడు కొరియాకు తూర్పుగా ఇక దేశములేదని తలచియుండవచ్చును. అందువల్లనే ఆపేరు దేశమునకు పెట్టెను. కీచేతో కొరియాచరిత్ర ప్రారంభమయ్యెను.

ఇది క్రీస్తుపుట్టుటకు 1100 సంవత్సరములకు ముందుమాట. ఈ క్రొత్త దేశములో కీచే చీనాదేశకళలను, శిల్పవృత్తులను, గృహనిర్మాణమును, వ్యవసాయమును, పట్టుపరిశ్రమను ప్రవేశపెట్టెను. చీనానుండి పలువురు జనులు కీచేవెనుక కొరియాకు పోయిరి. కీచేసంతతివారు చోజన్‌దేశమును 900 సంవత్సరములకాలము పరిపాలించిరి.

చోజన్‌కు తూర్పుగా దేశములు లేకపోలేదు. దానికి తూర్పుగా జపాను ఉన్నట్లు మనకు తెలియును. కీచే చోజన్ వెళ్ళినప్పుడు జపానులో ఏమి జరుగుచున్నదో మనకు తెలియదు. చీనా చరిత్రవలెగాని, కొరియా (చోజన్) చరిత్రవలెగాని జపానుచరిత్ర అంత ప్రాచీనమైనది కాదు. జపానుదేశస్థులు చెప్పుమాట ఏమనగా—వారి ప్రథమచక్రవర్తి జిమ్ముటెన్నో అనువాడనియు, అతడు క్రీస్తుపుట్టుటకు 600, లేదా 700 సంవత్సరములకుముందు రాజ్యముచేసెననియు. అతడు సూర్యదేవి సంతతివాడని వారి నమ్మకము. జపానులో సూర్యుని స్త్రీదేవతగా భావింతురు. జపానుయొక్క ప్రస్తుతచక్రవర్తి జిమ్ముటెన్నోసంతతివాడని వారు చెప్పుదురు, కాబట్టి అతడు సూర్యసంతతివాడని పలువురు జపానీయులు నమ్ముదురు.

మన దేశమందుకూడ రాజపుత్రులు ఆవిధముగానే తమ మూలపురుషుడు సూర్యుడో, చంద్రుడో అని చెప్పుదురు. వారిలో రెండు వంశము లున్నవి. కొందరు సూర్యవంశస్థులు, కొందరు చంద్రవంశస్థులు. ఉదయపూరు మహారాజా సూర్యవంశస్థులలో పెద్ద. తన వంశమెంతో ప్రాచీనమైన దని ఆయన చెప్పెను. మన రాజపుత్రులు అసామాన్యులు. వారి వీర్యమును, పరాక్రమమును వర్ణించు కథలకంతము లేదు.

# 12

# ప్రాచీనకాలము పిలుచు పిలుపు

జనవరి 17, 1931.

సుమారు 2500 సంవత్సరముల పూర్వమువరకు ప్రాచీన ప్రపంచము ఏ విధముగా ఉండవచ్చునని ఊహించబడుచున్నదో దానిని ఇంత వరకు సంక్షేపముగా చూచితిమి. మన పర్యవేక్షణము మిక్కిలి సంక్షేపమైనది. ఒకవిధముగా అభివృద్ధి చెందినట్టియు, లేదా ఏదో ఒకవిధమైన చరిత్ర గలిగినట్టియు దేశములను గురించియే మనము ముచ్చటించుకొంటిమి. ఈజిప్టులో పిరమిడ్లు, స్ఫిన్క్సు, ఇంకను ఇచ్చట వివరించుటకు వీలులేని యితర విషయములు ఏ గొప్ప నాగరీకము విజృంభించినప్పుడు విలసిల్లినవో దానిని స్పృశించితిమి. ఈ గొప్ప నాగరీకత ఉచ్చ స్థితి ననుభవించి, మనము ముచ్చటించుకొనుచున్న కాలమునాటికే క్షీణించుటకు మొదలుపెట్టెను. క్నొసోసుకూడ అంతరించుటకు సిద్ధముగానున్నది. చీనాలో విశాల కాలభాగములనుగూర్చి ముచ్చటించితిమి. ఆ కాలములో చీనా గొప్ప కేంద్రసామ్రాజ్యముగా పెరిగి వృద్ధిజెందినది. వ్రాత, పట్టుతీయుట మున్నగు అనేక అందమగు విషయము లచ్చట తలయెత్తి వృద్ధిజెందినవి. కొరియా జపానులను కొద్దిగా పరిశీలించితిమి. సింధులోయలో నున్న మొహెంజదారోలోని శిథిలములనుబట్టి తెలియవచ్చు ప్రాచీననాగరీకతను గూర్చియు, విదేశములతో వర్తకము సాగించిన ద్రావిడుల నాగరీకతనుగూర్చియు, ఆర్యులనుగూర్చియు కొద్దిగా తెలిసికొంటిమి. ఆ రోజులలో ఆర్యులు రచించిన కొన్ని గ్రంథములను-వేదములను, ఉపనిషత్తులను, మహాకావ్యములైన రామాయణ మహాభారతములను గమనించితిమి. ఉత్తర హిందూస్థానము నాక్రమించి, పిమ్మట దక్షిణమునకుపోయి ప్రాచీనద్రావిడులతో కలిసి క్రొత్తనాగరీక

మును, సంస్కృతిని నిర్మించిన ఆర్యుల నంటిపోతిమి. వారు నిర్మించిన నాగరీక సంస్కృతులలో కొంత ద్రావిడులపాలును. ఎక్కువగా ఆర్యుల పాలును ఉన్నట్లు తెలిసికొంటిమి. ప్రజాపరిపాలనా పద్ధతులమీద వారి గ్రామసంఘము లెట్లు పట్టణములుగాను, నగరములుగాను పరిణమించి నవో, వారి వనవాటికలందలి యాశ్రమములు విశ్వవిద్యాలయములుగా ఎట్లు పరిణమించినవో తెలిసికొంటిమి. మెసపొటేమియా, పరిషియా దేశ ములలో ఒక సామ్రాజ్య మంతరించినపిమ్మట వేరొక సామ్రాజ్య మెట్లు పెరిగినదో, అందొక్క తుదిసామ్రాజ్యము, డరయస్క్రింద ఇండియా లోని సింధునదివరకు ఎట్లు వ్యాపించినదో సంక్షేపముగా తెలిసికొంటిమి. పాలస్తీనాలో హీబ్రూలు అల్పసంఖ్యాకు లైనప్పటికిని, ప్రపంచమునం దొకమూల నివసించుచున్న వారైనప్పటికిని. ఎట్లు ప్రపంచదృష్టి నాకర్షిం చిరో కొద్దిగా చూచితిమి. అంతకన్నగొప్పరాజుల పేళ్లు నామమాత్రా వశిష్టములైనప్పటికిని, బైబిలులో వారి పేళ్ళుండుటబట్టి వారి రాజులైన డేవిడ్, సామన్‌ల పేళ్లు నేటివరకు ఎట్లు నిలిచియున్నవో చూచితిమి. గ్రీసులో, ఆర్యుల క్రొత్తనాగరీకత, క్నాసోస్‌యొక్క ప్రాచీననాగరికతా శిథిలముపై ఎట్లు లేచి వృద్ధిచెందినదో గమనించితిమి. నగరరాష్ట్రములు వెలసినవి. గ్రీకుల వలసలు మధ్యధరాతీరప్రాంతముల లేచినవి. ఉచ్చ స్థితి ననుభవింపనున్న రోమును, దాని ప్రబలప్రతిస్పర్థి కార్తేజియును అప్పుడప్పుడే చరిత్రాకాశమున ఉదయించుచున్నవి.

పైవిషయములన్నియు దిఙ్మాత్రముగా చూచితిమి. ఎత్తుకొనని దేశములను గురించికూడ కొన్ని విషయములు నీకు నేను చెప్పియుండ వలసినదే—ఉత్తర యూరోపులోని దేశములు, ఆసియా కాగ్నేయముగా నున్నదేశములు. ఆ తొలిరోజులలోనే దక్షిణఇండియానుండి హిందూ నావికులు బంగాళాఖాతమును దాటి మలయాద్వీపకల్పమునకును, దానికి దక్షిణముగా నుండు ద్వీపములకును పోయియుండిరి. కాని ఎచ్చటనో ఒకచోట హద్దుపెట్టుకొనవలెను; లేకున్న ముందుకు సాగిపోజాలము.

మనము ముచ్చటించుకొన్న దేశములు పురాతనప్రపంచమునకు సంబంధించినవి. ఆ రోజులలో దూరదేశములకు రాకపోక లెక్కువగా లేవని నీవు జ్ఞాపకముంచుకోవలెను. సాహసికులగు నావికులు సముద్రములపై ప్రయాణములు సాగించిరి. కొందరు వర్తకమునకు, ఇంకను ఇతరకార్యములకు భూమిమీద దూరప్రయాణములు చేసిరి. కాని ప్రమాదము లధికముగా నుండుటచే ఇట్టి ప్రయాణములు అరుదుగా జరుగుచుండెను. భూగోళ శాస్త్రజ్ఞాన మాకాలమున మిక్కిలి కొంచెము. భూమి గుండ్రముగాగాక బల్లపరుపుగా నుండెనని యాకాలపువారి నమ్మకము. అకారణమున సమీపమందున్న దేశములనుగురించియేకాని ఇతర దేశములనుగురించి ఎవరికిని ఎక్కువగా తెలియదు. గ్రీసులోని జనులు చీనా ఇండియాలనుగురించి ఏమియు నెరుగరు. చీనా, ఇండియాదేశస్థులకు మధ్యధరాదేశముల సంగతి తెలియదు.

దొరికినచో పురాతన ప్రపంచపటము నొకమారు చూడుము. ప్రాచీన గ్రంథకర్తల ప్రపంచవర్ణనలును, పటములును మన కిప్పుడు నవ్వు పుట్టించును. ఆ పటములలో వేర్వేరు దేశముల స్వరూపములు అసాధారణముగా నుండును. నేడు తయారైన పురాతనకాలమునకు సంబంధించిన పటములు మనకు సహాయకారులుగా నుండును. పురాతన కాలమునుగూర్చి చదువునప్పుడు అట్టి పటముల సహాయమును నీవు తీసికొందువని ఆసించుచున్నాను. దేశపటమువల్ల ప్రయోజన మధికముగా నుండును. అది లేనిదే చరిత్ర బోధపరుచుకొనుట కష్టము. నిజానికి, చరిత్ర నేర్చుకొనుటకు పటములును, బొమ్మలును ఎన్నిఉన్న అంత మంచిది—పురాతన కట్టడముల బొమ్మలు, శిథిలముల బొమ్మలు, పురాతనకాలమునకు సంబంధించిన వస్తువుల బొమ్మలు. చరిత్ర వట్టి అస్థిపంజరమువంటిది. దానిని కప్పుటకు బొమ్మలున్నప్పుడే అది సజీవముగా మనకు కనిపించును. స్పష్టమగు మానసిక చిత్రముల పరంపరయే చరిత్ర. అట్టి మానసికచిత్రము లాకారము పొందునప్పుడే చరిత్ర పఠ

నమువలన మనము లాభము పొందవచ్చును. అట్టి సందర్భములలోనే చరిత్ర చదువుచున్నప్పుడు చరిత్రసంఘటనలు మన కన్నులముందర జరుగుచున్నట్లే తోచును. అది మనలను ఆకర్షించు చక్కని నాటక మయియుండవలెను. ఒకప్పు డానాటకము సుఖాంతము కావచ్చును. తరచు అది దుఃఖాంతమై యుండును. ఈ నాటకమునకు రంగము ప్రపంచము. కడచిన కాలమునాటి గొప్పపురుషులు, స్త్రీలు అందలి పాత్రలు.

చరిత్ర ఊరేగింపువంటిది. దానిని చూచి ఆనందించుటకు బొమ్మ లును, దేశపటములును కొంత సహాయముచేయును. ప్రతిబాలునకు, బాలికకు అవి అందుబాటులో ఉండవలెను. ప్రాచీనచరిత్రకు సంబంధిం చిన శిథిలములను స్వయముగా చూచుట బొమ్మలను చూచుటకన్న మంచిది. వీటి నన్నింటిని చూచుట సాధ్యము కాదు. ప్రపంచమందంత టను అట్టి శిథిలములు కలవు. జాగరూకతతో పరికించుచుండిన మనకు సమీపమందే కొన్ని ప్రాచీన శిథిలములు మనము పరిశీలించుటకు లభ్యము కావచ్చును. పెద్దపెద్ద వస్తుప్రదర్శనశాలలలో చిన్నచిన్న వస్తువులను, శిథిలములను ప్రోగుచేసియుంచుదురు. ప్రాచీనచరిత్రకు సంబంధించిన శిథిలము లిండియాలో అధికముగా గలవు. మిక్కిలి ప్రాచీనకాలమునకు సంబంధించినవి కొద్దిగానే ఉన్నవి. ఇంతవరకు అట్టివి, మనకు తెలిసి నవి మొహంజదారో, హరప్పలలో ఉన్నవి. మిక్కిలి ప్రాచీనమైన భవనము లీ యుష్ణదేశములో కూలిపోయి మట్టిలో కలిసిపోయియుండును. బహుశా పెక్కులు మట్టిలో కప్పబడి నేటికిని నిలిచియుండవచ్చును. వాటిని త్రవ్వినప్పుడు మనకు ప్రాచీనశిథిలములు, శాసనములు దృష్టి గోచరమగును. మన దేశ ప్రాచీనచరిత్ర మనకు క్రమక్రమముగా వెల్లడి యగును. మిక్కిలి పురాతనకాలమున మన పూర్వు లేమి చేసెడివారో ఈ రాళ్ళను, ఇటుకలను, సున్నమును బట్టి మనము తెలిసికొందుము.

నీవు ఢిల్లీ చూచియుంటివి. నేటి పట్టణము చుట్టుపట్టులలో కొన్ని శిథిలములను, ప్రాతకట్టడములను చూచియుంటివి. ఈమారు వాటిని

చూచినప్పుడు ప్రాచీనకాలమును తలచుకొనుము. అప్పు డవి నిన్ను ఆకాలమునకు కొంపోయి, నీకు చరిత్రను బోధించును. పుస్తకము లట్లు బోధించలేవు. మహాభారత కాలమునుండియు ఢిల్లీనగరమందును, తత్పరిసరములందును జనులు నివసించుచుండిరి. వారు దానికి పెక్కు-పేరులు పెట్టిరి—ఇంద్రప్రస్థము, హస్తినాపురము, తుగ్లఖాబాదు, షాజహానాబాదు. ఇంకా ఎన్నో పేళ్లుండవచ్చు, నాకు తెలియదు. వృద్ధవ్యవహారమేమనగా—ఏడుచోట్ల ఏడు ఢిల్లీనగరము లుండెడివట. నగరము స్థలముమారుటకు కారణము యమునానదిగతి మారుచుండుటయే. ఇప్పుడు ఎనిమిదవ నగరము మనము చూచుచున్నాము. దాని పేరు రైసీనా. దానినే క్రొత్తఢిల్లీ అందురు. ఇది నేటి పరిపాలకుల ఉత్తరువుప్రకారము లేచినది. సామ్రాజ్యమువెనుక సామ్రాజ్య మీఢిల్లీలో వృద్ధిపొంది తుద కంతరించినవి.

నగరములన్నింటిలో ప్రాచీనమైన వారణాసికి (కాశీకి) వెళ్లుము. దాని మర్మరధ్వనులను చెవియొగ్గి వినుము. అది దాని పురాతనగాథ నీకు చెప్పుచున్నది కాదా! సామ్రాజ్యములు పుట్టిపెరిగి అంతరించుట అది చూచినది. దానికి మాత్రము చలనము లేదు. బుద్ధుడు తన నూతన సందేశముతో అక్కడికి వెళ్ళినాడు. కలకాలమునుండియు కోట్లకొలది జనులు మనశ్శాంతిని పొందుటకై దానిని దర్శించినారు. ముసలిపండు. దుర్బలమైనది. మలినముగా నున్నది. వాసనవేయుచున్నది. అయినప్పటికిని సజీవముగానున్నది. యుగము లిచ్చిన బలముతో ప్రవర్ధమాన మగుచున్న దీవారణాసి. మనోహరము, అద్భుతావహము నైనది కాశీ. దాని కన్నులలో నీవు ఇండియా ప్రాచీనత్వమును దర్శింపగలవు. గంగానదీ మర్మరధ్వనులలో కడచిన యుగముల కంఠధ్వనులు నీ వాలింపగలవు.

లేదా, మనకు సమీపమందున్న మన అలహాబాదు (ప్రయాగ)లోని పురాతన అశోక స్తంభమును దర్శించుము. అశోకచక్రవర్తి ఆజ్ఞ ప్రకారము దానిపై చెక్కిన శాసనమును చదువుము. 2000 సంవత్సరములనాటి అశోకుని కంఠధ్వని నేడు వినగలవు.

# 13

# ధన మెచ్చటికిపోవును?

జనవరి 18, 1931.

నీకు ముస్సోరీకి వ్రాసిన ఉత్తరములలో, వేర్వేరు తరగతుల ప్రజ లెట్లు వృద్ధిజెందిరో నీకు తెలియజెప్పుటకు ప్రయత్నించితిని. తొలి మానవులు తిండి సంపాదించుటకుసైతము ఎంతో కష్టపడువారు. వారు వేటాడుచుండిరి. రోజుకు రోజు పళ్లు, గింజలు సంపాదించుకొనుచుండిరి. తిండికై వెదకుకొనుచు ఒక చోటినుండి ఇంకొక చోటికి పోవుచుండిరి. క్రమక్రమముగా వారు తెగలుగా తయారైరి. ఇవి నిజముగా పెద్ద కుటుంబములే. తెగలోని మనుష్యులు కలిసి జీవించుచు, కలిసి వేటాడుచు నుండువారు. ఒక్కరట్లు చేయుటకన్న తెగలోనివారు కలిసి చేయుట క్షేమకరము. అప్పు డొక గొప్ప మార్పు వచ్చినది. అది వ్యవసాయమును కనిపెట్టుట. నిరంతరము వేటాడుటకన్న వ్యవసాయపద్ధతుల ననుసరించి భూమిని దున్ని పంటలు పండించుట సులభమని వారు గ్రహించిరి. దున్నుట, విత్తుట, నూర్చుట అన్నప్పుడు భూమి వద్ద నివసించుట యగును. ఇదివరలోవలె వారు పర్యటనము చేయ వీలులేదు. పొలములను కనిపెట్టుకొని ఒక్కచోట వా రుండవలెను. ఈ విధముగా పల్లెలు, పట్టణములు లేచినవి.

వ్యవసాయము ఇతరమార్పులనుకూడ ప్రవేశపెట్టినది. భూములు పండగావచ్చిన ఆహారపదార్థములు ఒక్కమారు వినియోగించుటకు కావలసినదానికన్న అధికముగా నుండెను. పెచ్చుగా నున్న పదార్థములు నిలువచేయవలసియుండెను. వేటాడు దినములలోకన్న నేడు జీవితమున చిక్కులు ఎక్కువగా నుండెను. కొందరు పొలములలోను, ఇతర స్థలములందును పనిచేయుచుండిరి. మరికొందరు పైపెత్తనము, కలియ

గట్టుకొనివచ్చుట—అను పనులను చేయుచుండిరి. పెత్తనదార్లు, కలియ గట్టుకు వచ్చువారు క్రమక్రమముగా బలవంతులైరి. వారే కులపెద్దలు, అధికారులు, రాజులు, ప్రభువులు అయిరి. అధికార మున్నదికాబట్టి వారు పెచ్చుగా పండిన పంటలో చాలభాగము తమకొరకు అట్టే పెట్టుకొనుచుండిరి. ఆవిధముగా వా రానాటికానాడు భాగ్యవంతులైరి. పొలములలో పనిచేయువారికి పొట్ట నింపుకొనుటకు చాలినంతమాత్రము మిగులుచుండెను. కొంతకాల మైనపిమ్మట ఈ పెత్తనదారులును, కలియ గట్టుకొనివచ్చువారును తమ పనులు తాము, బద్ధకమువల్లనైతేనేమి, అసామర్థ్యమువల్లనైతేనేమి, చేయుట మానుకొనిరి. వారు ఏమియు చేయకున్నను వ్యవసాయదారులు పండించిన పంటలో అధికభాగము పుచ్చుకొను విషయములోమాత్రము శ్రద్ధ వహించుచుండిరి. తా మేమియు చేయనక్కరలేదనియు, ఇతరులు చేసిన కష్టమును అనుభవించుటకు తమకు హక్కున్నదనియు వా రూహించ మొదలిడిరి.

చూచితివా, వ్యవసాయము వచ్చుటవల్ల జీవితవైఖరి ఎట్లు మారినదో? వ్యవసాయము ఆహారము సంపాదించుటకు మంచి పద్ధతిని ప్రవేశపెట్టుటవల్లను, సులభముగా ఆహారము దొరుకునట్లు చేయుటవల్లను అది సంఘముయొక్క పుట్టకీట్లను మార్చివేసినది. అది ప్రజలకు విరామమిచ్చినది. వేర్వేరు తెగల మనుష్యులు ఏర్పడిరి. ప్రతియొక్కడును ఆహారమును సంపాదించుటకు పాటుపడుట లేదు. కొందరు వేరొకపని చేసికొనవచ్చును. అనేకరకముల కళలు తలయెత్తినవి. క్రొత్తవృత్తులు ఏర్పాటైనవి. కాని అధికారము ప్రజలను కలియగట్టుకువచ్చువారి చేతులలోనే ముఖ్యముగా నిలిచిపోయెను.

ఆహారమును, ఇతర జీవితావసరములను తయారుచేయుటకు నూతన పద్ధతులు వచ్చినపుడు ఎట్టి గొప్పమార్పులు తటస్థించినవో పిదప కాలపు చరిత్రలో నీవు తెలిసికొందువు. ఆహారమును వలెనే ఎన్నియో ఇతరవస్తువులను సైతము మానవులు వాంఛించుచుండిరి. కాన

ఉత్పత్తిపద్ధతులలో గొప్పమార్పు వచ్చినప్పుడు సంఘమందుకూడ గొప్పమార్పులు కలుగుచుండెను. ఇందుకై నీకొక పెద్ద దృష్టాంతము చూపెదను. కర్మాగారములు పనిచేయుటకును, రైళ్ళను, ఓడలను నడపుటకును నీటి ఆవిరిని వినియోగించినప్పుడు ఉత్పత్తి, పంపకము చేయు పద్ధతులలో గొప్పమార్పు వచ్చినది. శిల్పులును, పనివాండ్రును సామాన్యోపకరణములతో, చేతులతో, వస్తువులు చేయుటకు కొంతకాలము పట్టును. ఆవిరి నుపయోగించు కర్మాగారము లింతకన్న త్వరగా ఆ వస్తువులను తయారుచేయగలవు. ఒక గొప్ప యంత్రము నిజముగా ఒక పెద్ద పనిముట్టు. ఆహారపదార్థములను, కర్మాగారములలో తయారైన పదార్థములను దూరదేశములకు త్వరలో తీసికొని పోవుటకు రైళ్ళును, ఓడలును ఉపకరించినవి. ప్రపంచమునం దంతటను పరిస్థితులలో ఎట్టిమార్పు వచ్చినదో నీ వూహించుకోగలవు.

ఆహారపదార్థములను, ఇతర వస్తువులను త్వరలో ఉత్పత్తిచేయు నూతనపద్ధతులు చరిత్రలో అప్పటప్పట కనిపెట్టబడినవి. ఉత్పత్తి చేయుట కింతకన్న మంచిపద్ధతులను ప్రవేశపెట్టినచో ఎక్కువ సరకు ఉత్పత్తియగుననియు, ప్రపంచము భాగ్యవంత మగుననియు ప్రతి యొక్కనికిని ఎక్కువగా పదార్థములు లభ్యమగుననియు, నీ వనుకొనవచ్చును. నీ ఊహ కొంతవరకు సరి, కొంతవరకు తప్పు. ఉత్పత్తికి శ్రేష్ఠపద్ధతు లుపయోగించుటవల్ల ప్రపంచము భాగ్యవంతమైనమాట నిజమే. కాని ప్రపంచములో ఏ భాగ మట్లు భాగ్యవంతమైనది ? మన దేశములో ఇంకను కటిక దారిద్ర్యము, దైన్యము నిలిచియున్న వనుట నిర్వివాదము. కాని ఇంగ్లాండువంటి భాగ్యవంతమగు దేశములోకూడ ఇట్లే ఉన్నది. ఎందువల్ల? ధన మెచ్చటికి పోవును? నానాటికిని ధనము అధికముగా వచ్చుచున్నను బీదవారు బీదరికములోనే కొట్టుకొనుచుండుట ఆశ్చర్యమే. కొన్ని దేశములలో బీదవారిస్థితి కొంతవరకు నయము. కాని వచ్చిన ధనముతో పోల్చిచూచిన వారి బాగు బహుస్వల్పమనియే చెప్పవలెను. కాని

ఈ ధన మెవరికి పోవుచున్నదో మనము సులభముగా కనుగొనగలము. పెత్తనదార్లును, నలుగురిని కలియగట్టుకు వచ్చువారును ఉన్నారుగదా! వారు లాభములలో అధికభాగము సంగ్రహించుటచే ఈ ధనము వారి వశమగుచున్నది. ఇంతకన్న వింతవిషయ మేమనగా—సంఘములో కొన్ని తెగలు బయలుదేరినవి. వా రెట్టిపనిని చేయరు సరికదా ఇతరులు చేసినదానిలో అధికభాగము తాము తీసికొందురు. నమ్ముదువో లేదో- ఈ తెగ మనుష్యులు గౌరవింపబడుచున్నారు. కొందరు వివేకహీనులు తమ బ్రతుకునకై తాము స్వయముగా పనిచేసికొనుట గౌరవలోపమని భావించుచున్నారు. మన ప్రపంచ పరిస్థితు లిట్లు తలక్రిందుగా తయారైనవి. ఆహారమును పండించుచున్నప్పటికిని రైతు బీదస్థితిలో నున్నాడన్న ఆశ్చర్యమేమి? ప్రపంచభాగ్యమునకు కారకుడై కర్మాగారములలో పని చేయు కార్మికుడు బీదస్థితిలో నున్నాడన్న ఆశ్చర్యమేమి? మనదేశమునకు స్వాతంత్ర్యము కావలెనని మనము కోరుచున్నాము. ఈ తలక్రింది పరిస్థితులను చక్కజేయలేనప్పుడు; కార్మికునకు అలని కష్టమునకు ఫలము దక్కనప్పుడు ఎందు కీస్వాతంత్ర్యము? రాజనీతిశాస్త్రమునుగూర్చియు, పరిపాలనాకళనుగూర్చియు, ఆర్థికశాస్త్రమునుగూర్చియు, దేశభాగ్య మెట్లు విభజించవలెనో యన్న విషయమునుగూర్చియు పెద్దపెద్ద పుస్తకములు వ్రాయబడినవి. చదువుకొన్న పండితు లీవిషయములమీద ఉపన్యాసము లిత్తురు. ప్రసంగములు, చర్చలు జరుగుచునేయున్నవి. కాని కార్మికులు బాధపడుచున్నారు. 200 సంవత్సరములకు పూర్వము వాల్టేరు అను ప్రసిద్ధ ఫ్రెంచి గ్రంథకర్త రాజకీయవేత్తలు మున్నగువారిని గూర్చి ఈ విధముగా అన్నాడు— "పొలమును దున్నుచు, ఇతరులకు బ్రతుకు తెరువు కల్పించువారిని ఆకలిచే చచ్చునట్లు చేయు కళ వారు తమ చక్కని రాజకీయములలో కనిపెట్టినారు!"

ప్రాచీనమానవు డింకను ముందుకు సాగిపోయి క్రమముగా ప్రకృతి నాక్రమించెను. వనములను నరికివేసెను. ఇండ్లను కట్టెను. భూమిని దున్నెను. కొంతవరకు మానవుడు ప్రకృతిని వశపరచుకొన్నట్లే

చెప్పుదురు. ప్రకృతిని వశపరుచుకొనుట యనుమాట జనులు వాడుదురు. ఇది అనాలోచితమగు మాట. నిజముకాదు. ప్రకృతిని మానవుడు అర్థము చేసికొన మొదలుపెట్టినాడు అనుట ఇంతకన్న మంచిది. ఎంత బాగుగా అర్థము చేసికొనునో అంత చక్కగా అతడు దానికి సహకారము చేసి తన యవసరములకు దానిని వినియోగించుకొనగలుగుచున్నాడు. వెనుకటి రోజులలో ప్రకృతిని చూచినను, ప్రకృతిలో గోచరమగు కార్యములను చూచినను మనుష్యులు భయపడువారు. వాటిని అర్థముచేసికొని గ్రహించుటకు బదులు, పూజించి శాంతికై నైవేద్యము లర్పించెడివారు. ప్రకృతి వన్యమృగమైనట్లును, దానిని మంచిచేసికొని శాంతింప జేయవలసినట్లును వారి ఊహ. పిడుగులు, మెఱుములు, అంటువ్యాధులు వారిని భయపెట్టెను. నైవేద్యములవల్లనే వాటిని వారింపవచ్చునని వా రూహించిరి. అమాయకులనేకులు సూర్య చంద్ర గ్రహణములు భయంకర విపత్తులని భావింతురు. అవి ప్రకృతిలో జరుగు సామాన్య సంఘటనలని గ్రహించుటకు బదులు జను లనవసరముగా ఆవేశపూరితులై, సూర్య చంద్రులను రక్షించుటకై స్నానములు చేసి ఉపవాసము లుందురు. సూర్య చంద్రులు తమ్ము తాము రక్షించుకొను స్థితిలోనే ఉన్నారు. వారికొరకై మనము బెంగపడనవసరము లేదు.

నాగరికము, విజ్ఞానము ఎట్లు అభివృద్ధిచెందినవో తెలిసికొంటిమి. గ్రామములలోను, పట్టణములలోను ప్రజలు నివాసములేర్పరచుకొనుటతో ఇవి ప్రారంభించినవని తెలిసికొంటిమి. ఆహారపదార్థము లధికముగా వచ్చుచుండుటచే వారికి తీరిక చిక్కినది. వేట, తిండి గాక మరి యితర విషయములనుగూర్చి వా రాలోచించగలిగిరి. ఆలోచనలు వృద్ధిపొందిన కొలది కళలు, వృత్తులు, విజ్ఞానము వృద్ధినందెను. జనసంఖ్య వృద్ధియైన కొలది జనులు సన్నిహితముగ నివసించుట యవశ్యమైనది. వారు ఒకరొకరిని ఎప్పుడును కలుసుకొను చున్నారు. ఒకరితోనొకరు పనిపెట్టుకొను చున్నారు. కలిసిమెలిసి ఒక్కచో నుండవలసివచ్చినప్పుడు ఒకరి మంచి

ఒకరు చూడవలయును. తమ స్నేహితులకుగాని, పొరుగువారికిగాని ఇబ్బంది కలిగించు పనులు వారు చేయరాదు. అట్లు కానిచో సాంఘిక జీవనమే పొసగదు. దృష్టాంతముగా ఒక కుటుంబమును తీసికొనుము. కుటుంబము సంఘముయొక్క ఒక చిన్న తునుక. అందలి జను లన్యోన్యముగా నున్న వారు సుఖముగా జీవించగలుగుదురు. అన్యోన్యానురాగ ముండును. కాబట్టి కుటుంబములో సుఖజీవనము కష్టసాధ్యము కాదు. ఒక్కొక్కప్పుడు మనము ఇతరుల కష్టసుఖములను గమనించకుండ మెలగుట తటస్థించవచ్చును. మనకు సంస్కృతిగాని, నాగరీకముగాని లేనట్లు మెలగుదుము. కుటుంబముకన్న పెద్దదగు సంఘమునందు సరిగా ఈ విధముగానే జరుగుచున్నది.—మన పొరుగువారైనను అంతే, ఏక నగరవాసులైనను అంతే; మన దేశస్థులైనను అంతే, ఇతర దేశస్థులైనను అంతే. జనసంఖ్య పెరుగుటవల్ల సాంఘిక జీవనము అధికముగా గడపవలసి వచ్చినది; నిగ్రహముతో ఇతరుల కష్టసుఖము లాలోచించి మెలగవలసివచ్చినది. సంస్కృతి, నాగరీకము అన నేమో నిర్వచించుట కష్టము. నేను నిర్వచించ ప్రయత్నించను. ఆత్మనిగ్రహము లేక ఇతరుల కష్టసుఖములను పాటించనివాడు సంస్కృతిలేనివాడని నిష్కర్షగా చెప్పవచ్చును.

## 14

# క్రీస్తుకు పూర్వము ఆరవ శతాబ్ది: మతము

జనవరి 20, 1931.

చరిత్రయొక్క దీర్ఘ ఘంటాపథమును బట్టి పోవుదము. మన మొక మైలురాయి చేరుకొన్నాము - 2500 సంవత్సరములకు పూర్వము. ఇంకొకవిధముగా చెప్పవలసివచ్చిన క్రీస్తుకు పూర్వము సుమారు 600 సంవత్సరములు. ఇది సరియైన తేదీయని భావింపకుము. ఇంచుమించుగా

ఒక కాలనిర్దేశమును మాత్రము చేయుచున్నాను. ఈ కాల ప్రాంతమున గొప్ప పురుషు లనేకులుండిరి ; గొప్ప తత్వజ్ఞులు, మతస్థాపకులు వివిధ దేశములలో, చీనా. ఇండియాలు మొదలు పరిషియా, గ్రీసులవరకు ఉండిరి. వీరందరును సరిగా ఒకేకాలమున లేరు. సమీపకాలములలో వారుండుటచే క్రీస్తు పూర్వము ఆరవ శతాబ్ది ప్రసిద్ధిగన్న కాలఖండమైనది. అప్పుడు ప్రపంచమును భావతరంగ మొక్కటి—నాటి పరిస్థితులతో అసంతృప్తి, పరిస్థితులు బాగుపడు నను ఆశ, కోరిక—ఆవరించి యుండవచ్చును. మతస్థాపకులు పరిస్థితులు చక్కబరుచుటకును, ప్రజలను సత్పథమున బెట్టి వారి క్లేశములను తగ్గించుటకును ఎప్పుడును ప్రయత్నించెడివారని జ్ఞాపకముంచుకొనుము. అప్పటి లోపముల నెత్తిచూపుటకు వా రెన్నడును భయపడలేదు. వారు విప్లవకారులు, ప్రాత సంప్రదాయము దారితప్పి దుష్టమైనప్పుడుగాని, భావివృద్ధికి ఆటంకముగా నున్నప్పుడుగాని వారు దానిని ఖండించి నిర్భయముగా తొలగించిరి. అంతకన్న ముఖ్యవిషయము వారు ఆదర్శప్రాయముగా జీవించుచు, తరతరముల ప్రజలకు అసంఖ్యాకులకు ఆదర్శజీవనము ఆచరణరూపముగా చూపి యుండిరి. అట్టి జీవనము ప్రజలకు ఆదర్శమయినది. అట్లు బ్రతకవలెనని ఆవేశము నిచ్చినది.

క్రీస్తుకు పూర్వము ఆరవ శతాబ్దిని ఇండియాలో బుద్ధుడు, మహావీరుడు ఉండిరి; చీనాలో కంఫ్యూసియస్, లోచే లున్నారు; పర్షియాలో జరతుష్ట్ర * ఉన్నాడు; గ్రీకుద్వీపమైన శామాస్‌లో పైతాగొరాస్ ఉన్నాడు. వేరువేరు సందర్భములలో ఈపేళ్లు నీవు వినియుండవచ్చును. పైతాగొరాస్ క్షేత్రగణితములో ఒక సిద్ధాంతమును ఋజువుచేసిన అధికప్రసంగి అనియు, తాము, పాపము, దాని నిప్పుడు నేర్చుకోవలసివచ్చినదనియు సాధారణముగా బడికిపోవు బాలబాలికలు తలతురు. ఈ సిద్ధాంతము సమ

---

* జరతుష్ట్రి బహుశా క్రీస్తు పూర్వము ఎన్మిదవ శతాబ్దిలో ఉండియుండవచ్చును.

కోణత్రిభుజముయొక్క భుజముల చతురములకు సంబంధించినది. ఇది యూక్లిడ్ గ్రంథములోను,ఇతరక్షేత్రగణితములలోను ఉండును.క్షేత్రగణితములో ఆతడు కనిపెట్టిన విషయముల మాట అటుంచిన పైతాగొరాస్ ఒక గొప్ప తత్వవేత్త. అతనినిగురించి మన కెక్కువగా తెలియదు. కొందరు అట్టివా డొక డుండుట సందేహాస్పద మందురు.

పర్షియాలో పుట్టిన జొరాష్టరు (జరతుష్ట్ర) జొరాష్ట్రియను మతమును స్థాపించెనని చెప్పుదురు. అతనిని మతస్థాపకుడనుట సరికాదేమో ? పర్షియాలో అప్పుడున్న మతమునకును, భావములకును నూతన స్వరూపము నిచ్చి నూతన మార్గమున నడిపించెనని చెప్పుట మంచిదేమో ? అంతకుపూర్వ మెంతోకాలమునుండి ఈమతము పర్షియాలో లేదనియే చెప్పవచ్చును. పర్షియానుండి చిరకాలముక్రిందట ఇండియాకు వచ్చిన పారశీకులు ఈ మతమును తమతోకూడ తెచ్చుకొనిరి. నాటి నుండి దాని నాచరణలో పెట్టుచుండిరి.

ఈ కాలమున చీనాలో కంఫ్యూసియస్, లోచే అను గొప్ప పురుషు లిద్ద రుండిరి. కంఫ్యూసియస్ పేరు నిర్దుష్టముగా వ్రాయవలెనన్న నిట్లుండవలెను —— కాంగ్ ఫ్యూచే. సామాన్యార్థమున వీరిద్దరును మత స్థాపకులుకారు. నీతిమార్గములను, సంఘ మనుసరింపవలసిన సదాచార మార్గములను వా రేర్పరచిరి. చేయదగిన పని, చేయరాని పని వారు నిర్ణయించిరి. వారి మరణానంతరము వారి పేర పెక్కు దేవాలయములు చీనాలోస్మారకచిహ్నములుగా నిర్మింపబడినవి. హిందువులు వేదములను, క్రైస్తవులు బైబిలును గౌరవించు విధముగా చీనాదేశస్థులు వారి గ్రంథములను గౌరవించుచుండిరి. కంఫ్యూసియస్ బోధనల ఫలితమేమన, చీనా దేశస్థులు పెద్దమనిషి తరహా, గౌరవముగా నడచుకొనుట, సౌజన్యము, విజ్ఞానసంపన్నత అలవరచుకొనిరి.

ఇండియాలో మహావీరుడు, బుద్ధుడు ఉండిరి. నేడున్న జైన మతమును స్థాపించిన పురుషుడు మహావీరుడు.అతని అసలుపేరు వర్ధమానుడు.

మహావీరు డను బిరుద మాతని గొప్పతనమును సూచించునది. పశ్చిమ హిందూస్థానములోను, కథియవారులోను జైను లధికముగా నివసించు చున్నారు. నేడు వారిని తరుచు హిందువులలో చేర్చుదురు.కథియవారులోను, రాజపుత్రస్థానములోని ఆబూపర్వతమందును వారికి సుందరమగు దేవా లయములు గలవు. అహింస పరమధర్మమని వారు నమ్ముదురు. ఎట్టి ప్రాణికిని హానికలుగువిధముగా ఎట్టికార్యమును వారు చేయరు. ఈ సందర్భమున పైతాగొరాస్ శాకాహారి యనియు, తన శిష్యులనందరిని శాకాహారులుగా నుండ నియమించెననియు తెలిసికొనుటకు నీ విష్టపడ వచ్చును.

ఇప్పుడు మనము బుద్ధుడగు గౌతముని వద్దకు వచ్చితిమి. అతడు క్షత్రియు డనియు, రాజకుటుంబములోనివా డనియు నీకు తెలిసియే యుండవచ్చును. అతని పేరు సిద్ధార్థుడు. అతని తల్లి మాయాదేవి. "ఆమె ఉత్తమఇల్లాలు ; సర్వమాన్య ; బాలచంద్రునివలె ప్రసన్నభావము కలది ; భూదేవివలె క్షమాగుణము కలది; పద్మమువలె నిర్మల హృద యము గలది" అని ప్రాతచరిత్ర ఆమెను వర్ణించుచున్నది. సిద్ధార్థుని తల్లి దండ్రులు అతనికి సౌఖ్యమును గూర్చుచుండిరి. సర్వభోగములు అతని కందుబాటులో నుండెను. బాధ, దీనత్వము అతని దృష్టికి తగులకుండ వారు జాగ్రత్తతీసికొనిరి. కాని ఇది సాధ్యము కాలేదు. అతడు దరిద్ర మును, బాధను, చావునుకూడ చూచినట్లు చెప్పుదురు. చూచుటతోడనే ఆతని మనస్సు విషాదముతో నిండినది. రాజసౌధమున నాతనికి మన శ్శాంతి చిక్కలేదు. భోగములపై నాతనికి వైముఖ్యము కలిగెను. అతడు ప్రేమించిన భార్య, సుందరి, యౌవనమధ్యస్థకూడ ఆతని దృష్టిని బాధ పడు మానవులనుండి మరల్పలేకపోయెను. అతడు దీర్ఘాలోచన చేయ మొదలుపెట్టెను. అతడు ఈ బాధలనుండి విముక్తి కనుగొన గోరెను. ఆతడు భరించలేకపోయెను. ఒకనాటి రాత్రి అతడు రాజసౌధమును, ప్రేమాస్పదులను వీడి, ఒంటరిగా పయనమై విశాల ప్రపంచములోనికి

పోయెను. తన మనస్సునకు ఆందోళన కలిగించు సమస్యలను పరిష్క రించవలెననియే అతడు సన్యసించెను. ఇట్టి పరిష్కారము కనుగొనుట కత డెంతకాలమో శ్రమపడెను. చివరకు చాల సంవత్సరముల తరువాత, గయలో ఒక అశ్వత్థవృక్షముక్రింద కూర్చునియుండగా అతనికి జ్ఞానము కలిగినదని చెప్పుదురు. అప్పు డతడు జ్ఞానియగు బుద్ధుడయ్యెను. ఆ వృక్షమునకు బోధివృక్ష మను పేరువచ్చెను. బోధివృక్ష మనగా జ్ఞాన వృక్ష మన్నమాట. సారనాథములో డియర్ (లేళ్ళ) తోటలో పురాతన కాశీ పట్టణచ్ఛాయలో బుద్ధుడు తన బోధనలను ప్రారంభించెను. మంచిగా జీవించుటకు మార్గ మాతడు చూపెను. దేవుళ్ళ కిచ్చు బలుల నాతడు ఖండించెను. దానికి బదులు మనము క్రోధము, ద్వేషము, మత్సరము, వక్రాలోచనలు—వీనిని బలిపెట్టవలెనని బోధించెను.

బుద్ధుడు పుట్టినప్పుడు వేదమతము ఇండియాలో వ్యాపించియుం డెను. అప్పటికే అది మారి ఉన్నతస్థానమునుండి జారిపోయెను. బ్రాహ్మణ పురోహితులు వ్రతములు, పూజలు, మూఢవిశ్వాసము ప్రవేశపెట్టిరి. పూజ లధికమైనకొలది పురోహితులు బాగుపడుచుండిరి. వర్ణ ధర్మములు కాఠిన్యము వహించెను. శకునములు, వశీకరణ మంత్రములు, మంత్ర ప్రయోగములు, బూటకపు చికిత్సలు చూచి సామాన్యప్రజలు భయభ్రాంతు లగుచుండిరి. పురోహితు లీ పద్ధతుల నవలంబించి ప్రజలను తమ వశ ములో నుంచుకొని క్షత్రియ ప్రభువుల యధికారమును ధిక్కరించిరి. అందుచే క్షత్రియులకును, బ్రాహ్మణులకును స్పర్ధ ఏర్పడెను. బుద్ధుడు సంస్కర్తగా బయలుదేరి పలుకుబడి సంపాదించెను. అతడు పురోహితుల నిరంకుశత్వమును ఖండించెను. వేదమతమున ప్రవేశించిన దోషముల నన్నింటిని ఖండించెను. ప్రజలు మంచిగా జీవించవలెననియు, సత్కార్య ములు చేయుచుండవలయుననియు, పూజాదులు చేయరాదనియు అతడు నొక్కిచెప్పెను. బౌద్ధసంఘము నాత డేర్పరిచెను. బుద్ధుని బోధల ననుస రించు భిక్షువులయొక్కయు, సన్యాసినుల యొక్కయు సంఘమే యిది.

కొంతకాలమువరకు బౌద్ధమతము ఇండియాలో అంతగా వ్యాపించ లేదు. తరువాత అది యెట్లు వ్యాపించినదో, పిదప నొక ప్రత్యేకమత ముగా నుండక నామమాత్రావశిష్టమైనదో ముందు ముందు చూతము. సింహళము మొదలు చీనావరకు దూరదేశములలో అది ఉచ్ఛస్థితి నందగా జన్మదేశమగు ఇండియాలో అది బ్రాహ్మణమతమున (హిందూమతము) నంతర్భూత మయ్యెను. బ్రాహ్మణమతముపై తన ప్రభావమును చూపి మూఢవిశ్వాసమును, కర్మకాండను కొంతవరకు దానినుండి తొలగించెను.

నేడు బౌద్ధమతము ప్రపంచమం దత్యధికసంఖ్యాకులచే నవలం బించబడియున్నది. అధికసంఖ్యాకులు గల యితరమతములు క్రైస్తవ మతము, మహమ్మదీయమతము, హిందూమతము. ఇవిగాక హీబ్రూల, సిక్కుల, పారసీకుల, ఇతరుల మతములుకూడ ఉన్నవి. మతములను, వాటిని స్థాపించిన పురుషులను ప్రపంచచరిత్రలో అధికముగా పాల్గొ న్నారు. చరిత్రను తిరుగవేయునప్పుడు వారిని మనము ఏమరిచి యుండ రాదు. వారినిగురించి వ్రాయుటకు నేను సంకోచించుచున్నాను. గొప్ప మతములను స్థాపించినవారు నిస్సందేహముగా గొప్పవారును, ఉదారు లును. కాని వారి శిష్యులును, వారి తరువాత వచ్చినవారును తరుచుగా అంత గొప్పవారును కారు, మంచివారును కారు. మనలను ఉద్ధరించవలసి నట్టియు, మనలను ఉదారులుగా చేయవలసినట్టియు మతము పశుప్రాయు లుగా జనులు ప్రవర్తించునట్లు చేసినట్లు చరిత్రలో మనము చూచు చున్నాము. జ్ఞానమిచ్చుటకు బదులు జనులను అజ్ఞానాంధకారమున నుంచు టకు ప్రయత్నించెను. వారి మనస్సులను విశాలపరుచుటకు బదులు వారిని సంకుచితబుద్ధులుగను, పొరుగుపచ్చ కిట్టనివారినిగాను చేసెను. మతము పేర అనేక మహత్కార్యములు చేయబడినవి. మతము పేరటనే వేలకొద్ది, లక్షలకొద్ది జనులు హత్యచేయబడిరి. అన్నివిధములగు దుష్కృత్యము లును చేయబడినవి.

అయితే మతముతో ఒకవ్యక్తి కుండవలసిన సంబంధ మేమి? కొందరికి మతమన్న పరలోకమని యర్థము. స్వర్గమో, దివ్యలోకమో

ఏదోయొక పేరు. స్వర్గమునకు పోవలెనని వారు మత ప్రవిష్టులై కొన్ని కార్యములు చేయుదురు, జిలేబీ దొరుకునని తంటాలుపడు చిన్నపిల్ల కథ జ్ఞాపకమునకు వచ్చుచున్నది. అ స్తమానమును జిలేబీమీద బుద్ధిపెట్టుకొను చిన్నపిల్ల సరియైన శిక్షణ పొందినదని చెప్పగలవా? జిలేబీలవంటి భక్ష్యములు పొందుటకొరకే పనులుచేయు బాలబాలికల ప్రవర్తన ఆమోదింపదగినదా? వయస్సువచ్చిన పెద్దమనుష్యు లీ విధముగా ప్రవర్తించిన మన మేమనుకొనవలెను? జిలేబీకిని స్వర్గమునకును యథార్థముగా పెద్ద తేడా లేదు. మనమందరమును కొంచె మెచ్చుతగ్గుగా ఒంటెత్తుగుణము కలవారము. కాని మన పిల్లలకుమాత్రము ఒంటెత్తుగుణము అబ్బకుండ శిక్షించుటకు ప్రయత్నింతుము. ఏమైనను అన్యుల మేలు కోరుటయే మన ఆదర్శము, అట్టి ఆదర్శమును మన మాచరణలో పెట్ట ప్రయత్నించవలెను.

చేసిన పనులకు ఫలితమును పొంద మనమందరము ఆశింతుము. అది సహజమే. కాని మన లక్ష్యమేమి? మనము కోరునది స్వార్థమా, లేక సంఘక్షేమమా, దేశక్షేమమా, లోకకళ్యాణమా? ఈ క్షేమములో మనమును పాల్గొందుముకదా. నా లేఖలలో వెనుక నొక సంస్కృత శ్లోకము నుదహరించితిని. కుటుంబముకొరకు వ్యక్తియు, సంఘముకొరకు కుటుంబమును, దేశముకొరకు సంఘమును బలికావలెనని దాని తాత్పర్యము. వేరొక శ్లోకభావము నిప్పుడు చెప్పెదను. ఇది భాగవతములోనిది. "అష్టసిద్ధులను నే నాసించను, మోక్షము నాసించను, జన్మరాహిత్యము కోరను, ఆర్తుల దుఃఖములను నేను వహింతునుగాక, వారిలో ప్రవేశించి వారికి దుఃఖములు లేకుండ చేయుదును గాక."

ఒక మతస్థు డీవిధముగా చెప్పును. వేరొక మతస్థు డింకొకవిధముగా చెప్పును. ఒక డింకొకని బుద్ధిహీను డనియు, దుర్మార్గుడనియు భావించును. ఇం దెవరి మాట సత్యము? చూచుటకుగాని, ఋజువుచేయుటకుగాని సాధ్యముకాని విషయములనుగూర్చి వారు ప్రసంగింతురు కాన

ఎవరి వాదము సరియైనదో చెప్పుట కష్టము. అట్టి విషయములనుగూర్చి నిర్ధారణగా చెప్పుచు తలలు బ్రద్దలుకొట్టుకొనువారి ఉభయుల మాటలు సాహసోక్తులవలెనే తోచును. మనలో అనేకులము సంకుచిత బుద్ధులము. వివేక మంతగా కలవారము కాము. యావత్తు సత్యము మనకే తెలియు నని ఊహించి, దానిని పొరుగువానిచేత బలవంతముగా నమ్మించుట సాహసముకాదా ? మన వాదము సరికావచ్చును. మన పొరుగువాని వాదముకూడ సరికావచ్చును. చెట్టుపై నున్న పువ్వును చూచి దానినే చెట్టు అనము. ఇంకొకడు ఆకును మాత్రము చూచును. వేరొకడు ప్రకాం డమును మాత్రము చూచును. వీరందరును వృక్షభాగములను మాత్రమే చూచినారు. ఇందు ప్రతియొక్కడును చెట్టు పువ్వే అనిగాని, ఆకే అని గాని, ప్రకాండమే అనిగాని చెప్పుచు పోరాడుట తెలివితక్కువ కాదా ?

పరలోకమన్న నాకు మోజులేదు. ఇహలోకమున నేను చేయవల సిన కర్తవ్యము నా మనస్సును పూర్తిగా ఆక్రమించినది. నా కర్తవ్యము నెట్లు నెరపవలెనో నాకు తెలిసిన నేను సంతృప్తినందుదును. ఇక్కడ నేను చేయవలసినపని స్పష్టముగా తెలిసిన వేరొక ప్రపంచము జోలి నాకు లేదు.

వయస్సు వచ్చినకొద్ది నీవు అన్ని రకముల మనుష్యులను చూతువు. దైవభక్తులు, మతము నంగీకరించనివారు, ఏపక్షమునకును చెందని వారు. ధనమును, అధికారమును వహించు పెద్దదేవాలయములు, మత సంస్థలు కలవు. ఒక్కొక్కప్పుడు సత్కార్యములకు, ఒక్కొక్కప్పుడు చెడ్డకుకూడ అధికారధనములను వారు వినియోగించుచున్నారు. దైవభక్తి గల ఉదారులగు సత్పురుషులను నీవు చూతువు. మతముపేర ఇతరులను మోసగించి దోచుకొను దుర్మార్గులనుకూడ నీవు చూతువు. ఈ విషయము లను నీవు బాగుగా పర్యాలోచించి వీటి మంచిచెడ్డలు నీవు స్వతంత్రముగా నిర్ణయించుకోవలెను. పెక్కు విషయములు ఇతరులనుండి మనము నేర్చుకొనవచ్చునుకాని నేర్చుకొనదగ్గ ప్రతివిషయమును మనము అను

భవములోనికి తెచ్చుకోవలెను. కొన్ని విషయములు ప్రతిపురుషుడును, స్త్రీయు తనకుతానే నిర్ణయము చేసికోవలసి యుండును.

నిర్ణయము చేసికొనునప్పుడు తొందరపడకూడదు. విద్యాశిక్షణ లున్నగాని ఉదాత్తమగు ముఖ్యవిషయములనుగూర్చి నిర్ణయమునకు వచ్చుట కష్టము. ఎవరిమట్టుకువారు స్వతంత్రముగా ఆలోచించుకొని నిర్ణయమునకు వచ్చుట మంచిది. కాని అట్లు నిర్ణయించుకొనుటకు వారికి సామర్థ్యముండవలెను. అప్పుడు పుట్టిన శిశువు ఏవిషయమును నిర్ణయించు కొనలేదుకదా ! వయస్సు వచ్చినప్పటికిని కొందరు, మనోవికాసమును బట్టిచూడ, శిశువులవంటివారే.

ఈ దినమున మామూలుకన్న దీర్ఘముగా ఈ లేఖ వ్రాసితిని. నీకు చదువుట కుత్సాహముగా నున్నదోలేదో. కాని నేను చెప్పదలచుకొన్న విషయము చేతనైనంతమట్టుకు చెప్పితిని. ఇం దేవిషయమైన నీ కిప్పుడు అవగాహన కాకున్న ఫరవాలేదు. ముందుముందు అర్థముకాగలదు.

## 15

# పర్షియా : గ్రీసు

జనవరి 21, 1931.

ఈ దినమున నీజాబు చేరినది. అమ్మ, నీవు కులాసాగా ఉన్నా రని వినుటకు సంతోషముగా నున్నది. తాతకు జ్వరము, ఇతరబాధలు తగ్గిన బాగుండును. జీవితకాలమంతయు ఆయన ఎంతో కష్టపడి పనిచేసిరి. ఇప్పటికికూడ ఆయనకు విరామము, మనశ్శాంతి కలుగలేదు.

భాండాగారములోని పుస్తకము లెన్నో చదివినట్లును, చదువదగిన క్రొత్త పుస్తకములను చెప్పమనియు అడిగితివి. ఏ పుస్తకములు చదివి తివో నీవు నాకు వ్రాయలేదు. పుస్తకములు చదువు అలవాటు మంచిదే. వడివడిగా ఎన్నో పుస్తకములు చదువువారిని చూచిన నా కనుమానము.

వారు పుస్తకములు సరిగా చదువరనియు, కప్పగంతులు వేసికొని పోవుదురనియు, చదివినదానిని మరునాడే మరిచిపోవుదురనియు నా అనుమానము. చదువదగిన పుస్తకమైనచో దానిని శ్రద్ధగాను క్షుణ్ణము గాను చదువవలెను, కాని చాలా పుస్తకములు చదువదగినవికావు. మంచి పుస్తకముల నేరుకొనుటకూడ కష్టమే. మన భాండాగారము నుండి పుస్తకములు తీసికొన్నచో అవి మంచి పుస్తకములే యగు నని నీ వనవచ్చును. కానిచో వాని నెందుకు తెప్పించి భాండాగారములో నుంచిరి ? సరే, సరే, చదువు. నాయినీ చెరసాలనుండి నేను చేయగల సహాయమును చేయుదును. నీ మనస్సు, శరీరము ఎంత వేగముగా వృద్ధి చెందుచున్నవో అని నేను తరుచు అనుకొనుచుందును. నేను నీ వద్ద నుండిన నెంతబాగుండును ! నేను వ్రాయు జాబులు నీకు చేరులోపుగా నీవు ఇందలి విషయములకు మించిన జ్ఞానమును సంపాదించియుందువేమో. అప్పుడు * చంద్రకు ఈ జాబులను చదువు ఈడు వచ్చును. కాబట్టి ఎవరో ఒకరు చదివి విషయమును గ్రహించవచ్చును.

మరల మనము గ్రీసుకు, పర్షియాకు పోవుదము. వారి అన్యోన్య యుద్ధములను గూర్చి విచారింతము. గ్రీకుల నగర రాష్ట్రములను గూర్చియు, డరయస్ రాజు పరిపాలన క్రిందనున్న పర్షియా మహా సామ్రాజ్యమును గూర్చియు ఇదివరలో ఒకజాబులో చర్చించియుంటిమి. డరయస్ సామ్రాజ్యము వైశాల్యముననే కాదు, రాజ్యాంగ నిర్మాణము నందుకూడ చాల గొప్పది. అది ఆసియామైనరునుండి సింధునదివరకు వ్యాపించినది. ఈజిప్టు దాని యంతర్భాగమే. ఆసియామైనరులోని కొన్ని నగరరాష్ట్రములు కూడ అందులో చేరినవే. ఈ పెద్ద సామ్రాజ్యమందం తట చక్కని బాటలున్నవి. బాటలగుండ నిత్యము వేళకు చక్రవర్తి తపాలు పోవుచుండెను. ఏకారణమువల్లనో డరయస్ గ్రీకుల నగర రాష్ట్రములను జయింప నిశ్చయించెను. ఈ సంగ్రామములలో చరిత్రలో

---

* ఇందిర మేనత్తకూతురు చంద్రలేఖ పండిత్.

ప్రసిద్ధికెక్కిన యుద్ధములు కొన్ని జరిగినవి. ఈ సంగ్రామముల వృత్తాంతములు గ్రీకు చరిత్రకారుడగు హెరొడోటస్ వ్రాసెను. అతడు తాను వ్రాసిన విషయములు జరిగిన కొద్దికాలము తరువాతనే ఉండెను. అతడు గ్రీకుపక్షపాతి. కాని అతని వ్రాతలు చాల మనోహరముగా నుండును. ఈ జాబులలో క్రమేణ అతని చరిత్రనుండి కొన్ని వాక్యములను ఉదహరించు చుందును.

గ్రీకులపై పర్షియనులు చేసిన మొదటి దండయాత్ర విఫలమాయెను. ఇందుకు కారణము-పర్షియన్ సైన్యము త్రోవలో రోగములపాలాయెను. తగిన తిండి దొరకలేదు. ఆ సైన్యము గ్రీసును చేరుకోలేక వెనుకకు మరలిపోవలసివచ్చినది. క్రీ. పూ. 490 సంవత్సరమున రెండవ దండయాత్ర జరిగెను. ఈ సారి భూమార్గమును వదలి సముద్రముపై ప్రయాణముచేసి ఏథెన్సుకు సమీపమందున్న మారథాన్ అను ప్రదేశమున సేనలు దిగినవి. పర్షియాసామ్రాజ్యముయొక్క కీర్తి దివ్యముగా వెలుగుచుండినందున ఏథెన్సు ప్రజలు చాల భయపడిరి. అందువల్ల వారు తమ ప్రాతశత్రువులైన స్పార్టనులను మంచిచేసికొని తమకు ఉమ్మడిశత్రువైన పర్షియాను జయించుటకు తోడ్పాటుకోరిరి. స్పార్టను సహాయము రాకపూర్వమే ఏథెన్సుసైన్యము పర్షియనుల సైన్యము నోడించెను. ఇదియే ప్రసిద్ధమగు మారథాన్ యుద్ధము. క్రీ. పూ. 490 లో ఇది జరిగినది.

ఒక మహాసామ్రాజ్య సైన్యములను ఒక చిన్న గ్రీకునగరరాష్ట్రమోడించుట వింతగా కనిపించును. కాని కనిపించినంత వింత ఇందులో లేదు. గ్రీకులు తమ దేశమువద్ద తమ దేశముకొరకు పోరాడిరి. పర్షియనుల సేనలన్నో తమ దేశమును దాటి ఎంతోదూరము వచ్చి పోరాడినవి. పర్షియన్ సామ్రాజ్యపు అన్నిభాగములనుండి ప్రోగుచేయబడిన కలగూరగంప పర్షియనుల సేనలు. జీతములు పుచ్చుకొనుచుండుటచే వారు పోరాడిరి. గ్రీసును జయించవలె నను ఆకాంక్ష వారి కంతగా లేదు. ఏథెన్సు సేనలన్నో తమ స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకు పోరాడినవి.

స్వాతంత్ర్యమును గోల్పోవుటకన్న చావు మేలని వారెంచిరి. ఏయుద్యమముకొరకైనను ప్రాణములొడ్డువారికి అపజయ ముండదుకదా.

మారథాన్‌వద్ద డరయస్ పరాజయమందెను. తరువాత నాతడు పర్షియాలో దేహమును చాలించెను. అతనితరువాత జర్క్సస్ చక్రవర్తియయ్యెను. జర్క్సస్‌కూడ గ్రీసును జయించవలె నని ఆసించెను. ఇందుకై అత దొక దండయాత్రను సన్నద్ధముచేసెను. ఈ సందర్భమున హెరొడోటస్ చెప్పిన మనోహరమగు వృత్తాంతమును నీకు వినిపించెదను. జర్క్ససు పినతండ్రిపేరు అర్టబానస్. గ్రీసుపై దండయాత్ర సాగించిన పర్షియాసేనలకు ప్రమాదము కలుగుననీని ఆత డూహించెను. గ్రీసుపై యుద్ధము చేయవద్దని జర్క్ససు కాతడు బోధించెను. జర్క్ససు సమాధానమిట్లిచ్చెనని హెరొడోటస్ చెప్పుచున్నాడు :

"నీవు చెప్పిన మాట సబబైనదే. కాని మనము చేయు ప్రతికార్యమందును విపత్తుండునని నీ వూహించరాదు. ఆపదలను నీవు గణించరాదు. వచ్చిన ప్రతికార్యమును గూర్చియు ఇది మంచిదా, చెడ్డదా యని తర్కించుచుపోయిన నీ వేకార్యమును నెన్నటికిని చేయలేవు. ఆపదలు తటస్థించునేమో యని బెంగపెట్టుకొని కూర్చుండి, ఎట్టి కష్టములను అనుభవించక యుండుటకంటె సర్వయత్నములందును మేలునే చూచుచు తటస్థించిన కష్టముల నెదుర్కొనుట మంచిది. ఎదుటివాడు చేసిన ప్రతి ఉపపాదనను, ఆచరింపదగిన సక్రమమార్గమును చూపకుండ, నీవు ఖండించుచుపోయిన ఎదుటివానితోపాటు నీవును కష్టములపా లగుదువు. హెచ్చుతగ్గులు లేకుండ తుల నిలిచియున్నది. ఏవైపుముల్లు వంగునో సామాన్యమానవుడు నిష్కర్షగా ఎట్లు చెప్పగలడు? చెప్పలేడు. పూని పనిచేయువానికే సామాన్యముగా జయము చేకూరును. సంశయాత్ములగు భీరువులను విజయలక్ష్మి వరించదు. పర్షియా ఎంతటి గొప్ప సామ్రాజ్యమైనదో చూచితివా? సింహాసనము నధిష్ఠించిన నా పూర్వులు నీవు చేయుచున్న ఆలోచనల వంటి ఆలోచనలే చేసియుండిన పక్షమందును, లేదా వా రట్టి ఆలోచనలు చేయకున్నను నీవంటి మంత్రులు వారి కుండియుండిన పక్షమందును మన సామ్రాజ్య మింత గొప్పదగుట సంభవించదు. ఆపదలను లక్ష్యపెట్టకుండుట చేతనే మనల నింతటివారినిగా వారు చేయగలిగిరి. గొప్ప ఆపదల ద్వారానే ఘనకార్యములు నిర్వహింపబడుచుండును."

పర్షియారాజు ఎట్టివాడో పై వృత్తాంతమునుబట్టి మనము తెలిసికోవచ్చును. అందువల్లనే దీర్ఘముగా నున్నను పై వాక్యముల నెత్తి వ్రాసితిని. చివరకు అర్టబానస్ చెప్పిన ప్రకారమే జరిగినది. పర్షియనుల సైన్యము గ్రీసులో ఓడిపోయినది. జర్క్సను ఓడిపోయెను. కాని అతని మాటలు నేటికిని పరమసత్యములే. మనము నేర్చుకోవలసిన విషయము లందున్నవి. నేడు, మహత్కార్యములను సమర్థించ ప్రయత్నించుచున్న మనము జ్ఞాపకముంచుకోవలసిన విషయ మేమనగా—గమ్యస్థానమును చేరగలుగుటకు ముందు మనము గొప్ప ఆపదల నెదుర్కొనవలెను.

రాజాధిరాజైన జర్క్సను తన సైన్యమును ఆసియామైనరుగుండ తీసికొనిపోయెను. ఆ రోజులలో హెల్లస్పాంటు అని పిలువబడు డార్డినెల్సుగుండా యూరోపు ప్రవేశించెను. త్రోవలో పూర్వకాలమున గ్రీకు వీరులు హెలన్‌కొరకు పోరాడిన ట్రాయిపట్టణ శిథిలములను చక్రవర్తి దర్శించెనని చెప్పుదురు. హెల్లస్పాంటు కడ్డముగా సైన్యము దాటుటకు పెద్ద వంతెన కట్టబడెను. పర్షియను సేనలు దాటుచుండగా సమీపమందున్న కొండపై చలువరాతి సింహాసనమున కూర్చుండి జర్క్సను చూచుచుండెను.

హెరొడోటస్ చెప్పుచున్నాడు: "జర్క్సను నావలతో నిండియున్న హెల్లస్పాంటును చూచెను. తీరములన్నియును, అబిడాస్ మైదానములును సైనికులతో నిండియుండుట చూచెను. నే నెంత యదృష్టవంతుడను అని యాతడనుకొనెను. మరుక్షణముననే యతడు విలపింప దొడగెను. హెల్లాసు (గ్రీసు) మీదకు దండెత్తి పోవలదని మొదట ధైర్యముగా సలహాచెప్పిన అర్టబానసు చక్రవర్తి విలపించుట చూచి యిట్లడిగెను: "ఓ రాజా, నీ విప్పుడు చేసిన పనులు పరస్పరము ఎంత విరుద్ధముగా నున్నవి? నీ యంత యదృష్టవంతుడు లేడని చెప్పి వెంటనే కన్నీరు కార్చుచుంటివి." చక్రవర్తి చెప్పిన సమాధాన మేమనగా, "అవును. సర్వమును చూచినపిమ్మట నా మనస్సునకు తట్టి జాలి పుట్టించిన విషయ మేమనగా—మన యెదుట కనిపించు జనసమూహములో ఒక్కడును నూరు సంవత్సరములు గడచిన పిమ్మట జీవించియుండడు గదా. మానవుని జీవితపరిమాణ మెంత స్వల్పము!"

ఈ మహాసైన్యము భూమార్గమున ముందుకు కదలెను. సముద్ర మార్గమున పెక్కునావలు వారి నంటివచ్చుచుండెను. కాని సముద్రము గ్రీకులయెడ పక్షపాతము చూపెను. తుఫానులో నావలను పెక్కింటిని నాశముచేసెను. గ్రీకులు ఈ మహాసైన్యమును చూచి భయపడి, తమలో తమకుండు భేదములను మరచి, ఏకమై శత్రువు నెదుర్కొనిరి. పర్షియను సైన్యపు దాడికి గ్రీకులు వెనుకకు మరలిరి. థర్మాపిలె అను కనుమవద్ద పర్షియను సైన్యము నాపవలెనని నిర్ధారణ చేసికొనిరి. ఇది సన్నని మార్గము. ఒకతట్టు పర్వతమున్నది, రెండవతట్టు సముద్రమున్నది. ఈ ప్రదేశమున కొద్దిమంది సైనికులు పెద్ద సైన్యము నాపగలుగుదురు 300 స్పార్టనులతో లియెనిదాస్ ఈ కనుమను మరణపర్యంతము రక్షించుటకు నియమింపబడెను. మారథాన్ యుద్ధము జరిగిన పది సంవత్సరముల పిమ్మట ఆ ప్రఖ్యాతదినమున ఆ అసహాయశూరులు తమ మాతృదేశమున కమూల్యాసేవ యొనరించిరి. గ్రీకు సైన్యము మరలిపోవుచుండగా పర్షియనుల మహాసైన్యము నీ వీరులు అరికట్టిరి, ఆ ఇరుకు కనుమలో వీరునివెంబడి వీరుడు నేలకొరగెను. వీరునివెంబడి వీరుడు వారి స్థలముల నాక్రమించెను, పర్షియనుల సైన్యము ముందుకు కాలుపెట్ట లేకపోయెను. పర్షియనులు సాగిపోవుటకుముందు లియెనిదాసును, అతని సహచరులు 300 మందియు థర్మాపిలెలో వీరస్వర్గము నందిరి. క్రీ. పూ. 480 సంవత్సరమున నీ యుద్ధము జరిగెను. 2410 సంవత్సరములకు పూర్వము జరిగినప్పటికిని ఆ వీరుల అప్రతిమాన శౌర్యమును నేడు తలచుకొన్నప్పటికిని శరీరము పులకలెత్తును. నేడు సైతము థర్మాపిలెను దర్శించు బాటసారి, కన్నీరునిండిన నేత్రములతో, శిలాఫలకముపై చెక్కిన సందేశము—లియెనిదాసు యొక్కయు, అతని సహచరుల యొక్కయు సందేశము—చదువగలడు.

"పొమ్ము, స్పార్టాతోడ చెప్పుము
తెరువరీ! మా విన్నపంబును,

ఆమెయానతి తలనుదాల్చి
ఒరిగితిమి ఈ కనుమలో నని."

మృత్యువును జయించు ధైర్యము అద్భుతావహముగదా! లియొని-దాసును, థర్మాపిలెయును చిరంజీవులు. దూరదేశమగు ఇండియాలోనున్న మనము సైతము వారిని తలచుకొని పులకరించుచున్నాము. ఇక మన దేశ ప్రజలను, మన పూర్వులను, హిందూస్థానమందలి స్త్రీ పురుషులను-మన దీర్ఘ చరిత్రమార్గములలో మృత్యువును చూచి మందహాసము చేసి పరిహసించిన స్త్రీ పురుషులను - అప్రతిష్ఠ బానిసత్వములను సహింపక మృత్యువును వరించిన స్త్రీ పురుషులను - నిరంకుశత్వమునకు తలవంచక దానిని విచ్ఛిన్నముచేయ దొరకొనిన స్త్రీ పురుషులను తలచుకొనిన మన కెట్లులుండును? చిత్తూరును తలచుకొనుము. రాజపుత్ర స్త్రీ పురుషుల అప్రతిమాన శౌర్యసాహసములను వర్ణించు నిరుపమగాథలను స్మరింపుము. నేటికాలమును కూడ స్మరింపుము. మనవలెనే వెచ్చని నెత్తురు గల మన సహచరులను-ఇండియా స్వాతంత్ర్యము సాధించుటకై మృత్యుముఖమున ప్రవేశించిన సహచరులను స్మరించుము.

థర్మాపిలె కొంతకాలము మాత్రము పర్షియనుల సైన్యము నాపగలిగెను. ఎక్కువకాల మాపలేదు. గ్రీకుల సైన్యము వారిముందు నిలువజాలక వెనుదిరిగిపోయెను. కొన్ని గ్రీకు నగరములు పర్షియనుల వశమయ్యెను. శత్రువశమగుటకు సమ్మతించక, అభిమాన పూరితులగు ఏథెన్సు ప్రజలు తమ ప్రియనగరము ధ్వంసమయినను సరే యని దానిని విడిచిపెట్టిరి. ప్రజలందరును ఎక్కువగా నావలమీద నగరమును విడిచి వెళ్ళిపోయిరి. నిర్జననగరమున పర్షియనులు ప్రవేశించి దానిని దగ్ధము చేసిరి. ఏథెన్సు నౌకాదళము మాత్రము పరాజయ మందలేదు. సాలమిస్ వద్ద గొప్ప నౌకాయుద్ధము జరిగెను. పర్షియనుల నావలు నాశముచేయబడెను. ఈ విపత్తున కధైర్యముచెంది జర్‌క్సెసు పర్షియాకు తిరిగి పోయెను.

మరికొంత కాలమువరకు పర్షియా మహాసామ్రాజ్యముగానే యుండెను. కాని మారథాన్, సాలమిస్ యుద్ధములు దాని పతనమునకు దారితీసెను. అది ఎట్లు పతనమైనదో ముందు ముందు తెలిసికొందము. ఈ మహాసామ్రాజ్యము తూలిపోవుట చూచిన ఆకాలపు ప్రజలు ఎంత యాశ్చర్యము జెందిరో! హెరొడోటసు ఆ విషయము నాలోచించి యొక నీతిని వచించెను. ఆతడు చెప్పిన దేమన— జాతి చరిత్రకు మూడు దశ లుండును: విజయము; విజయమూలకముగా గర్వము, అన్యాయము; పిమ్మట పై కారణములవల్ల పతనము.

## 16

# హెల్లాసు మహత్తర ప్రతిభ

జనవరి 23, 1931

పర్షియనులమీద గ్రీకుల విజయముల ననుసరించి రెండు ఫలితములు వచ్చినవి. పర్షియన్ సామ్రాజ్యము సన్నగిలి సన్నగిలి దుర్బలమాయెను. గ్రీకుల చరిత్రమున దివ్యయుగము ప్రారంభమాయెను. ఆ జాతి జీవితములో ఆవెలుగు కొద్దికాలమే యుండెను. 200 సంవత్సరముల కాలముమాత్రమే అది నిలిచెను. పర్షియా సామ్రాజ్యము, అంతకు పూర్వమందలి యితరసామ్రాజ్యములవలె విశాలమైన సామ్రాజ్యముండుట వల్ల వచ్చిన గొప్పతనము కాదు దానిది. కొంతకాలమైనపిమ్మట ఘనుడగు అలెగ్జాండరు తలయెత్తి తన విజయములతో, కొద్దికాలము, లోకమును ఆశ్చర్యమున ముంచెను. ఇప్పు డాతనినిగురించి మనము ప్రసంగించుకొనుట లేదు. పర్షియన్ సంగ్రామములకును, అలెగ్జాండరురాకకును మధ్యనున్న కాలమునుగురించి మనము ప్రసంగించుకొనుచున్నాము —థర్మాపిలె, సాలమీస్‌యుద్ధముల తరువాత 150 సంవత్సరములకాలమది. పర్షియనుల దండయాత్రలు గ్రీసు ననేకము చేసెను. ఈ ప్రమా

దము తప్పుటతోడనే వారు మరల విడిపోయి వారిలోవారు పోరాడుకొన జొచ్చిరి. ముఖ్యముగా ఏథెన్సు నగరరాష్ట్రములును, స్పార్టాయును ప్రబలస్పర్థను పూనియుండిరి. వారి పోరాటములతో మన కిప్పుడు ప్రశంస లేదు. అవి ప్రధానము కాదు. మనము వారిని స్మరించుటకు కారణము, ఆ రోజులలో ఇతర విధములుగా గ్రీసు గొప్పతనము సంపాదించు కొన్నది.

గ్రీసుయొక్క ఆనాటి ఉచ్చదశను జ్ఞాపకముచేయు కొద్దిపుస్తక ములు, కొద్ది ప్రతిమలు, కొద్ది శిథిలములు మన కిప్పుడు గోచరమగు చున్నవి. ఈ కొద్దివస్తువులే మనచేత తలయూపించుచున్నవి. హెల్లాసు ప్రజల సర్వతోముఖచాతురి చూచి మనము ఆశ్చర్యమగ్నమానసులమగు చున్నాము. ఇంత అందమైన శిలాప్రతిమలను, భవనములను నిర్మించిన చేతుల కెంత పనితన మున్నదో, మనస్సు లెంత పరిపక్వమైనవో! ఆ రోజులలో విగ్రహాదుల చెక్కుటకు ప్రసిద్ధివహించిన శిల్పి ఫిడియాస్. ఇంకను ప్రసిద్ధు లనేకు లుండిరి. వారి నాటకములు సుఖాంతములును, దుఃఖాంతములును సర్వోత్తమము లనిపించుకొన్నవి. సోఫోక్లీసు, ఎస్కిలస్, యురిపిడీస్, అరిస్టోఫేన్సు, పిండార్, మినాండర్, సాఫో మున్నగు పేళ్లు ప్రస్తుతము నీకు నామమాత్రములే. కాని పెద్దదానివైన పిమ్మట వారి గ్రంథములను నీవు చదువగలవని ఆసింతును. చదివి గ్రీసు యొక్క మహత్తరప్రతిభ కొంత అవగతము చేసికొనగలవు.

ఏ దేశచరిత్రనైనను ఎట్లు చదువవలెనో ఈ కాలమందలి గ్రీసు చరిత్రనుబట్టి మనము గ్రహించవలెను. అల్ప సంగ్రామములమీదను, గ్రీకు రాష్ట్రములలో నున్న అల్పత్వముమీదను బుద్ధిపెట్టుకొన్నచో వారిని గురించి మన మేమి తెలిసికొనగలము? వారిని మన మవగాహనచేసికో దలచుకొన్నచో వారి తలంపులను మనము గ్రహించవలెను. వా రేమను కొనుచుండిరి, వా రెట్టి కార్యములు చేసిరి అను విషయములను మనము తెలిసికొన ప్రయత్నించవలెను. నిజముగా ప్రధానమైనది అంతరచరిత్రమే. ప్రాచీన గ్రీకు సంస్కృతికి నేటి యూరోపును వారసుగా చేసిన దిదియే.

జాతుల జీవితములలో అట్టి తేజోవంతమగు దశలు వచ్చి. పోవుట చూడ వింతగా నుండును. కొంతకాల మాదశలు సమస్తమును వికాసవంతము చేయును. ఆదేశమం దాకాలమునందున్న స్త్రీపురుషులు రమణీయమగు వస్తువులను సృష్టిచేయుదురు, ప్రజ లావేశపూరితులైరా యనిపించును. మన దేశమునందుకూడ అట్టి దశలు వచ్చినవి. మనకు తెలిసినంతమట్టుకు తొలుతటి దశ వేదములును, ఉపనిషత్తులును, ఇతర గ్రంథములును పుట్టిన కాలము. దురదృష్టవశమున ఆ ప్రాచీనకాలమును గూర్చి చెప్పు గ్రంథము లేమియు లేవు. ఎన్నో చక్కని గొప్పగ్రంథములు అంతరించియుండవచ్చును, లేదా ముందుముందు మనకు దొరకవచ్చును. ఉన్నదానినిబట్టి చూడ ప్రాచీనకాలమునాటి హిందూదేశస్థులు ఎంతటి అఖండమైన బుద్ధియు, ప్రజ్ఞయు కలవారో తెలిసికొనవచ్చును. తరువాతి కాలమునాటి హిందూదేశచరిత్రలోకూడ అట్టి తేజోవంతమగు దశ లున్నవి. యుగములలో మనము చేయుచున్న సంచారములందు వానిని మనము చూడవచ్చును.

ఈకాలమున ముఖ్యముగా ఏథెన్సు ప్రసిద్ధికివచ్చెను, దాని నాయకు డొక గొప్ప రాజకీయవేత్త. అతని పేరు పెరిక్లీసు. ముప్పది సంవత్సరముల పాటు అతడు అధికారపదవియం దుండెను. ఈకాలమున ఏథెన్సు గొప్ప నగరమైనది. చక్కని భవనములతో, గొప్ప చిత్రకారులతో, గొప్ప తత్వవేత్తలతో అది నిండియుంచెను. నేడుకూడ దానిని పెరిక్లీసుయొక్క ఏథెన్సు అందురు. పెరిక్లీసుయుగ మను నానుడికూడ కలదు.

ఈకాలమునందే ఏథెన్సులోనున్న చరిత్రకారుడగు మన హెరొడోటస్ ఏథెన్సు పొందిన యభివృద్ధినిగూర్చి తన యభిప్రాయమును చెప్పెను, నీతులు చెప్పుట అతని కిష్టము, కాన పై విషయమునుగూర్చి యాతడు నీతిని చెప్పెను. తన చరిత్రలో నాత డిట్లు వ్రాసెను:—

“ఏథెన్సు ప్రభుత్వ మతిశయించెను. స్వాతంత్ర్యము మంచిదనుట కిది నిదర్శనము. దీనిని ఋజువుచేయుటకు ప్రతిచోటను దృష్టాంతములు గలవు.

ఏథెన్సుప్రజలు నిరంకుశప్రభుత్వముక్రింద క్రుమ్గుచున్నప్పుడు యుద్ధకౌశలము వారికి పొరుగువారికన్న నధికముగా లేదు. నిరంకుశప్రభువును వారు వదల్చు కొన్న పిమ్మట యుద్ధమున పొరుగువారిని వారు మించిరి. ఒకనికి లొంగి యున్నప్పుడు వారు పురుషప్రయత్నము చేయలేదు. యజమాని కొరకు మాత్రమే వారు పనిచేయుచుండిరి. స్వాతంత్ర్యము చేజిక్కగానే ఎవరికి వారు, ఇతరుల ప్రోద్బలము లేకుండగనే తమ శక్తివంచనలేకుండ పనిచేసిరి."

ఆకాలమునాటి ప్రసిద్ధపురుషుల పేళ్లు కొన్ని పేర్కొనియుంటిని, వారందరికన్నను గొప్పవాడు—ఏకాలమునందున్నను గొప్పవా డని పించుకోదగవాడు—అయిన పురుషుని నే నింకను పేర్కొనలేదు. అతని పేరు సోక్రటీసు. అతడు తత్వవేత్త. సత్యాన్వేషణమే అతని నిరంతర కృషి. మనుష్యున కుండదగ్గది జ్ఞాన మొక్కటే యని అతని యభి ప్రాయము. క్లిష్టసమస్యల నాతడు తన మిత్రులతోను, పరిచయులతోను తరుచు చర్చించుచుండెను. చర్చల ఫలితముగా సత్యము వెల్లడియగునని అతని యాశయము. అతనికి శిష్యు లనేకులు గలరు. వారందరిలోను గొప్పవాడు ప్లేటో. ప్లేటో అనేకగ్రంథములు వ్రాసెను. అవి మనవరకు వచ్చినవి. ఈ గ్రంథములనుబట్టియే అతని గురువైన సోక్రటీసును గురించిన విషయములు పెక్కులు మనము తెలిసికోగలిగితిమి. నూతన విషయములను కనుగొనగోరువారిని చూచిన దొరతనములకు కన్ను కుట్టుట వాస్తవము. సత్యాన్వేషణ చేయుట వారికి కిట్టదు. ఏథెన్సు దొర తనము సోక్రటీసు పద్ధతుల నెష్టపడలేదు. విచారణచేసి సోక్రటీసుకు మృత్యుదండన విధించెను. ప్రజలతో చర్చలు కట్టిపెట్టి, తన పద్ధతులు మార్చుకొనుటకు సమ్మతించి అవిధముగా వాగ్దానము చేసినయెడల వదలి పెట్టుదుమని వారు చెప్పిరి. అత డట్లు చేయుటకు నిరాకరించెను. తన ధర్మమును పరిత్యజించుటకంటె విషముత్రాగుటయే సమ్మతమని చెప్పి గిన్నెలో తెచ్చిన విషమును త్రాగి యాతడు మరణించెను. మృత్యుముఖ ములో ప్రవేశించుటకు ముందు తనపై నేరము మోపినవారిని, తీర్పు చెప్పినవారిని ఉద్దేశించి అత డిట్లు చెప్పెను:—

"నా సత్యాన్వేషణమును పరిత్యజించిన నన్ను మీరు వదలిపెట్టెద రని మీ రనినదానికి నేను చెప్పు సమాధాన మిది: ఏథెన్సుప్రజలారా! మీకు నమస్కారము. ఈ కార్యమునందు నన్ను భగవంతుడు నియోగించెనని నా నమ్మకము. కాబట్టి అతని యాదేశముప్రకారమే చేయుదును. మీ మాటలు లెక్కపెట్టను. కంఠములో ఊపిరి, శరీరమున బలము ఉన్నంతకాలము తత్త్వ జిజ్ఞాస మానను. నే నెవరిని కలిసికొన్నను వారిని కుశలమడిగి వారితో నిట్లు చెప్పుదును: "ధనముకొరకును, గౌరవములకొరకును మీరు ప్రాకులాడు చున్నారు. సత్యవివేకములపై మీకు శ్రద్ధ లేదు. ఆత్మను వికసింపజేసి కొనవలె నను శ్రద్ధ మీకు లేదు. ఇందుకై మీరు సిగ్గుపడవద్దా? మృత్యువన్న నేమో నాకు తెలియదు. అది మంచిది కావచ్చును. మృత్యువన్న నాకు భయము లేదు. కాని నేను నమ్మిన ధర్మమును నేను పరిత్యజించుట చెడ్డపని అని నాకు తెలియును. చెడ్డదని తెలిసిన పనిని నేను చెయ్యను. మంచిది కావచ్చు నన్నదానినే కోరుదును."

బ్రదికియుండి సోక్రటీసు సత్యజ్ఞానములకొరకై చక్కగా పాటు పడెను. మరణించుటవల్ల అంతకన్న అతిశయముగా వాటికి సేవచేసిన ట్లయినది.

ఈ రోజులలో అనేకసమస్యలనుగూర్చిన చర్చలు, వాదములు నీవు వినుచుందువు, చదువుచుందువు—సాంఘికవాదమును, ధనికపక్ష వాదమును, ఇతర వాదములను గూర్చిన చర్చలు, వాదములు. ఈప్రపంచ మున బాధలు, అన్యాయము అధికముగా నున్నవి. పలువురు కిందటి పరి స్థితులు అసంతృప్తికరముగా నున్నవి. వాటిని మార్చవలెనని వారు పూనుకొనిరి. ప్రభుత్వమునకు సంబంధించిన సమస్యలను ప్లేటోకూడ ఆలోచించెను. దీనిని బట్టి చూడ ఆరోజులలోసైతము అందరును సుఖ ముగా జీవించగలుగుటకు దేశప్రభుత్వమునకును, సంఘమునకును ఎట్టి రూపము నీయవలెనో ప్రజ లాలోచించుచుండిరని తెలియుచున్నది.

ప్లేటో వార్ధక్యదశ నందుచుండగా వేరొక ప్రసిద్ధ గ్రీకుపురుషుడు రంగమునకు దిగుచుండెను. అతని పేరు అరిష్టాటిల్. ఘనుడగు అలె

గ్జాండరు కతడు ఇంటివద్ద పాఠములుచెప్పు ఉపాధ్యాయుడు. అలెగ్జాండరతని కార్యమునకు చాల తోడ్పడెను. సోక్రటీసువలెను, ప్లేటోవలెను అతడు తత్వశాస్త్ర సమస్యలనుగూర్చి విచారణపెట్టుకొనలేదు. ప్రకృతిలోని పదార్థములను పరిశీలించిచూచుట యన్నను, ప్రకృతి వైఖరుల నర్థము చేసికొనుటయన్నను అతని కిష్టము. దీనినే ప్రకృతి తత్వశాస్త్ర మందురు. ఇప్పుడు భౌతికశాస్త్ర మనుచున్నారు. కాబట్టి అరిస్టాటిల్ తొలినాటి శాస్త్రజ్ఞులలో ఒక్కడు.

ఇప్పుడు మనము అరిస్టాటిల్ శిష్యుడైన అలెగ్జాండరువద్దకు పోయి వేగముగా గడిచిపోయిన అతని జీవితచర్యను గమనింతము. ఆపని రేపు. ఈరోజుకు కావలసినంత అప్పుడే వ్రాసితిని.

ఈరోజు వసంతపంచమి. వసంతాగమము సూచించుచున్నది. అల్పకాలమే నిలిచిన హేమంతము గడచినది. గాలికి చురుకు తగ్గినది. పక్షులు క్రమక్రమముగా మావద్దకు వచ్చుచున్నవి. వాటి పాటలతో పగటిభాగము నంతయు నింపుచున్నవి. 15 సంవత్సరములకు పూర్వము, ఈదినమున, ఢిల్లీనగరములో మీ అమ్మకును నాకును పాణిగ్రహణము జరిగినది !

## 17

# ప్రసిద్ధవిజేత, కాని దురహంకార పూరితుడగు యువకుడు

జనవరి 24, 1931

వెనుకటి జాబులోను, అంతకుముందు వ్రాసిన జాబులలోను ఘనుడగు అలెగ్జాండరుపేరెత్తినాను. అతనిని గ్రీకు అన్నాను. అట్లనుట సరికాదు. అతడు నిజముగా మాసిదోనియను—అనగా గ్రీసుకు ఉత్తరమున్నున్న దేశమునుండి వచ్చినవాడు. అనేకవిషయములలో మాసి

డోనియనులు గ్రీకులను పోలియుండిరి. వారిని వారి జ్ఞాతులని చెప్ప వచ్చును. అలెగ్జాండరుతండ్రి ఫిలిప్పు మాసిడోనియారాజు. అతడు సమర్థుడగు పరిపాలకుడు. తన చిన్న రాజ్యము నాతడు బలపరిచి సమర్థమగు సైన్యమును కూర్చెను. అలెగ్జాండరును "ఘనుడు" అందురు. చరిత్రలో నాతడు మిక్కిలి ప్రసిద్ధుడు. ముందుగా తండ్రి శ్రద్ధతో చేసిన పనివల్లనే అతడు అనేకకార్యములు చేయుటకు సాధ్యపడినది. నిజముగా అలెగ్జాండరు గొప్పవాడో, కాడో అన్నవిషయము సందేహాస్పదము. నేనాతనిని వీరునిగా తలంచను. జీవించినది కొద్దికాలమే యైనను అతడు తన పేరు రెండు ఖండములలో వ్యాపింపజేయగలిగెను. ప్రపంచవిజేతలలో ప్రథముడని చరిత్రలో చెప్పుట కలదు. మధ్య ఆసియానడిబొడ్డున సికంద రను పేరుతో అతనిని నేటికిని స్మరించుచుందురు. నిజమున కాతడెట్టివాడైనను, చరిత్రమాత్రము అతని నామమున కొకవిధమగు ఇంద్రజాలశక్తిని ఆపాదించినది. అనేకనగరముల కాతని పేరు పెట్టబడెను. అవి నేటికిని నిలిచియున్నవి. అందు మిక్కిలి గొప్పనగరము ఈజిప్టులోని అలెగ్జాండ్రియా.

రాజగునాటికి అలెగ్జాండరువయస్సు ఇరువది సంవత్సరములు మాత్రమే. గొప్పతనమును సాధించవలె నను ఆకాంక్షతో అతడు తన కూర్చిన శ్రేష్ఠమగు సైన్యమును తీసికొని, తన ప్రాంతశత్రువగు పర్షియా మీదికి దండయాత్ర సాగింప ఉవ్విళ్లూరుచుండెను. అతని తండ్రి ఫిలిప్పు అన్నను, అతడన్నను గ్రీకులకు ఇష్టము లేదు. కాని వారి బలము చూచి కొద్దిగా భయపడిరి. కాబట్టి వారు ఒకనితిరువాత నొకనిని. పర్షియాకు దండెత్తిపోవు గ్రీకుసైన్యములకు కెప్టెను - జనరల్‌గా అంగీకరించిరి. ఈవిధముగా క్రొత్తగా తలయెత్తుచున్న ఒక గొప్పజాతికి వారు తల యొగ్గిరి. థీబ్సు అను పేరు గల ఒక గ్రీకునగరముమాత్రము అతనిపై తిరుగబడెను. దాని నాతడు క్రౌర్యముతో తీవ్రముగా దండించెను. అతడీ ప్రసిద్ధనగరమును విధ్వంసముచేసెను. అనేక నగరవాసులను హత

మొనర్చెను. వేలకొద్ది నగరవాసులను బానిసలుగా అమ్మివేసెను. ఇట్టి కిరాతచర్యలు గ్రీకులను భీతావహులను చేసెను. ఇట్టి అనాగరికచర్యలు చూచి మన మతనిని మెచ్చుకోలేము. ఇట్టి చర్యలు మన మసహ్యించు కొందుము. అట్టివానికి మనము దూరముగా నుందుము.

అప్పుడు పర్షియారాజుపాలనలో నున్న ఈజిప్టు సులభముగా అలెగ్జాండరు వశమయ్యెను. జర్క్సెసు తరువాత రాజైన డరయస్ III ను అప్పటికే అలెగ్జాండ రోడించెను. తరువాత ఇంకొకమారు అతడు మరల పర్షియాకు పోయి డరయస్‌ను రెండవమా రోడించెను. "రాజాధిరాజు" అగు డరయసు కాపురముండు దివ్యమగు రాజభవనమును అలెగ్జాండరు నాశముచేసెను. జర్క్సెసు ఏథెన్సును తగులబెట్టినందుకు కసితీర్చుకొనుటకై అట్లు చేసితి నని అలెగ్జాండరు చెప్పెను.

వేయిసంవత్సరముల క్రితము ఫిర్‌దౌసీ అను కవి పరిషియన్ భాషలో రచించిన ప్రాచీనగ్రంథ మొకటి గలదు. అగ్రంథముపేరు "షానామా." పర్షియారాజుల చరిత్ర లందుండును. డరయస్ అలెగ్జాండరుల మధ్య జరిగిన యుద్ధముల నీగ్రంథము ఊహాకల్పనలతో వర్ణించెను. ఓడిపోవుటతోడనే డరయస్ ఇండియాసహాయము కోరినట్లు అందు చెప్పబడినది. "వాయువేగముతో నత డొక లొట్టియను" ఇండియా వాయవ్యదిశలో రాజుగానున్న ఫూర్ (పోరసు)కడకు పంపెను. కాని పోరసు అతని కెట్టి సహాయమును చేయలేకపోయెను. త్వరలోనే అతడు కూడ అలెగ్జాండరుదాడి ఎదుర్కొ వలసివచ్చెను. ఫిర్దౌసీ వ్రాసిన షానామా అను గ్రంథములో అనేక స్థలములందు ఇండియాలో తయారైన కత్తులు, బాకులు పరిషియాదేశపు రాజులు, ప్రభువులు వాడుచున్నట్లు వ్రాయబడినది. ఆ వ్రాతలు చదువుటకు సరదాగా ఉన్నవి. అలెగ్జాండరు కాలములో సైతము ఇండియాలో మంచి ఉక్కుతో కత్తులు తయారు చేయుచుండిరని దీనినిబట్టి మనము తెలిసికొనవచ్చును. పరదేశములలోని ప్రజలు వాటిని అప్యాయముగా వాడుచుండిరి.

పర్షియానుండి అలెగ్జాండరు తన పర్యటనము సాగించెను. నేడు హీరటు, కాబూలు, సమరఖండము ఉండు దేశముగుండా అతడు ప్రయాణమైవెళ్లి సింధునదియొక్క ఎగువలోయలను చేరుకొనెను. ఇక్కడ మొట్టమొదటి హిందూదేశరాజును అతడు కలిసికొనెను. అతడు అలెగ్జాండరు నెదిరించెను. గ్రీకుచరిత్రకారు లతనిని గ్రీకు సంప్రదాయానుసారము పోరసు అనిరి. అతని అసలుపేరు పోరసును పోలినదే అయియుండవచ్చును. కాని మన కది తెలియదు. పోరసు ధైర్యముగా పోరాడెననియు, అతనిని అలెగ్జాండరు సులభముగా జయించలేకపోయెననియు చెప్పుదురు. పోరసు అమిత పరాక్రమశాలి; దీర్ఘకాయుడు. అతని ధైర్యసాహసములకు మెచ్చి అలెగ్జాండరు అతనిని ఓడించినప్పటికిని కూడ తన రాజ్యమున కాతనిని తన ప్రతినిధిగా ఏర్పరచెను. రాజుగానున్న పోరసు నేడు గ్రీకుల 'సాత్రాపు'. అనగా గ్రీకుల తరఫున పాలకుడయ్యెను.

వాయవ్యదిశనున్న ఖైబరుకనుమగుండా, రావల్పిండికి కొంచెముత్తరములోనున్న తక్షశిలమీదుగా అలెగ్జాండరు ఇండియాలో ప్రవేశించెను. నేడుసైతము ప్రాచీననగరమగు తక్షశిలాశిథిలములను మనము చూడవచ్చును. పోరసును ఓడించి అలెగ్జాండరు దక్షిణముగా గంగవైపునకు వెళ్ళదలచెను. కాని అత డట్లు చేయలేదు. సింధునదీ లోయననుసరించి యాతడు తిరిగి వెళ్లిపోయెను. అలెగ్జాండరు హిందూస్థానహృదయమనదగు గంగాప్రాంతమునకు వచ్చియుండినచో ఏమి జరిగెడిదో! అక్కడకూడ అతడు విజయము సాధించియుండునా? లేక హిందూదేశసైన్యములే అతనిని ఓడించియుండునా? పొలిమేరలో నుండు పోరసురాజు అతనిని మూడుచెరువుల నీళ్లు త్రాగించెను. మధ్యహిందూస్థానమందలి పెద్దరాజ్యములు అతని పురోగమనము నరికట్ట సమర్థములయియుండియుండును. అలెగ్జాండరు ఇష్టానిష్టములెట్లున్నను అతని సైనికులే ముందుకార్యమును నిర్ణయించిరి. చాల సంవత్సరములు దేశా

టనము చేసియుండుటచే వా రలసిపోయిరి. బహుశా భారతసైనికులు పోరాటపై ఖరి చవిచూచియుండుటచే, వారు పరాజయము వచ్చునేమోయని జంకియుందురు. కారణ మేదైనను తిరిగి వెళ్లుటకే సైన్యము నిశ్చయించి పట్టుబట్టినది. అలెగ్జాండరు ఒప్పుకొనక తప్పినదికాదు. తిరుగు ప్రయాణముమాత్రము విపత్కరమై పరిణమించెను. తిండిలేక, నీళ్లులేక సైనికు లల్లాడిపోయిరి. వెంటనే కొద్దికాలములో క్రీ. పూ. 323 సంవత్సరమున అలెగ్జాండరు బాబిలన్‌వద్ద దేహము చాలించెను. పర్షియా దండయాత్రకు బయలుదేరినపిమ్మట తన మాతృదేశమగు మాసిడోనియా మరల సందర్శించలేదు.

ముప్పదిమూడవయేట అలెగ్జాండ రావిధముగా మృతినొందెను. తన కొద్ది జీవితములో ఈ 'మహా'పురుషు డేమి చేసినట్లు? కొన్ని యుద్ధములందు అతడు చక్కని విజయములను సాధించెను. అతడు సేనానాయకు డనుటకు సందేహము లేదు. కాని అతడు గర్వి, దురహంకార పూరితుడు. ఒక్కొక్కప్పుడు క్రూరముగా, దౌర్జన్యముతో ప్రవర్తించెను. దైవసముడుగా తన్ను అత డెంచుకొనెను. కోపావేశము కలిగినప్పుడు అతడు తన ప్రియమిత్రులను పెక్కండ్రను చంపెను. నగరములను నగరవాసులతోకూడ నాశనముచేసెను. అతడు నిర్మించిన సామ్రాజ్యములో చెప్పుకోదగిన దేదియు అతడు పోయినవెనుక నిలిచియుండలేదు. సరియైన రోడ్లు సైతము వేయించలేదు. ఆకాశమునుండి జారు ఉల్కవలె అతడు వచ్చెను. అతడు వెళ్లెను. అతడు మిగిల్చిన దేదియు లేదు. స్మృతిమాత్రము మిగిలెను. అతని మరణానంతరము అతని కుటుంబీకులు ఒకరినొకరు చంపుకొనిరి. అతని మహాసామ్రాజ్యము శకలములై క్షీణించెను. అతనిని ప్రపంచవిజేత యందురు. తనకు జయించుటకు ఇక దేశములు లేవే యని అత డొకమారు కూర్చుండి విలపించెనట! కాని వాయవ్యదిశయందలి చిన్నభాగమును మినహాయించి నచో ఇండియా నాతడు జయించలేదు. ఆకాలమున సైతము చీనా గొప్ప రాజ్యము. అలెగ్జాండరు చీనాదిక్కుకైనను పోలేదు.

అతడు మరణించినతోడనే అతని సేనానులు అతని సామ్రాజ్యమును పంచుకొన్నారు. ఈజిప్టు టోలెమి వశమైనది. అత డక్కడ శక్తివంతమగు దొరతనము నేర్పాటుచేసి పరంపరగా రాజవంశమువా రేలుట కేర్పాట్లుచేసెను. అలెగ్జాండ్రియా ముఖ్యపట్టణముగా నతడు పరిపాలించిన ఈజిప్టు ప్రబలరాజ్యమైనది. విజ్ఞానశాస్త్రమునకును, తత్వశాస్త్రమునకును, పాండిత్యమునకును ఆ మహానగరము ప్రసిద్ధికెక్కెను.

పర్షియా, మెసపొటేమియా, ఆసియామైనరులో భాగము వేరొక సేనానివశమైనవి. అతని పేరు సెల్యూకసు. అలెగ్జాండరు జయించిన ఇండియా వాయవ్యప్రాంతముకూడ అతని వశమయ్యెను. కాని ఇండియాలో ఏ భాగమును అతడు నిలుపుకోలేకపోయెను. అలెగ్జాండరు మరణానంతరము గ్రీకుసైన్యము ఆ ప్రాంతమునుండి తరుమగొట్టబడెను.

అలెగ్జాండరు ఇండియాకు క్రీ. పూ. 326 సంవత్సరములో వచ్చెను. అతని రాక ఒక చిన్న దాడిమాత్రమే. దానివల్ల ఇండియాకెట్టి లాభముగాని, నష్టముగాని కలుగలేదు. ఇండియా దేశస్థులకును, గ్రీకులకును ఈ దాడివల్ల సంబంధ మేర్పడినదని కొంద రందురు. కాని, నిజమునకు అలెగ్జాండరుకాలమునకు పూర్వముసైతము ప్రాక్పశ్చిమములకు రహదారీ యుండెను. పర్షియాతోను, గ్రీసుతో సైతము ఇండియా నిరంతర సంబంధము కలిగియేయుండెను. అలెగ్జాండరురాకవలన ఆ సంబంధము మరింత వృద్ధియైయుండును. ఇండియా, గ్రీసు విజ్ఞానములు అధికముగా సమ్మిశ్రితములై యుండును.

అలెగ్జాండరుదాడియు, అతని మృతియు ఇండియాలో ఒక గొప్ప సామ్రాజ్యమును-మౌర్యసామ్రాజ్యమును స్థాపించుటకు దారితీసెను. హిందూదేశ చరిత్రలో ఇదియొక గొప్పయుగము. కాన దానిని గురించి తెలిసికొనుటకు కొంతకాలము వినియోగింతము.

## 18

# చంద్రగుప్తమౌర్యుడు : అర్థశాస్త్రము

జనవరి 25, 1931

నే నొక ఉత్తరములో మగధపే రెత్తితిని. ఇది యొక ప్రాచీన రాజ్యము. ఇప్పుడు బీహారున్నచోట అది యుండెడిది. ఈరాజ్యమునకు రాజధాని పాటలీపుత్రము. దీనినే ఇప్పుడు పాట్నా అందురు. మనము పరిశీలించుచున్న కాలమున నందవంశమునకు జెందిన రాజులు మగధను పాలించుచుండిరి. అలెగ్జాండరు ఇండియావాయవ్యప్రాంతముపై దాడి చేసినప్పుడు నందరా జొకడు పాటలీపుత్రమునందుండెను. బహుశా రాజునకు బంధువగు యువకుడొక్కడు—చంద్రగుప్త డనువా డచ్చట నుండెను. చంద్రగుప్తుడు మిక్కిలి తెలివైనవాడును, సమర్థుడును, అత్యాశ కలవాడును అయియుండునని తోచుచున్నది. నందరాజున కాతనిపై ఇష్టము లేకపోవుటచేతనో, అతడు చేసిన పనిని సమ్మతించకపోవుట చేతనో అతనిని తన దేశమునుండి బహిష్కరించెను. చంద్రగుప్తుడు ఉత్తరముగా తక్షశిలకు పోయెను. అలెగ్జాండరునుగురించి, గ్రీకులను గురించి చెప్పుకొనుచున్న కథలు బహుశా అతనిచెవిని బడినవికాబోలు. అతనితో మిక్కిలి సమర్థుడగు బ్రాహ్మణు డొక డుండెను. అతని పేరు విష్ణుగుప్తుడు. అతనిని చాణక్యు డనికూడ అందురు. చంద్రగుప్తుడును, చాణక్యుడును ఏమి సంభవించినను విధికి తలయొగ్గి సంచరించు సాధుశీలురు కారు. ఉన్నతస్థితికి వచ్చుటకై వా రెన్నో గొప్పయోచనలు చేయుచుండిరి. వానిని ఆచరణలో పెట్టి విజయము నందగోరుచుండిరి. అలెగ్జాండరుప్రతిభకు బహుశా చంద్రగుప్తుడు విమోహితుడై, అతని అడుగులలో నడువగోరియుండును. తన కార్యములందు తోడ్పడుటకు చాణక్యు డుండెను. అతడు అసాధారణప్రజ్ఞాశాలి, కూరిమిచెలికాడు,

మంత్రిసత్తముడు. ఇద్దరును జాగరూకులై తక్షశిలలో జరుగుచున్న ప్రతివిషయమును శ్రద్ధతో గమనించుచుండిరి. తరుణమునకు వేచి యుండిరి.

అవకాశముకూడ వారికి త్వరలోనే వచ్చెను. అలెగ్జాండరుమరణ వార్త తక్షశిల చేరుటతోడనే కార్యసన్నద్ధు డగుటకు తరుణము వచ్చిన దని యాతడు గ్రహించెను. అచ్చటి ప్రజల నాతడు ప్రబోధించి వారి సహాయముతో అలెగ్జాండరచ్చట నిలిపిన సేనలపై బడి వారిని తరిమి వేసెను. తక్షశిలను స్వాధీనముచేసికొని, చంద్రగుప్తుడు మిత్రరాజులతో కదలి దక్షిణముగా పాటలీపుత్రముమీదకు వెళ్లి నందరాజు నోడించెను. ఇది క్రీ. పూ. 321 సంవత్సరమున, అలెగ్జాండరు మరణించి సరిగా అయిదుసంవత్సరము లైనపిమ్మట సంభవించెను. ఈ సంవత్సరము నుండి మౌర్యవంశపరిపాలనము ప్రారంభమయ్యెను. చంద్రగుప్తుని మౌర్యు డనుటకు కారణము స్పష్టముగా తెలియదు. తల్లిపేరు ముర కాబట్టి మౌర్యు డయ్యెనని కొంద రందురు. అతని మాతామహుడు రాజు గారి మయూరపాలకు డనియు, అందుచే నతనికి మౌర్యుడని పేరు వచ్చిన దనియు మరికొంద రందురు. ఆపేరు ఎట్లు వచ్చినను ఆతనికి మాత్రము చంద్రగుప్తమౌర్యు డను పేరు వచ్చినది. వేరొక చంద్ర గుప్తుడు అను మహారాజు కొన్నివందల సంవత్సరములతరువాత ఇండి యాలో నుండెను. వీరిద్దరికిని భేదము తెలియుటకై అతనికి చంద్రగుప్త మౌర్యు డను పేరు నిలిచియుండును.

భారతదేశము నేకచ్ఛత్రాధిపత్యముగా నేలిన చక్రవర్తుల పేళ్ళను మహాభారతము, ప్రాచీనగ్రంథములు, ప్రాచీనగాథలు పేర్కొనుచుండును. ఆ కాలమునుగురించి మనకు స్పష్టముగా తెలియదు. భారతవర్షము యొక్క విస్తీర్ణమెంతో కూడ చెప్పలేము. ప్రాచీన రాజుల పౌరుషము నతిశయోక్తులతో పైగాథలు వర్ణించియుండవచ్చును. అది ఎట్లున్నను ప్రబలమై నలుగడల విస్తరిల్లిన మొదటి సామ్రాజ్యము హిందూదేశమున

చంద్రగుప్తమౌర్యుని సామ్రాజ్యమే యని చరిత్ర మనకు చెప్పుచున్నది. ఇది మిక్కిలి యభివృద్ధిజెంది శక్తివంతమైయుండెనని ముందుముందు తెలిసికొందము. అట్టి రాజ్యమును, దొరతనమును తటాలున తలయెత్తె నని చెప్పుట అసంభవముకదా! చిరకాలమునుండియు తదనుగుణముగా ఎన్నో కార్యములు జరిగియుండవలెను—చిన్న రాజ్యములు కలిసిపోవుట, రాజనీతి వృద్ధియగుట మున్నగునవి.

చంద్రగుప్తుడు రాజ్యముచేయుచున్నకాలమున, ఆసియామైనరు నుండి ఇండియావరకు నున్న దేశమునకు వారసు అయిన అలెగ్జాండరు సేనాని సెల్యూకసు, సైన్యముతో సింధునదిని దాటి ఇండియాపై దండ యాత్ర చేసెను. తొందరపడి తాను చేసినపనికి అతడు వెంటనే పశ్చా త్తాపము నందెను. చంద్రగుప్తు డాతనిని పూర్తిగా ఓడించుటచే అతడు వచ్చిన దారినే వెళ్లెను. అత డేమియు సంపాదించలేదు, సరిగదా, కాబూలు హీరటువరకు నున్న గాంధారదేశమును, అనగా నేటి ఆఫ్ఘనిస్థానమును చంద్రగుప్తుని వశము చేసెను. చంద్రగుప్తుడు సెల్యూకసుకుమార్తెను కూడ వివాహమాడెను. ఉత్తర హిందూస్థానమంతయును, ఆఫ్ఘనిస్థాన ములో కొంతభాగమును, కాబూలుమొదలు బెంగాలు వరకును, అరేబియా సముద్రముమొదలు బంగాళాఖాతము వరకును అతని సామ్రాజ్య మిప్పుడు విస్తరించియుండెను. దక్షిణ హిందూస్థానము మాత్ర మాతని పరిపాల నలో లేదు. ఈ మహాసామ్రాజ్యమునకు రాజధాని పాటలీపుత్రము.

చంద్రగుప్తుని యాస్థానమున రాయబారిగా నుండుటకై సెల్యూ కసు మెగాస్తనీసును పంపెను. మెగాస్తనీసు ఆకాలపు వృత్తాంతమును మనోహరముగా వ్రాసియుంచెను. కాని అంతకన్న మనోహరమగు వేరొక వృత్తాంతము కలదు. చంద్రగుప్తుని పరిపాలనకు సంబంధించిన వివరము లందు కలవు. ఇది కౌటిల్యుని అర్థశాస్త్రము. కౌటిల్యుడే మన చాణక్యుడు, లేదా విష్ణుగుప్తుడు. అర్థశాస్త్ర మనగా "అర్థము (ధనము) నకు సంబంధించిన శాస్త్రము."

అర్థశాస్త్ర గ్రంథమున అనేక విషయములు కలవు. వివిధ విషయములను అది చర్చించును. దానిని గురించి అధికముగా నీకు చెప్పుటకు సాధ్యముకాదు. రాజుధర్మములు, మంత్రుల ధర్మములు, సభాసమావేశములు, ప్రభుత్వశాఖలు, వర్తకము, వాణిజ్యము, పట్టణ పరిపాలనము, గ్రామపరిపాలనము, ధర్మశాస్త్రము, న్యాయవిచారణ స్థానములు, సాంఘికాచారములు, స్త్రీల హక్కులు, వృద్ధులను అనాథులను పోషించుట, వివాహము, విడాకులు, పన్నులువేయుట వసూలుచేయుట, భటసైన్యము, నౌకాసైన్యము, యుద్ధము, శాంతి, రాజనీతి, వ్యవసాయము, నూలు వడకుట, బట్టలునేయుట, శిల్పులు, నిరాటంకముగా సంచరించుట కధికార పత్రములు, జైళ్లు సైతమందు వర్ణింపబడినవి. ఈ పట్టికలో ఇంకను ఎన్నోవిషయములు చేర్చుకొనుచు పోగలనుకాని ఈ ఉత్తరమంతయు కౌటిల్య గ్రంథమందలి ప్రకరణ శీర్షికలతో నింపుట కిష్టము లేదు.

రాజుగా నుండుటకు ప్రజల యనుమతిని పొంది పట్టాభిషేక సమయమున, ప్రజాసేవ చేయుటకు సమ్మతించుచు రాజొక ప్రతిజ్ఞ తీసికోవలెను. ఆ ప్రతిజ్ఞ స్వరూప మిది—"నేను మిమ్ము హింసించిన నాకు స్వర్గము దూరమగుగాక. ప్రాణములు దేహమును వదలిపోవునుగాక, నాకు సంతానము లేకుండపోవుగాక". రాజుదినచర్య అందు వర్ణింపబడినది. జరూరుగా చేయవలసిన పని కాల దెప్పుడును సిద్ధముగా నుండవలెను. ఎందుకననగా ప్రజాహిత కార్యములు పాడైపోవుటకు వీలు లేదు. రాజుగారి ఇష్టమునకై వేచియుండుటయును పనికిరాదు. "రాజు సమర్థుడైన ప్రజలును అంత సమర్థులగుదురు." "ప్రజల సౌఖ్యముపై అతని సౌఖ్యము ఆధారపడియుండును. వారి క్షేమమును కోరి, తన కిష్టమైన విషయములు మంచివి కావనియు, ప్రజల కిష్టమైన విషయములే మంచివనియు అతడెంచవలెను" మన ప్రపంచమునుండి రాజులు అదృశ్యులగుచున్నారు. నేడు కొద్దిమందిమాత్రమే మిగిలియున్నారు. వారు

కూడ త్వరలో నిష్క్రమింతురు. ప్రాచీన హిందూస్థానమున రాజరిక మనగా ప్రజాసేవ యను విషయము గమనింపదగినది. రాజులకు భగవంతు డిచ్చిన హక్కులు లేవు. నిరంకుశాధికారము లేదు. రాజు దుర్మార్గుడైన, వానిని తొలగించి వేరొకనిని రాజుగా జేయ ప్రజలకు హక్కు కలదు. ఇది ఆకాలపు అభిప్రాయము, ఆకాలపు సిద్ధాంతము. నిజమే, పలువురు రాజులు ఈ యాదర్శము నందలేక తమ యవివేకము కారణముగా దేశమును, ప్రజలను కష్టములపాలు చేసిరి.

"ఆర్యు డెన్నటికిని బానిస కాకూడదు" అన్న ప్రాతసిద్ధాంతమును కూడ అర్థశాస్త్రము నొక్కిచెప్పినది. ఆ కాలములో పరదేశమునుండి తేబడినవారో, దేశములోనివారో ఒక విధమగు బానిస లుండియుందురు. ఆర్యుల విషయములో మాత్రము వా రెన్నడును బానిసలు కాకుండ జాగ్రత్తతీసికొనుచుండిరి.

మౌర్యసామ్రాజ్య రాజధాని పాటలీపుత్రము. అది దివ్యమైన నగరము. గంగానది పొడవునను అది వ్యాపించియుండెను. గంగా నదికిని, నగరమునకును మధ్య 9 మైళ్ళ భూమి నగరము పొడవునను ఉండెను. దానికి సింహద్వారములు అరువది నాలుగు. చిన్నద్వారములు వందలకొద్ది ఉండెను. ఇండ్లు ముఖ్యముగా కలపతో నిర్మించుచుండిరి. అగ్నిభయ ముండునుగాన, ప్రమాదము సంభవించకుండ ముందు జాగ్రత్తలు ఎంతో శ్రద్ధతో తీసికొనిరి. ప్రధాన వీథులందు వేలకొద్ది పాత్రలనిండ నీరు పోసియుంచెడివారు. అగ్నిప్రమాదము సంభవించి నప్పుడు ఆర్పుటకై ప్రతి గృహయజమానియు నీళ్లనింపిన పాత్రలను, నిచ్చెనలను, కొక్కీలు మొదలైన అవసరమగు వస్తువులను సిద్ధముగా పెట్టుకొని యుండవలెను.

నగరముల నుద్దేశించి కౌటిల్యుడు వ్రాసిపెట్టిన నిబంధన యొకటి విన సొంపుగా నుండును. వీథులలో ఎవ్వరైనను మురికివేసిన వారికి జుల్మానా వేయుచుండిరి. వీథులలో నీరు నిలుచునట్లుగాని. బాడి ప్రోగు

పడునట్లుగాని చేయువానికి జరిమానా విధించుచుండిరి. ఈ నిబంధనలు ఆచరణలో పెట్టియుండినట్లయిన పాటలీపుత్రమును, మిగిలిన నగరములును చక్కగా, పరిశుభ్రముగా, ఆరోగ్యవంతముగా ఉండెడి వనియే చెప్పవలెను. మన పురపాలకసంఘము లిట్టి నిబంధనలు అమలు జరిపిన ఎంత బాగుండునో!

పాటలీపుత్రమునకు సొంత వ్యవహారములు దిద్దుకొనుటకై ఒక పురపాలకసంఘ ముండెను. ఇందలి సభ్యులను ప్రజ లెన్నుకొనుచుండిరి. సభ్యుల సంఖ్య ముప్పది. అం దారు ప్రత్యేకసభలు (కమిటీలు) ఉండెను. ఒక్కొక్కదాని కయిదుగురు చొప్పున ఈ సభ్యు లందుండిరి. నగర మందలి పరిశ్రమలు, చేతిపనులు, బాటసారులకు తీర్థయాత్రికులకు సదుపాయములు కల్పించుట, పన్నులు విధించుటకై జననమరణములకు సంబంధించిన లెక్కలు, నూతన వస్తువులను తయారుచేయుట మున్నగు విషయములను ఈ కమిటీల సభ్యులు విచారించుచుండిరి. పురపాలక సంఘమువారు నగరముయొక్క ఆరోగ్యము, ఆదాయము, నీటిసరఫరా, ఉద్యానములు, రాజభవనములు అను విషయములు విచారించుచుండిరి.

న్యాయపరిపాలనకై అప్పుడు పంచాయతీ లుండెను. అప్పీలుకోర్టు లుండెను. క్షామనివారణార్థము ప్రత్యేకముగా ఏర్పాటులుండెను. దొరతనమువారి గిడ్డంగు లన్నిటిలోను నిలువయున్న సరకులో సగముభాగము క్షామనివారణార్థము ఉంచుచుండిరి.

చంద్రగుప్త చాణక్యులచే 2,200 ఏండ్ల క్రితము నిర్మింపబడిన మౌర్యసామ్రాజ్య మీతీరున నుండెను. కౌటిల్యునిచేతను, మెగాస్తనీసుచేతను ఉదహరింపబడిన కొన్ని యంశములు నే నిందు పొందుపరచితిని. వీనినిబట్టి ఆ దినములలో ఉత్తర హిందూస్థానమును గూర్చి కొంతవరకు స్థూలముగా గ్రహింపవచ్చును. రాజధానియగు పాటలీపుత్రము మొదలు నానా మహానగరములును, సామ్రాజ్యమందలి వేల కొలది పట్టణములును పల్లెలును జనసంకీర్ణమై యొప్పియుండవలెను.

సామ్రాజ్యమందలి ఒక భాగమునుండి వేరొకభాగమునకు ఘంటాపథము లుండెను. ప్రధాన "రాజపత్త్రిము" (రాజమార్గము) పాటలీపుత్రము గుండా వాయవ్య సరిహద్దులవరకు పోయియుండెను. కాలువ లనేక ముండెను. వాటిని సరిచూచుటకును, పొలములకు నీరు పారించుట కును ఒక ప్రత్యేక ప్రభుత్వశాఖ పనిచేయుచుండెను. నౌకాశ్రయములు, రేవులు, వంతెనలు, ఒకచోటినుండి వేరొకచోటికి తిరుగు అనేకములైన పడవలు, ఓడలు—వీనిని సరిచూచుటకు నౌకాశాఖ యను ప్రత్యేకశాఖ పనిచేయుచుండెను. ఓడలు సముద్రమును దాటి బర్మాకును, చీనాకును పోవుచుండెను.

ఇట్టి సామ్రాజ్యమును చంద్రగుప్తుడు 24 సంవత్సరము లేలెను. క్రీ. పూ. 296 సంవత్సరమున నతడు కీర్తికాయు డయ్యెను. తరువాతి జాబులో మౌర్యసామ్రాజ్యకథను సాగింతము.

## 19

# మూడు మాసములు

యస్. యస్. "క్రకోవియా"

ఏప్రియల్ 21, 1931

నీకు వ్రాసి చాలకాల మైనది. సుమారు మూడునెలలు గడచి పోయినవి—వ్యథతోను, దుఃఖముతోను, క్లేశముతోను కూడుకొన్న మూడుమాసములు; ఈ మూడుమాసములలోను ఇండియాలో మార్పు వచ్చినది. మన కుటుంబపరిస్థితులలోను మార్పు వచ్చినది. ఇండియాలో సత్యాగ్రహోద్యమము కొంతకాలము నిలుపుచేయబడినది. కాని మనము పరిష్కరించవలసిన సమస్యలు దుర్ఘటమైనవి. మన కుటుంబము మన మెంతో ప్రేమించు పెద్దను కోల్పోయినది. ఆయన మనకు బలము, ఆవేశము ఇచ్చెను. ఆయననీడను మనము పెరిగి పెద్దవారమైతిమి. మన మాతృదేవతయైన ఇండియాకు మనము చేతనైనంత సేవ చేయనేర్చుకొన్నది ఆయనఅండ చూచుకొనియే.

నాయినీ చెరసాలలో ఆ దినము నాకు స్పష్టముగా జ్ఞాపకమున్నది. అది జనవరి 26 వ తేదీ. అలవాటు చొప్పున నీకు ప్రాచీనకాలమును గూర్చి జాబు వ్రాయ కూర్చుంటిని. అంతకు ముందురోజుననే నీకు చంద్రగుప్తుని గురించియు, అతడు స్థాపించిన మౌర్యసామ్రాజ్యమును గూర్చియు వ్రాసియుంటిని. తరువాతికథ నీకు వ్రాసెద నని చెప్పియుంటిని. చంద్రగుప్తుని తరువాత వచ్చినవారిని గురించియు, దేవానాంప్రియుడైనట్టియు, హిందూదేశ ఆకాశమున ఉజ్జ్వలతారవలె ప్రకాశించి, అమర స్మృతిని వదలిన అశోక మహాచక్రవర్తిని గూర్చియు వ్రాసెదనని చెప్పియుంటిని. అశోకుడు ఆలోచనకు తగులుటతోడనే నామనస్సు సంచ

లించినది. తిరిగి తిరిగి జనవరి 26 వ తేదీపై నిలిచినది—సీకు జాబు వ్రాయు కూర్చుండిన తేదీ. అది మనకు గొప్పదినము. అంతకు ముందు సంవత్సరము హిందూదేశమందంతట స్వాతంత్ర్యదినముగా, పూర్ణస్వరాజ్య దినముగా పల్లెలందును, పట్టణములందును ఉత్సవములు జరిపితిమి. ఆ దినమున మనము కోట్లకొద్ది స్వాతంత్ర్యప్రతిజ్ఞ తీసికొంటిమి. ఒక సంవత్సరము గడచినది. పోరాటముతో, బాధతో, జయోత్సాహముతో కూడిన సంవత్సరము. మరల ఇండియా స్వాతంత్ర్యదినోత్సవము చేయ బోవుచున్నది. నాయినీ చెరసాలలో, 6 వ బారకాసులోనే నేను కూర్చుండి, దేశమందంతటను ఆ దినమున జరుగు సమావేశములు, ఊరేగింపులు, లాఠీచార్జీలు, నిర్బంధములు వీనినిగూర్చి ఆలోచించితిని. గర్వముతో, సంతోషముతో, పరితాపముతో ఆలోచించుచుండ, తటాలున నా ఆలోచన కంతరాయము కలిగెను. బాహ్యప్రపంచమునుండి నాకు సందేశము వచ్చి నది—తాతకు చాలా జబ్బుగా ఉన్నదనియు, ఆయనవద్దకు నేను వెళ్లు టకై వెంటనే నన్ను వదిలిపెట్టుదురనియు. విచారము మనస్సు నలము కొన్నది. ఆలోచనలు కట్టిపెట్టితిని. ప్రారంభించిన జాబును ప్రక్క బెట్టితిని. నాయినీ చెరసాల వదలి ఆనందభవనమునకు వెళ్ళితిని.

మనలను వదలి ఆయన పోవుటకుపూర్వము పదిదినములు తాత తోనే యుంటిని. ఆయనబాధను, ఆయన పడుచున్న వేదనను, మృత్యు దేవతతో ఆయన ధైర్యముగా పోరాడుటను మేము పదిదినములు, పది రాత్రులు కనిపెట్టి చూచితిమి. బ్రదికియున్న కాలములో ఆయన ఎన్నో పోరాటములు సల్పెను. ఎన్నో విజయములు పొందెను. ఒకరికి లొంగుట ఆయనకు చేతకాని పని. మృత్యువు ఎదుట నిలబడియున్నను ఆయన లొంగడు. నే నెంతో ప్రేమించిన నాతండ్రికి ఎట్టి సహాయము చేయ లేకుంటినిగదా యని తీవ్రవ్యథతో ఆయన తుదిపోరాటమును పరిశీలించు చుండగా చాలకాలము క్రితము నేను చదివిన ఎడ్గార్ ఆలెన్ పో వ్రాసిన కథలోని ఈ పంక్తులు జ్ఞాపకము వచ్చినవి: "దుర్బలచిత్తుడైననేతప్ప

మానవుడు : తనకుతానై దేవతలకు లొంగడు. మృత్యువుకు సైతము లొంగడు."

ఫిబ్రవరి 6 వ తేదీని, ఉదయమున, ఆయన మనలను బాసి వెడలి పోయెను. ఆయనశరీరమును, ఆయన ఎంతో ప్రేమించిన జాతీయపతాక ముతో చుట్టి, లక్నోనుండి ఆనందభవనమునకు తీసికొని వచ్చితిమి, కొద్దిగంటలలో ఆ శరీరము పిడికెడు బూడిదయైపోయెను. గంగానది యీ అమూల్యభస్మమును సముద్రమునకు గొంపోయినది.

కోట్లకొలది జను లాయనకై కన్నీరు కార్చిరి. ఇక మన మాట —ఆయన పిల్లలమైన మనమాట, ఆయన అస్థికలలో అస్థికలమై, మాంస ములో మాంసమైన మనమాట! ఇక నూతన ఆనందభవనముమాట. మనవలెనే ఆయన బిడ్డయై ప్రేమతో, శ్రద్ధతో ఆయనవల్ల స్వరూపమందిన ఆనందభవనముమాట! అది నిర్జనముగా పాడుపడ్డట్లున్నది. దాని ఆత్మయే దానిని విడిచిపోయినట్లున్నది. దానిని నిర్మించిన ఆయన నెప్పు డును తలచుకొనుచు, ఆయననెమ్మదికి భంగముకలుగునేమో యని మెల్లగా దాని వరాండాలమీద నడచుచుంటిమి.

ఆయనకొరకు దుఃఖించుచుంటిమి. ఏపని చేయుటకును ఆయన లేడుగదా యనిపించుచున్నది. దినములు గడచినకొలది దుఃఖము తగ్గుట లేదు. ఆయన లేడన్న వార్త దుస్సహముగానే ఉన్నది. కాని ఇట్లు మన ముండుట ఆయన కిష్టముండదని నాయూహ. మనము దుఃఖవివశుల మగుట కాయన అంగీకరించడు. ఆయన తన కష్టముల నెట్లెదుర్కొ నెనో అట్లే మనమును ఈదుఃఖము నెదుర్కొని కృతకృత్యులము కావలెనని ఆయనయాశయము. ఆయన పూర్తిచేయకుండ వదలిపెట్టిన కార్యమును మనము కొనసాగించుట ఆయన కిష్టము. చేయవలసిన పని యుండగా, హిందూదేశ స్వాతంత్ర్యమునకై మనము నడుము కట్టవలసి యుండగా మన మెట్లు ఊరుకొనగలము—ఎట్లు లాభములేని దుఃఖ ములో మునిగియుండగలము? భారతదేశ స్వాతంత్ర్యమునకై ఆయన

ప్రాణములు విడిచెను. అందుకొరకై మనము బ్రదికియుండి పాటుపడు దము. అవసరమైన ప్రాణముల నిచ్చివేతము. మన మాతని బిడ్డలము గదా. ఆయన బలము, ఆయన పట్టుదల, ఆయన తీవ్రోత్సాహము కొంత మనలోను ఉన్నవిగదా!

నే నీజాబు వ్రాయుచున్నప్పుడు గంభీరమైన, నీలిరంగుగల అరే బియా సముద్రము నాకు కనుచూపుమేరలో కనిపించుచున్నది. వేరొక తట్టున, దూరములో, ఇండియాతీర మున్నది. విశాలమై, కొలుచుటకు వీలులేని ఈ సముద్రమును ఇదివరలో నీకు జాబులు వ్రాయుచుండిన నాయినీ చెరసాలలోని ఎత్తుగోడలు గల చిన్న బారకీసుతో పోల్చుదును. సముద్రమును, ఆకాశమును కలిసినట్లున్న దిఙ్మండలమును నేను స్పష్ట ముగా చూచుచుంటిని. చెరసాలలోనో, బంధితుని దిఙ్మండలము తన చుట్టును ఉన్న గోడపై భాగమే. చెరసాలలో నుండిన పలువురము నేడు బయటికివచ్చితిమి. స్వేచ్ఛావాయువులు పీల్చుచుంటిమి. కాని ఇంకను పలువురు చెరసాల ఇరుకుకొట్లలో మగ్గుచున్నారు. వారు సముద్రమును చూడ వీలులేదు. భూమిని, దిఙ్మండలమును చూడవీలులేదు. హిందూ దేశముసైత మింకను చెరసాలలోనే యున్నది. దాని కింకను స్వాతం త్ర్యము రావలసియున్నది. ఇండియాకు స్వాతంత్ర్యము లేకున్న మన స్వేచ్ఛ ఎందుకును కొరగానిది.

## 20

# అరేబియా సముద్రము

యస్. యస్. క్రకోవియా

ఏప్రియల్ 22, 1931.

మేము ఈ నావలో—క్రకోవియాలో—బొంబాయినుండి కొలం బోకు ప్రయాణముచేయుట వింతగా ఉన్నది. నాలుగు సంవత్సరముల క్రితము, వెనీసులో క్రకోవియాకొరకు వేచియుండుట నాకు జ్ఞాపకమున్నది.

తాత ఆ నావలో ఉన్నారు. ఆయనను కలిసికొనుటకు నేను వెనీసు వెళ్ళితిని. నిన్ను స్విట్జర్లాండులో ఐక్సువద్ద నీబడిలో వదలివచ్చితిని. కొన్ని మాసము లైనపిమ్మట తాత క్రకోవియా నావమీదనే యూరోపునుండి ఇంటికి తిరిగివచ్చెను. నే నాయనను కలిసికొనుటకు బొంబాయి వెళ్ళితిని. ఆ ప్రయాణములో ఆయనతోకూడ ప్రయాణముచేసినవారు ఇప్పుడు నాతో ప్రయాణము చేయుచున్నారు. వా రాయనను గూర్చిన కథ లెన్నో చెప్పుచున్నారు.

కడచిన మూడునెలలలో జరిగిన మార్పులనుగురించి నిన్నను నీకు జాబువ్రాసితిని. కడచిన కొద్దివారములలో జరిగిన ఒక విషయమును నీవు జ్ఞప్తియందుంచుకోవలెను. ఆ విషయమును ఇండియా ఎన్నటికిని మరువజాలదు. మాసములోపుగా, కాన్పూరులో ధైర్యశాలియగు ఇండియా యోధు డొకడు మరణించెను. అతని పేరు గణేశశంకరవిద్యార్థి. ఇతరులను రక్షించుచున్న సమయమున నాతనిని హత్యచేసిరి. గణేశజీ నాకు ప్రేమపాత్రుడగు స్నేహితుడు. స్వార్థరహితుడు, ఉదారస్వభావుడు. అతనితో కలిసి పనిచేయగలుగుట మన యదృష్ట మనుకొనవలెను. కాన్పూరులో, క్రిందటినెల ప్రజ లున్మత్తులై ఒక హిందూదేశస్థుని వేరొక హిందూదేశస్థుడు హత్యగావించుచున్న సమయమున, గణేశజీ ఆ పోరాటములోనికి చొరబడెను. తన దేశస్థులతో పోరాడుటకు కాదు. వారిని రక్షించుటకాతడు చొరబడెను. అతడు వందలకొలది ప్రజలను రక్షించెను. తన్ను తాను రక్షించుకోలేకపోయెను. రక్షించుకోదలచుకొనను లేదు. అతడు ఎవరిని రక్షింపబూనెనో వారే అతని మరణమునకు కారకులైరి. కాన్పూరును, మన రాష్ట్రమును ఒక ఉజ్జ్వలతారను గోల్పోయెను. మనము పెక్కురము వివేకియగు ప్రియమిత్రుని గోల్పోయితిమి. కాని ఎంతటి దివ్యమైన మరణ మతనిది! శాంతదృష్టులతో, జనుల గుంపుల ఉన్మత్తతకు వెనుకంజవేయక, ఆపద, మరణము ఎదుర్కొనుచున్నను ఇతరులను రక్షించవలెననియే యాలోచించుచు ప్రాణములు వదలిన అతని మరణ మెంత భవ్యము !

మూడు మాసములలో మార్పు ! కాలసముద్రమున నొక నీటిబిందువు! జాతిజీవితమున ఒక లిప్త! సింధుదేశములో సింధునదీ లోయలోని మొహెంజదారొ శిథిలములను చూచుటకు నేను వెళ్ళి మూడువారములే అయినది. నీవు నాతో రాలేదు. భూగర్భమునుండి ఒక నగరము బయ ల్వెడలుట నేను చూచితిని. గట్టి ఇటుకరాళ్ళతో కట్టిన ఇండ్లు, విశాల మగు ఘంటాపథములు గల నగరము. 2000 సంవత్సరములకు పూర్వము దానిని కట్టిరట ! ఈ ప్రాచీన నగరములో దొరికిన ఆభరణములను, అందమగు జాడీలను నేను చూచితిని. ఆ నగరమున స్త్రీలును, పురుష లును చక్కని దుస్తులు వేసికొని వీథులలో, సంతలలో పారాడుచున్న ట్లును, చిన్నపిల్లలు ఆడుకొనుచున్నట్లును, అమ్మకపు సరుకులతో నిండిన బజారులను, అమ్ముచున్న, కొనుచున్న మనుష్యులను, దేవాలయములలో మ్రోగుచున్న గంటల శబ్దములను నేను మనస్సులో కల్పనచేసికొన గలిగితిని.

ఈ 5000 సంవత్సరముల కాలములో ఇండియా దానిబ్రతుకు అది బ్రతికినది. ఎన్నో మార్పులు చూచినది. ఈ మన పురాణమాత, పురాణ స్త్రీ అయినప్పటికిని యౌవనముతో, సౌందర్యముతో అలరారు ఈ మన తల్లి తన బిడ్డల తొందరపాటు చూచి, ఈ దినమున నుండి రేపు మాయ మగు వారి చిల్లర ఇబ్బందులు, వారి కష్టసుఖములు చూచి మందహాసము చేయదా యని నే నప్పుడప్పు డనుకొనుచుందును.

# 21

# సెలవుదినము : స్వప్నయాత్ర

మార్చి 26, 1932

ప్రాచీన చరిత్రనుగురించి నాయినీ చెరసాలనుంచి నీకు వ్రాసి పదు నాలుగు మాసములైనది. మూడునెలల తరువాత అరేబియా సముద్రము నుండి మరి రెండు జాబులు వ్రాసియుంటిని. అప్పుడు మేము క్రకోవియా అను నావ నెక్కి లంకకు తొందరగా పోవుచుంటిమి. మా కనుచూపు మేరలో సముద్ర మపారముగా వ్యాపించియున్నదని నీకు వ్రాసియుంటిని. వారాశి నెంత చూచినను కనులకు తృప్తికలుగలేదు. తరువాత లంక వచ్చినది. ఒక నెలపాటు చికాకులు కష్టములు మరిచి, దివ్యముగా సెలవు దినములు గడపితిమి. సౌందర్యనిలయమైన లంకాద్వీపమునంతయు సంచరించితిమి. ఎంత సౌందర్యము! ప్రకృతి ఎంత సమృద్ధముగా విజృంభించినది ! మేము దర్శించిన స్థలములను తలచుకొనిన ఎంతహాయిగా నున్నది. కాండీ, నువారా ఏలియా, అనూరాధపురము—ప్రాచీనౌన్నత్యమును తలపునకు దెచ్చు దాని శిథిలములు ఎంత మనోహరము. ప్రాణి కోటితో నిండి నీ వంక సహస్రాక్షులతో చూచుచున్నట్లుండిన చల్లని అడవులను తలచుకొనుట కెంతో ముచ్చటగా నుండును. ఆ చక్కని పోకచెట్లు, సన్నముగా, నిలువుగా పైకిపోవు పోకచెట్లు; లెక్కింప నలవి కాని కొబ్బరిచెట్లు; ద్వీపముయొక్క పచ్చనిరంగు సాగరగగనముల నీలిమతో కలిసిన తాళవృక్షములు నిండిన సముద్రతీరము—తలచుకొనుట కెంత ముచ్చట! సముద్రనీరము మిలమిలలాడుచు తీరతరంగములపై నాడుచుండెను. తాటియాకులలో దూరి వాయువు మర్మరధ్వనుల నీనుచుండెను.

ఉష్ణమండలములకు వచ్చుట నాకును, నీకును ఇదియే మొదటి పర్యాయము. వెనుక నెప్పుడో నే నొకమారు వచ్చితినిగాని అది జ్ఞప్తి యందు లేదు. ఇది మనకు నూతనానుభవమే. వేడికి భయపడి నేనిచ్చటికిరా నిచ్చగించలేదు. నన్ను అమితముగా నాకర్షించునవి—సముద్రము, పర్వతము, మంచు, హిమానీనదులు. సింహళములో ఉన్నది కొద్ది కాలమే అయినప్పటికిని ఉష్ణమండలముల సౌందర్యము, ఇంద్రజాలశక్తి నా కనుభూతమైనవి. మరల దర్శించవలెనను అకాంక్షతో నేను తిరిగి వచ్చితిని.

సింహళములో గడపిన నెలసెలవులు త్వరలో ముగిసిపోయెను. తరువాత సముద్రమును దాటి ఇండియా దక్షిణాగ్రము చేరితిమి. కన్యాకుమారిని మనము దర్శించుట నీకు జ్ఞాపకమున్నదా? ఈ దేవతాకన్య అక్కడ నివసించి ఇండియాను రక్షించుచుండునట. దీనినే పాశ్చాత్యులు, మనపేర్లు మార్చి పాడుచేయు ప్రతిభ గలవారు, కామరిన్ అగ్ర మందురు. అప్పుడు మనము అక్షరాలా భారతమాతపాదములవద్ద కూర్చుంటిమి. అరేబియా సముద్రనీరములు బంగాళాఖాత నీరములతో మిశ్రమగుట చూచితిమి. అవి రెండును భారతభూమికి వందనము లర్పించుచున్నట్లు భావించుట మన కెంతో ఆనందముగా నుండెను, ఎంత శాంతముగా నున్న దచ్చట! నా మనస్సు వేలకొద్ది మైళ్ళ భారతదేశముయొక్క ఉత్తరపు పొలిమేరకు పరుగెత్తుకొనిపోయినది. అచ్చట హిమాలయ శృంగములపై నిత్యహిమము కిరీటాయమానముగా వెలుగుచున్నది. అచ్చటకూడ ఇట్లే శాంతముగా నుండును. కాని ఈ రెంటికిని మధ్య ఉన్నవి—కావలసినంత పోరాటము, దుఃఖము, దరిద్రము!

అగ్రమును వదలి ఉత్తరముగా ప్రయాణముచేసితిమి.

తిరువాన్కూరు కొచ్చినులగుండా వెళ్ళితిమి. మలబారు కయ్యమీద ప్రయాణము చేసితిమి. అది ఎంత అందముగా నున్నది. వృక్షములచే నావృతమైన తీరములమధ్యగా, వెన్నెలలో, మా నావ ఎంత చక్కగా

జారిపోయినది. కలగాంచుచున్నామా యనిపించినది. పిమ్మట మైసూరు, హైదరాబాదు వెళ్ళితిమి. తరువాత బొంబాయి. చివరకు అలహాబాదు. లొమ్మిదిమాసముల క్రితము మాట యిది. జూన్‌మాసములో.

ఈ రోజులలో ఇండియాలోని మార్గములన్నియు ఆలస్యముగానో, శీఘ్రముగానో ఒకే గమ్యస్థానమునకు చేర్చును. యాత్రలన్నియును, యథార్థయాత్రలైనను, స్వప్నయాత్రలైనను చెరసాలలో ముగియును. కాబట్టి, అలవాటుపడ్డ ప్రాతగోడలవెనుకకు నేను మరల చేరితిని. ఆలోచించుకొనుటకు, నీకు వ్రాయుటకు కావలసినంత కాల మున్నది నాకు. కాని నా జాబులు నీ కందవేమో ? మరల పోరాటము ప్రారంభమైనది. మన ప్రజలు,—స్త్రీలు, పురుషులు; బాలురు, బాలికలు;—స్వాతంత్ర్యయుద్ధమునకు, మనదేశమును దారిద్ర్యపిశాచమునుండి తప్పించుటకు ముందంజ వేసినారు. కాని స్వాతంత్ర్యము త్వరలో సంతుష్టినొందని దేవత. పూర్వ కాలమునందు వలెనే నేడును భక్తులనుండి ఆమె నరబలి కోరును.

నేను చెరసాలలో ప్రవేశించి నేటికి మూడునెలలు పూర్తిమైనవి. మూడునెలల క్రితము ఈ దినమునందే—డిశంబరు 26 వ తేదీని—ఆరవ మారు నేను బంధితుడనైతిని. ఈ జాబులు మరల ప్రారంభించుటకు చిరకాలము పట్టినది. అయితే వర్తమానము మనస్సు నావరించినపుడు దూర భూత కాలమునుగూర్చి ఆలోచించుట ఎంత కష్టమో నీకు తెలియును. బయట జరుగుచున్న సంఘటనలనుగూర్చి మనస్సును వికలముచేసికొనకుండుటకును, చెరసాలలో కుదుటపడుటకును కొంతకాలము పట్టును. నేటినుండి క్రమముగా నీకు జాబులు వ్రాసెదను. కాని ఇప్పుడు నేను వేరొక చెరసాలలో నున్నాను. ఈమార్పు నా కిష్టములేదు. ఇందుచే నా పని సరిగా జరుగుట లేదు. నా దిఙ్మండలము ఇదివరకుకన్న కొంత ఎత్తుగా నున్నది. నా కెదురుగా నున్న గోడ చీనాదేశపు గొప్పగోడకు, అధమపక్షము ఎత్తులో, బాంధవ్యము వహించియుండును ! అది 25 అడుగుల ఎత్తున్నట్లు తోచును. మమ్ము దర్శించుటకై సూర్యుడు ప్రతిఉదయము దాని నెక్కుటకై అదనముగా గంటన్నర తీసికొనుచున్నాడు.

మా దిఙ్మండలము కొంతకాలముపాటు సంకుచితముగా నుండ వచ్చును. కాని ఆ గొప్ప నీలిసముద్రము, ఆ పర్వతములు, ఆ యెడారులు, మనము చేసిన ఆ స్వప్నయాత్ర—నీవు, అమ్మ, నేను పదిమాసముల క్రితము చేసిన స్వప్నయాత్ర నిజమేనా అనిపించును నేడు. తలచుకొనిన ఆనందముగా నుండును.

# 22

# బ్రతుకుకొరకు మానవుని పాట్లు

మార్చి 28, 1932.

ప్రపంచచరిత్రసూత్రములను మరల తీసికొని భూతకాలములోనికి దృష్టి నిగిడించుటకు ప్రయత్నింతము. ఇది చిక్కుగూడు. విప్పుట కష్టము. మొత్తముగా చూచుటకూడ కష్టము. ఒక ఖండమును మనము తీసికొని దానికి తగని ప్రాధాన్య మిచ్చుట కలదు. దాదాపు మనమందరము మన దేశచరిత్రయే—అది ఎట్టిదైనను—ఇతరదేశ చరిత్రలకంటె తేజోవంతము, పఠింపదగినది అని భావింతుము. ఇట్లు చేయకూడదని ఇదివరలో ఒకమారు నీకు చెప్పియుంటిని. మరల చెప్పుచుంటిని. ఈ బోనులో పడుట బహుసులభము. ఇట్లు జరుగునేమో యను భయముతోనే నేను నీ కీ జాబు వ్రాయుచున్నాను. కాని ఆ తప్పే నేను చేయుచున్నానేమోయని అప్పుడప్పు డనుకొందును. నేను నేర్చుకొన్న విద్య లోపభూయిష్ఠమైనప్పుడును, నాకు నేర్పిన చరిత్ర తలక్రిందులుగా నున్నప్పుడును నేనుమాత్ర మేమి చేయగలను! నాలోని లోపములను సవరించుకొనుటకే నేను చెరసాలలో ఏకాంతముగా చదువుచున్నాను. కొంతవరకు కృతకృత్యుడనైతిని. నా బాల్యమందును, యౌవనమందును నేను నా మనోభవనమున తగిలించిన పురుషులయొక్కయు, సంఘటనలయొక్కయు చిత్తరువులను తొలగించలేను. అసంపూర్ణజ్ఞానమునకు

తోడు ఈ చిత్తరువులు నాదృక్పథమును మలినము చేయుచున్నవి. నేను వ్రాయుదానిలో తప్పులుండును. అముఖ్యవిషయములను నేను ఎత్తుకొనవచ్చును. ముఖ్యవిషయములను వదలిపెట్టవచ్చును. కాని ఈ జాబులు చరిత్రగ్రంథముల స్థానము నాక్రమించుట కుద్దేశింపబడినవి కావు. అవి మనలో మనము చేసికొను ప్రసంగము లనియే నేను అనుకొందును. వేయిమైళ్లును, ఎన్నో గట్టిగోడలును అడ్డురాకపోయినట్లైన మన మీ ప్రసంగములను చేసికొనియే యుందుము.

చరిత్రగ్రంథములనిండ ఉండు ప్రసిద్ధపురుషులనుగూర్చి నేను నీకు వ్రాయకతీరదు. వారి చరిత్రలు చదువుటకు సరదాగానే ఉండును. వారేకాలమున నివసించియుండిరో అట్టి కాలమునుగురించి తెలిసికొనుటకు వారి చరిత్రలు పనికివచ్చును. పెద్దవారియొక్కయు, రాజులయొక్కయు, చక్రవర్తులు మున్నగువారియొక్కయు చేతలను వ్రాసిపెట్టిన గ్రంథము మాత్రమే కాదు చరిత్ర. అట్టి గ్రంథమే యైనచో చరిత్ర నేడు తన వ్యాపారమును కట్టిపెట్టవచ్చును. ఎందుకనగా రాజులును, చక్రవర్తులును ప్రపంచరంగమున సగర్వముగా సంచరించుట మానుకొనిరి. నిజముగా మహాపురుషులైన స్త్రీపురుషులకు, వారి ఘనతను ప్రకటించుటకు సింహాసనములు, కిరీటములు, ఆభరణములు అవసరములేదు. తమ రాజత్వము, రాజకుమారత్వము తప్ప తమలో నేమియు సరుకులేని రాజులును, రాజకుమారులును తమ నగ్నత్వమును కప్పుకొనుటకు దవాలీలు, ఉడుపులు పెట్టుకొందురు. వాటిని చూచి మనలో పెక్కురము మోసపోవుదుము, మకుటధారిని రాజమాత్రుని-మహారాజని పిలుచుచుందుము.

నిజమైనచరిత్ర అచ్చటచ్చటనున్న కొద్దివ్యక్తులను గూర్చిచెప్పునది కాదు. అది ప్రజలనుగూర్చి చెప్పవలెను. జాతి ఏర్పడుచున్నది ప్రజలవల్లనే. కాయకష్టము చేసి జీవనమునకు కావలసిన అవసరపదార్థములను, భోగవస్తువులను ఉత్పత్తి చేయునది ప్రజలు. వారనేకవిధములుగా తమలో తాము లావాదేవీలు పెట్టుకొందురు. అట్టి మానవుని చరిత్ర నిజముగా

హృదయము నాకర్షించును. యుగయుగములలో మానవుడు ప్రకృతితోను, పంచభూతములతోను సలిపిన పోరాటము, వన్యమృగములతోను, వనములతోను సలిపిన పోరాటము, అన్నిటికన్న కష్టమగు పోరాటము—తన్ను అణచిపెట్టి తనవల్ల లాభము పొందజూచు సాటిమానవునితో చేసిన పోరాటము—ఇట్టి పోరాటముల కథయే చరిత్ర యనతగినది. జీవనము గడపుటకు మానవుడు చేసిన కృషిని వర్ణించునదే చరిత్ర. జీవించుటకు ఆహారము, ఇల్లు, శీతలదేశములందు బట్టలు మున్నగునవి కావలయును కాబట్టియే యిట్టి అవసరవస్తువులను తమ వశములో పెట్టుకొన్నవారు మానవునిపై అధికారము చలాయించిరి. పాలకులును, యజమానులును తమ అధికారమును చలాయించుటకు కారణము జీవితావసర పదార్థములను తమ వశమునందుంచుకొనుటయే. తమకు లొంగనివారిని మాడ్చి వారు లొంగదీసికొనుచుండిరి. కావుననే ప్రజాబాహుళ్యమును అల్పసంఖ్యాకులు తమ వశముచేసికొని లాభములు పొందుచున్న వింత దృశ్యమును మనము చూచుచున్నాము. పనిచేయకుండ భాగ్యవంతులగు వారిని, ఎంత కష్టపడినను కొద్దిగానే ఆర్జించువారిని మనము చూచుచున్నాము.

అనాగరికుడు ఒంటరిగా వేటాడి జీవించుచు క్రమక్రమముగా కుటుంబమును కూర్చుకొనుచున్నాడు. అట్టి కుటుంబము కుటుంబీకు లందరి కొరకును పనిచేయును. అనేకకుటుంబములు అన్యోన్య సహకారము చేసికొనుచు గ్రామముగా నేర్పడుచున్నవి. వేర్వేరు గ్రామముల పనివాండ్రు, వర్తకులు, శిల్పులు చేరి కూటములగుచున్నారు. ఈ విధముగా క్రమక్రమముగా సంఘప్రమాణము వృద్ధియగుచుండును. తొలుదొల్త ఒక వ్యక్తి—అనాగరికుడు—మాత్రమే. అప్పుడు ఎట్టి సంఘమును లేదు. తరువాత కుటుంబము, తరువాత గ్రామము, తరువాత గ్రామసముదాయము. సంఘప్రమాణ మిట్లు పెరుగుటకు కారణమేమి? మానవుడు జీవించుటకు చేయు కృషివల్లనే అభివృద్ధియు, సహకారమును కలిగినవి. తమ

శత్రువునుండి రక్షించుకొనుటకును, తమ శత్రువును ఎదుర్కొనుటకును సహకార మవసరముకదా. ఒంటరిగా శత్రువునుండి రక్షించుకొనుటగాని, శత్రువు నెదుర్కొనుటగాని ఇంత ఫలవంతము కాదుగదా. పనిలో అన్యోన్య సహకారము ఇంతకన్నను లాభకరమైనది. ఒంటరిగా పనిచేయుటకన్న పదిమంది కలిసి పనిచేసినచో ఎక్కువగా ఆహారపదార్థములను, జీవితావసర పదార్థములను తయారుచేయవచ్చును. పనిలో సహకారముచేయుటను బట్టి ఆర్థికప్రమాణము పరిణమించుచున్నదని తెలిసికొనవచ్చును. ఒంటరిగా తనకొరకు మాత్రమే వేటాడు అనాగరికుడు పదిమందితో కలిసి అందరి లాభముకొరకును గుంపులుగా వేటాడనేర్చెను. జీవించవలెనని మానవుడు చేసిన కృషిప్రోద్బలమువల్ల ఆర్థికప్రమాణము పెరిగినది. అది పెరుగుటవలన సంఘము పెరిగినది. సంఘప్రమాణము వృద్ధినందినది. విశాలచరిత్రభూములలో ఈ వృద్ధి మనకు కానవచ్చును. అంతులేని పోరాటములమధ్య, దుఃఖములమధ్య ఈ వృద్ధి మనకు కానవచ్చును. ఈ వృద్ధినిబట్టి ప్రపంచ మభివృద్ధిచెందిన దనిగాని, వెనుకటికన్న ప్రజలు సుఖముగా నున్నారనిగాని యూహించవద్దు. ఇదివరకుకన్న మెరుగుగా నున్నదనిమాత్రము చెప్పవచ్చునుకాని దోషరహితమగు సంపూర్ణస్థితికిమాత్రము రాలేము. ప్రపంచమున అన్నితావులందును కావలసినంత దుఃఖ మున్నది.

సంఘప్రమాణము, ఆర్థికప్రమాణము వృద్ధియగుకొలది జీవితమంతకంతకు చిక్కులలో తగుల్కొనును. వాణిజ్యము, వర్తకము వృద్ధినందును. దానపద్ధతి (Gift) పోయి సాటాపద్ధతి (Barter) వచ్చును. పిమ్మట ధనము వచ్చును. అది వచ్చుటచే ఇచ్చిపుచ్చుకొనుటలలో ఎన్నో మార్పులు వచ్చును. వెంటనే వర్తకము ముందంజవేయును. బంగారు వెండినాణెములను చెల్లించుటవల్ల వస్తువుల బదలాయింపు సులభమగుచున్నది. కొంతకాల మైనపిమ్మట నాణెములను వాడుటకూడ కొంతవరకు మానుకొని ధనసంకేతములను ప్రజలు వాడజొచ్చిరి. ధనము

చెల్లించబడు నను వాగ్దానముతో కూడిన కాగితముముక్క ధనసంకేత ముగా చెల్లినది. బాంకినోట్లు, చెక్కులు ఈవిధముగా వాడుకలోనికి వచ్చినవి. అరువుపద్ధతిమీద వర్తకముచేయుటయే దీని కర్థము. అరువు లిచ్చు పద్ధతి వాణిజ్యవర్తకముల వృద్ధి కెక్కువగా తోడ్పడినది. ఈ రోజులలో తరుచుగా ప్రజలు చెక్కులను, బాంకినోట్లను వాడుచున్నారని నీ వెరుగుదువు. తెలివిగలవా రెవ్వరును బంగారు వెండినాణెముల సంచీలను తమతోకూడ తీసికొనిపోరుగదా!

అస్పష్టభూతకాలమునుండి చరిత్ర వృద్ధినందుచుపోగా ప్రజలు అధికముగా పదార్థములను ఉత్పత్తి చేయజొచ్చిరి. వేర్వేరు వర్తకములను ప్రత్యేకముగా చేయజొచ్చిరి. పదార్థములను బదలాయించుకొనజొచ్చిరి. ఈ విధముగా వర్తకమును వృద్ధినందించిరి. మరియు క్రొత్త సంచార సాధనములు, వెనుకటికంటె ప్రశస్తమైనవి వచ్చినవి. ఆవిరి ఇంజను వచ్చినపిమ్మట గత నూరుసంవత్సరములలో ఈ సంచారసాధనములు వృద్ధినందినవి. ఉత్పత్తి అధికమైనకొలది ప్రపంచభాగ్యము వృద్ధియగును. అందుచేత కొందరు మనుష్యులకు విరామ మెక్కువ యుండును. ఇట్లు నాగరికము వృద్ధినందుచున్నది.

ఇదంతయు జరిగినదికాన మనకాలము విజ్ఞానవంత మనియు, నానాటికి వృద్ధిచెందుచున్న దనియు ప్రజలు గర్వింతురు. మన సంస్కృతిని, మన శాస్త్రవిజ్ఞానమును, నవీననాగరికతయొక్క అద్భుతకార్యములను చూచి గర్వింతురు. కాని బీదవారు బీదరికములోనే ఉన్నారు. దుఃఖభాజనులై యున్నారు. గొప్పజాతు లొకరితో నొకరు పోరాడి కోట్లకొలది జనులను హత్యచేయుచున్నారు. మన దేశమువంటి గొప్పదేశములు అన్యాక్రాంతమై పరదేశస్థుల పాలనలో పడియున్నవి. మన యిండ్లలోనే మనకు స్వేచ్ఛ లేనినాడు ఎందుకు మన కీనాగరికత ? కాన నేడు మనము నడుములు బిగించి పనిచేయుచున్నాము.

ఉద్రేకపూరితమగు ఈ రోజులలో మన ముండుట ఎంత అదృష్టము. ఇండియాయును, ప్రపంచమంతయును మారుచుండుట చూచుచు,

మనమును అందు పాల్గొనుచు ఉండవచ్చునుగదా! నీవు అదృష్టవంతు రాలవు. రష్యాలో నూతనయుగము ప్రారంభమగుటకు కారణమైన విప్లవము జన్మించిన సంవత్సరమున, ఆ దినముననే నీవు జన్మించితివి. ఇప్పుడు నీ దేశమందే జరుగుచున్న విప్లవమును చూచుచున్నావు. కొద్ది కాలములో నీ వందు చేరవచ్చును. ప్రపంచమంతయు చిక్కులలో నున్నది. మారుచున్నది. దూరప్రాచ్యములో జపాను చీనాపై పడి నది. పశ్చిమదేశములందును, నిజమునకు ప్రపంచమందంతటను ప్రాత పద్ధతి ఊగులాడుచున్నది. కూలిపోవుటకు సిద్ధముగా నున్నది. ఆయుధ విసర్జనమును గూర్చి దేశములు ముచ్చటించుకొనునుకాని ఒకరిని చూచిన ఇంకొకరికి అనుమానము. కాబట్టి ప్రతిదేశమును పూర్తిగా సాయుధమై యుండును. ఇంతదనుక లోకములో అధికారము నెరపిన ధనికపద్ధతి కిది ప్రదోషకాలము. అది పోకతీరదు. పోవునప్పుడు ఎన్నో చెడుగుల వది కూడా తీసికొనిపోవును.

# 23

# సింహావలోకనము

మార్చి 29, 1932.

యుగములగుండా మనము చేయుచున్న ప్రయాణములో ఎంత వరకు వచ్చితిమి? ఈజిప్టు, ఇండియా, చీనా, క్నొసోసులయొక్క ప్రాతకాలమునుగూర్చి కొంచెము ముచ్చటించితిమి. పిరమిడ్సును సృజించిన ఈజిప్టుయొక్క అద్భుతప్రాచీన నాగరికతను కొంత చూచి తిమి. క్రమముగా నది శక్తిగోల్పోయి, క్షీణించి, జీవములేని వట్టి ఛాయయై నామమాత్రావశిష్టమగుట గమనించితిమి. గ్రీసునుండి సాటి వంశమువారు వచ్చి క్నొసోసును ధ్వంసముచేయుట పరికించితిమి. ఇండియా చీనాలలో, ఎక్కువగా తెలిసికొనుటకు ఆధారములు లేనప్పటి కిని, పురాతనకాలమున నవి యెట్లు తలయెత్తినవో పరిశీలించితిమి. ఆ

దినములలో సైతము వారి నాగరీకము ఎంత పక్వమైనదియు తెలిసి కొంటిమి. వేల సంవత్సరములకు పూర్వమునుండియు ఈ రెండు దేశముల సంస్కృతులును ఎట్లు పెనవేసికొని పోయినవో చూచి ఆశ్చర్య మందితిమి. మెసపొటేమియాలో సామ్రాజ్యములవెనుక సామ్రాజ్యములు తలయెత్తి, వృద్ధినంది, ఎట్లు మట్టికలసినవో స్థాలీపులాకన్యాయముగా చూచితిమి.

క్రీస్తుకు 500, 600 సంవత్సరములకు పూర్వము వేర్వేరు దేశములం దవతరించిన మహాపురుషులనుగూర్చి కొంత చెప్పుకొంటిమి. ఇండియాలో బుద్ధుడు, మహావీరుడు; చీనాలో కన్‌ఫ్యూసియసు, లోచే; పర్షియాలో జొరాష్టరు; గ్రీసులో పైథాగొరసు. అనేకవిధములగు మూఢ విశ్వాసములతోను, పూజలతోను ప్రజాసామాన్యము మోసపోయి పురోహితుల చెప్పుచేతలలో నుండుట చూచి, బుద్ధుడు పురోహితుల కాపట్యమును, ప్రాచీన వేదమతముయొక్క ఆనాటి స్వరూపమును ఎదుర్కొనెనని తెలిసికొంటిమి. వర్ణభేద ముండరాదనియు, మానవు లందరు సమానులే యనియు అతడు బోధించెనని గమనించితిమి.

పిమ్మట మనము పశ్చిమమునకు వెళ్లితిమి. అచ్చట ఆసియా యూరోపులు కలిసినవి. పర్షియా, గ్రీసుదేశముల చరిత్రలు గమనించితిమి. పర్షియాలో మహాసామ్రాజ్య మొకటి ఎట్లు తలయెత్తినదియు, రాజాధిరాజైన డరయసు దానిని ఇండియాలోని సింధునదివరకు ఎట్లు విస్తరింపజేసినదియు, అతని సామ్రాజ్యము గ్రీసు నెట్లు కబళింప ప్రయత్నించినదియు, కబళింపబడక గ్రీ సెట్లు దానిని వెనుకకు కొట్టినదియు తెలిసికొంటిమి. తరువాత కొద్దికాలమే నిలిచినప్పటికిని దేదీప్యమానముగా వెలిగిన గ్రీసుచరిత్ర కొంత చూచితిమి. మహాపురుషులు, ప్రతిభాశాలులు ఆకాలమున గ్రీసులో నుండిరి. సౌందర్యోపేతమగు సారస్వతమును, లలితకళలను వారు సృష్టించిరి.

గ్రీసులోని స్వర్ణయుగము చిరకాలము నిలువలేదు. మాసిడన్ దేశమువాడైన అలెగ్జాండరు తన విజయములతో గ్రీసుపేరు నలుగడల

వ్యాపింపజేసెను. అతడు వచ్చినపిమ్మట గ్రీసుదేశముయొక్క ఉత్కృష్ట సంస్కృతి క్రమముగా వాడుమొగముపెట్టెను. అలెగ్జాండరు పర్షియా సామ్రాజ్యమును విధ్వంసముచేసి ఇండియా పొలిమేరలవరకు విజిగీషువై పోయెను. అతడు గొప్ప సేనాని యనుటకు సందేహము లేదు. కాని అతనిని గురించి లోకు లెన్నో కథలు కల్పించిరి. అందుచేత అతనికి అర్హతలేని కీర్తి వచ్చినది. బాగుగా చదువుకొన్నవారికి మాత్రమే సోక్రటీసు. ప్లేటో, ఫిడియాస్, సొఫొక్లీసు మున్నగు గ్రీసు మహాపురుషుల పేర్లు తెలియును. కాని అలెగ్జాండరుపేరు విననివా రెవరు?

అలెగ్జాండరు చేసినపని బహు తక్కువ. పర్షియాసామ్రాజ్యమున కప్పటికి వార్ధకమువచ్చెను. అది కూలిపోవుటకు సిద్ధముగా నుండెను. ఇండియాపై అలెగ్జాండరు సలిపినది వట్టి దాడిమాత్రమే. అది అంత చెప్పుకోదగ్గది కాదు. మరి కొంతకాలము బ్రదికియున్నట్లయితే అలెగ్జాండరు ఏమైన ఘనకార్యము చేసియుండెడివాడేమో. కాని అతడు చిన్నతనములోనే మరణించెను. వెంటనే అతని సామ్రాజ్యము ముక్కలై పోయెను. అతని సామ్రాజ్యము చిరకాలము మన్నకపోయినను అతని పేరుమాత్రము నిలిచినది.

ప్రాచ్యదేశమునకు అలెగ్జాండరురాకవల్ల కలిగిన ప్రయోజన మొక్కటి—ప్రాక్పశ్చిమములకు సంబంధ మేర్పడినది. గ్రీకులు పెక్కురు తూర్పుదేశములకు పోయి పెద్దపట్టణములలో కాపురములు పెట్టుకొనిరి. కొందరు వలస లేర్పరుచుకొనిరి. అలెగ్జాండరుకు పూర్వమందుకూడ ప్రాక్పశ్చిమముల మధ్య వర్తకము జరుగుచుండెను. దానికి సంబంధము లేకపోలేదు. అతని అనంతర మది యతిశయించెను.

అలెగ్జాండరుదాడివల్ల కలిగిన వేరొకఫలము చెప్పుదురు. అది నిజమో కాదో తెలియదు. గ్రీకులకు దానివల్ల ప్రమాదము సంభవించినది. మెసపొటేమియా తేమప్రదేశములనుండి గ్రీసు పల్లపుభూములకు అలెగ్జాండరు సైనికులు మన్యపుజ్వరము కలిగించు దోమలను తీసికొనివచ్చి

రను వదంతి యొకటి గలదు. ఆ విధముగా మన్యపుజ్వరము గ్రీసులో వ్యాపించి గ్రీకుజాతిని దుర్బలము చేసినదట. గ్రీకుపతనమున కిది యొక కారణముగా చెప్పుదురు. అది యూహమాత్రమే. దాని నిజానిజము లెవరికిని తెలియవు.

కొద్దికాలమే నిలిచిన అలెగ్జాండరుసామ్రాజ్య మంతరించినది. దాని స్థానే చిన్న సామ్రాజ్యములు పెక్కులు తలయెత్తినవి. వాటిలో టోలెమీక్రింద ఈజిప్టుసామ్రాజ్య మొక్కటి; సెల్యూకసు క్రింద పశ్చిమ ఆసియా సామ్రాజ్య మొక్కటి. టోలెమీ, సెల్యూకసులు అలెగ్జాండరు సేనానులు. సెల్యూకసు ఇండియాలో కాలుపెట్టుటకు ప్రయత్నించెను కాని ఇండియా తిరగబడి దెబ్బతీయగలదని విషాదముతో నతడు గ్రహించెను. ఉత్తర, మధ్య హిందూస్థానములలో చంద్రగుప్తమౌర్యుడు ప్రబలరాజ్యమును స్థాపించెను. చంద్రగుప్తుని గూర్చియు, ప్రసిద్ధుడగు అతని బ్రాహ్మణమంత్రి చాణక్యునిగూర్చియు, చాణక్యుని అర్థశాస్త్రమును గూర్చియు నీ కిదివరలో వ్రాసియుంటిని. 2200 సంవత్సరములకు పూర్వము ఇండియాపరిస్థితు లాగ్రంథమునుండి సుస్పష్టముగా మనము గ్రహించగలుగుచున్నాము.

సింహావలోకనము పూర్తియైనది. తరువాతి జాబులో మౌర్య సామ్రాజ్యకథను, అశోకుని కథను ఎత్తుకొందును. 25-1-31 తేదీని, 14 నెలలకు పూర్వము ఈ విషయములనుగూర్చి వ్రాసెదనంటిని. ఆమాట చెల్లించవలసియున్నది.

## 24

# దేవానాంప్రియుడైన అశోకుడు

మార్చి 30, 1932.

నేను రాజులను, రాజపుత్రులను తూలనాడుచున్నానేమో యని భయపడుచున్నాను. వారిని మెచ్చుకొనుటకుగాని, వారిని పూజించుటకు

గాని వారిలో నాకేమియు కనిపించుటలేదు. ఇప్పుడు మన మొక పురుషుని ప్రశంస ఎత్తుకొనుచున్నాము. అతడు రాజు, చక్రవర్తి. అయినప్పటికిని గొప్పవాడు. స్తోత్రార్హుడు. అతడు అశోకుడు. చంద్రగుప్తమౌర్యుని మనుమడు. హెచ్. జి. వెల్సు (అతని నవలలు నీవు కొన్ని చదివి యుందువు) తాను వ్రాసిన "చరిత్ర సంగ్రహము"లో అశోకునిగూర్చి ఇట్లు వ్రాసెను: "చరిత్రవీథులలో గుమిగూడియున్న వేలకొలది చక్రవర్తుల పేళ్ళలో, రాజప్రతాపు లనియు, అనుగ్రహపూర్ణులనియు, శాంత స్వరూపు లనియు, రాజమార్తాండులనియు మొదలగు బిరుదుల ధరించిన చక్రవర్తుల పేళ్ళలో అశోకుని పేరు ప్రజ్వరిల్లుచున్నది. ఒంటరిగా ప్రజ్వరిల్లుచున్నది. నక్షత్రమువలె ప్రజ్వరిల్లుచున్నది. వాల్గా మొదలు జపాను వరకు అతని నింకను కీర్తించుచున్నారు. చీనా, టిబెట్టు దేశములలో మహాపురుషునిగా నాతని గణింతురు. అతని మతసిద్ధాంతములను వదలి పెట్టినప్పటికిని ఇండియాయు ఆతనిని మహాపురుషునిగా గణించుచున్నది. నేడున్న జనులలో కాన్స్టాంటయిన్, చార్లీమేనుల పేర్లు విన్నవారు కొద్దిమందే. కాని అశోకుని పేరు "తలచుకొని తలయూపనివారు బహుతక్కువ."

ఇది గొప్ప స్తోత్రమే. కాని ఇట్టి స్తోత్రమునకు అశోకుడు తగును. హిందూదేశచరిత్రలో ఈ కాలభాగమును స్మరించుట ప్రతి భారతీయునకును ప్రత్యేకముగా ఆనందదాయకము.

క్రీస్తుశక ప్రారంభమునకు 300 సంవత్సరముల పూర్వము చంద్రగుప్తుడు మరణించెను. తరువాత అతని పుత్రుడు బిందుసారుడు రాజయ్యెను. 25 సంవత్సరము లాతడు శాంతముగా రాజ్యపాలనము చేసినట్లు తోచుచున్నది. గ్రీసుప్రపంచముతో నాతడు సంబంధము నిలుపుకొనెను. ఈజిప్టులోని టోలెమీనుండియు, పడమటి ఆసియానుండి సెల్యూకసు కుమారుడగు అంటియోకసునుండియు రాయబారులు అతని కొలువులో నుండెడివారు. బాహ్యప్రపంచముతో వర్తకవ్యాపారములు జరుగుచుండెను. ఈజిప్టుదేశస్థులు ఇండియాలో తయారైన నీలిరంగుతో తమ

బట్టలకు రంగులు వేసికొనెడివా రని చెప్పుదురు. ఇండియాలో తయారైన మస్లినుగుడ్డతో రక్షితమృతకళేబరములను కప్పెడివారనికూడ చెప్పుదురు. మౌర్యయుగమునకు పూర్వమందే బీహారులో ఒకవిధమగు గాజు తయారగుచుండె నని అచ్చట దొరికిన ప్రాచీన శిలములనుండి విశదమగుచున్నది.

చంద్రగుప్తుని కొలువుకూటమునకు గ్రీకురాయబారిగా వచ్చిన మెగాస్థనీసు భారతీయులనుగూర్చి వ్రాయుచు వారు అలంకరణ ప్రియులనియు, సౌందర్యమును ప్రేమించువారనియు తెలిపెను. పొడవును వృద్ధిచేసికొనుటకు వా రొకవిధమగు పాదరక్షలను ధరించెడివారట. ఎత్తు మడమల జోళ్ళు ఈనాటి విశేషము మాత్రము కాదు.

క్రీ. పూ. 268 సంవత్సరమున బిందుసారుని తరువాత అశోకుడు మహాసామ్రాజ్యమునకు చక్రవర్తి యయ్యెను. ఉత్తరహిందూస్థానము, మధ్యహిందూస్థానము ఆ సామ్రాజ్యభాగములే. మధ్యఆసియావరకు అది విస్తరించియుండెను.

ఆగ్నేయ దక్షిణదిక్కులందున్న మిగతదేశభాగములను సామ్రాజ్యములో కలుపుకోవలెనని కాబోలు అశోకుడు, రాజ్యమునకు వచ్చిన తొమ్మిదేండ్లకు కళింగదేశమును జయించ పూనుకొనెను. కళింగదేశము ఇండియాకు తూర్పుతీరమున, మహానది, గోదావరి, కృష్ణానదుల మధ్య నున్నది. కళింగదేశస్థులు ధైర్యముగా పోరాడిరి. కాని చివరకు పరాజితులైరి. దారుణహత్యలకు వారు లోనైరి. ఈ యుద్ధమును, ఈ హత్యలును అశోకుని మనస్సును కలచివేసెను. యుద్ధమన్నను,యుద్ధకార్యములన్నను అతనికి రోత పుట్టినది. ఇకముందు యుద్ధముచేయరా దని యతడు సంకల్పించుకొనెను. దక్షిణమున చిన్న భాగము తప్ప హిందూదేశమంతయు దాదాపు అతని పాలనలో నుండెను. ఈ చిన్నభాగమును అతడు సులభముగా జయించియుండును. కాని అతడాపని చేయలేదు. హెచ్. జి. వెల్సు చెప్పినట్లు - విజయమునందినపిమ్మట యుద్ధమును తలపెట్టని చతురంగబలసమేతుడగు చక్రవర్తి అశోకు డొక్కడే.

అదృష్టవశాత్తు, అశోకుని ఆలోచనలను, అతని కార్యములను వెల్లడిచేయు అశోకుని సొంతమాటలే మనకు లభించుచున్నవి. శిలల మీదను, లోహముమీదను చెక్కిన అనేక రాజశాసనములలో అతడు తన ప్రజలకును, భావికాలమువారికిని అందజేసిన సందేశములు మనకు లభించుచున్నవి. అలహాబాదుకోటలో అశోకుని శాసనస్తంభము ఉన్నట్లు నీకు తెలియును. మన రాష్ట్రమున నట్టి వింకను ఎన్నో యున్నవి.

యుద్ధముచేసి విజయము సాధించునప్పుడు చేసిన హత్యల కాతడు పొందిన పశ్చాత్తాపమును, చెందిన రోతను ఈశాసనములద్వారా అశోకుడు ప్రకటనచేసెను. ఆత్మవిజయమే నిజమగు విజయము; ధర్మముతో మానవుల హృదయములను చూరగొనుటయే నిజమగు విజయము అని యాతడు చెప్పెను. కొన్ని శాసనములను నీకొరకై యిం దుదాహరించెదను. అవి చదువుట కెంతో మనోహరముగా నుండును. అశోకుడు నీ సమీపమునకు వచ్చును.

ఒక రాజశాసన మీవిధముగా నున్నది:

"సింహాసన మెక్కి ఎనిమిది సంవత్సరములైన పిమ్మట శ్రీ మహారాజులుంగారు కళింగదేశమును జయించిరి. అప్పుడు లక్షఏబదివేల జనులు మాకు బందీలైరి. లక్షజనము హతము గావింపబడిరి. ఎన్నిలక్షలమందో మడిసిరి. కళింగదేశమును తమ సామ్రాజ్యములో కలుపుకొన్న పిమ్మట శ్రీ మహారాజులుంగారు ధర్మము నభిమానింప ప్రారంభించిరి. ధర్మమును త్రికరణశుద్ధిగా రక్షింప పూనుకొనిరి. ధర్మమును బోధింపదొరకొనిరి. కళింగదేశమును జయించినందుకు పశ్చాత్తాప మప్పుడు శ్రీ మహారాజులుంగారికి కలిగినది. ఎందువల్ల ననగా, అంతకుపూర్వము జయింపబడని దేశమును జయించుటవల్ల ఎందరినో చంపవలసివచ్చును. ఎందరో మరణింతురు. ఎందరో బందీలగుదురు. అందువల్ల శ్రీమహారాజులుంగారికి అమితముగా విచారము, దుఃఖము కలిగినవి."

కళింగములో హతులైనట్టియు, బంధితులైనట్టియు జనుల సంఖ్యలో నూరవవంతుగాని, వేయవవంతుగాని జనులు హతులగుట

గాని, బంధితులగుటగాని అశోకు డికముందు సహింపడని ఆ రాజ శాసనము చెప్పుచున్నది.

"అంతేకాదు. ఎవ్వరైనను శ్రీ మహారాజులుంగారికి అపకారము చేసిన భరించగలిగినంతవరకును వారు దానిని కూడ భరించవలెను. తన సామ్రాజ్య మందలి అడవులలో నివసించు కిరాతులనునైతము శ్రీ మహారాజులుంగారు దయతో చూతురు. వారి బుద్ధులు సన్మార్గము ననుసరించునట్లు ప్రయత్నింతురు. అట్లు చేయకున్న శ్రీ మహారాజులుంగారు పశ్చాత్తాపము నొందుదురు. ప్రాణి కోటి కంతకును భద్రత, ఆత్మనిగ్రహము, మనశ్శాంతి, ఆనందము ఉండవలె నని శ్రీ మహారాజులుంగారి అభిలాష."

ధర్మముతో మానవుల హృదయములను జయించుటయే నిజమైన విజయ మనియు, తన సామ్రాజ్యమందును, దూరరాజ్యములందును కూడ అట్టి నిజవిజయముల ననేకము పొందినట్లును అశోకుడు చెప్పుచున్నాడు. ఈ శాసనములలో పేర్కొన్న ధర్మము బుద్ధధర్మము. అశోకుడు బౌద్ధ డయ్యెను. ఆమతము నత డమితముగా ప్రేమించెను. ఆ ధర్మమును వ్యాప్తినందింప శాయశక్తుల పనిచేసెను. అధికారము చలాయించి కాని, బలవంతము చేసికాని అట్టిపని చేయలేదు. హృదయములను జయించియే మానవులను తన మతములో కలుపుకొన నతడు ప్రయత్నించెను. అశోకుడు చూపినంత సహనమును చూపిన మతావలంబులు కొద్ది, బహు కొద్ది. తమతమ మతములకు మనుష్యులను త్రిప్పుకొనుటకు వారు బలా త్కారము చేయుటకుగాని, పీడించి బాధపెట్టుటకుగాని, మోసగించుటకు గాని జంకలేదు. మతముపేర చేసిన హింసలతోను, మతముపేర చేసిన యుద్ధములతోను చరిత్రయంతయు నిండియున్నది. మతముపేరను, భగ వంతునిపేరను జరిగిన రక్తపాతము మరి దేనిపేరను జరుగలేదు. అందువల్లనే భారతదేశమునకు జన్మించిన ఉత్తమపుత్రుడు, తీవ్రమతదీక్ష కలవాడు, ప్రబలసామ్రాజ్యమున కధిపతి, అన్యమతములవారిని తన మతమునకు త్రిప్పుకొనుట కెట్లు ప్రవర్తించెనో జ్ఞాపకముంచుకొనుట మంచిది. ఖడ్గమును చూపి మతమును మార్పించవచ్చు ననుకొను మూర్ఖు లుండుట వింతయే.

దేవతలకు ప్రియుడైన అశోకుడు—శాసనములలో దేవానాంప్రియుడు అని ఉన్నది—తన దూతలను, రాయబారులను ఆసియాలోని పడమట నున్న రాజ్యములకును, యూరోపుకును, ఆఫ్రికాకును పంపెను. సింహళమునకు తన సొంతసోదరుడగు మహేంద్రుని, సోదరియగు సంగమిత్రను పంపెను. వారు తమతోకూడ గయనుండి పవిత్రమగు అశ్వత్థవృక్షశాఖను గొంపోయిరట. అనూరాధపురములో దేవాలయము నందు మనము చూచిన రావిచెట్టు నీకు జ్ఞాపకమున్నదా? ఆనాటి శాఖయే నేటి ఆ వృక్షముగా పెరిగిన దని మనము వింటిమి.

హిందూదేశమున బౌద్ధమతము శీఘ్రముగా వ్యాపించెను. ధర్మ మన్నప్పుడు అశోకుని యభిప్రాయము వట్టి ప్రార్థనలను పునశ్చరణ చేయుటగాని, పూజలు మున్నగునవి చేయుటగాని కాదు. సత్కార్యము లాచరించుట, సంఘము నుద్ధరించుట అతని యభిప్రాయము. అందువల్లనే దేశమందంతటను ప్రజలకొరకై ఉద్యానవనములు, వైద్యశాలలు, బావులు, బాటలు నిర్మింపబడినవి. స్త్రీ విద్యకు ప్రత్యేకముగా ఏర్పాట్లు చేయబడెను. నాలుగు గొప్ప విశ్వవిద్యాలయములు నాలుగు పట్టణములలో లేచినవి. ఉత్తరమున పెషావరువద్దనున్న తక్షశిల, లేక టాక్సిలా ఒకటి; మధుర ఒకటి(దీనిని ఇంగ్లీషువారు అసభ్యముగా ముట్రాయని వ్రాయుదురు);మధ్య ఇండియాలోని ఉజ్జయిని ఒకటి;బీహారులో పాట్నావద్దనున్న నలందా ఒకటి. ఇండియాలోని విద్యార్థులే కాదు. చీనామొదలు పశ్చిమ ఆసియావరకు గల దూరదేశములనుండి కూడ విద్యార్థులు ఈ విశ్వవిద్యాలయములలో విద్య గరచుచుండిరి. బుద్ధుని మతబోధల నీవిద్యార్థులు తమ మాతృదేశములకు గొంపోవుచుండిరి. దేశమందంతటను గొప్ప సన్యాసి మఠములు లేచినవి. వీనిని విహారము లందురు. పాటలీపుత్రము చుట్టు పట్ల ఎన్నో విహారములు లేచుటచే ఆ రాష్ట్రమున కంతకును విహార మను పేరు వచ్చెను. అదియే నేటి బీహారు. బౌద్ధబోధలవల్ల కలిగిన తొలినాటి ఆవేశము నశించుటచే ఆ విహారములు వాడుకప్రకారము

పూజాదులసల్పు బౌద్ధుల సమావేశస్థలములుమాత్ర మయ్యెను. ఇట్లు జరుగుట సామాన్యమేకదా.

ప్రాణరక్ష చేయవలె నను అశోకుని ఆకాంక్ష జంతువులనుసైతము విస్మరించలేదు. జంతువులకొరకు ప్రత్యేకవైద్యశాలలు నెలకొల్పబడినవి. పశుయజ్ఞములు నిషేధింపబడెను. ఈ రెండు విషయములందును అశోకుడు మన కాలమును దాటికూడ కొంత ముందుకు పోయినాడు. పశుయజ్ఞములు కొంతవరకు నేడు వ్యాప్తిలో నున్నవి. మతమునకు ప్రధానాంగముగా నవి భావింపబడుచున్నవి. జంతురోగనివారణకు వైద్యశాల లంతగా నేడు లేవు.

అశోకుని ఆచరణప్రభావమువల్లను, బౌద్ధమత వ్యాప్తివల్లను శాకాహారము జనసమ్మతమైనది. అప్పటివరకును బ్రాహ్మణులును, క్షత్రియులును మాంసమును తిని మద్యము త్రాగుచుండిరి. నాటినుండి మాంసభోజనము, మద్యపానము తగ్గిపోయినవి.

ఈవిధముగా అశోకుడు 38 సంవత్సరములు, శాంతముగా ప్రజాహితకార్యముల నాచరించుచు, రాజ్యము చేసెను. ప్రజల మొరలు వినుట కాత డెప్పుడును సిద్ధముగానుండెను. "అన్నివేళల, అన్నిస్థలముల, భోజనముచేయుచున్నను, అంతఃపురమునం దున్నను, పడకగదియం దున్నను, దేహబాధ తీర్చుకొనుచున్నను, రథమునందున్నను, ఉద్యానములందున్నను, ప్రతీహారులు ప్రజల మొరలను నిరంతరము వాచెవిని వేయుచుండవలెను." ఎట్టికష్టమైనను తటస్థించినప్పుడు వెంటనే "ఏవేళయందైనను, ఏస్థలమునందైనను" అతనికి వార్త తెలియజేయవలసినదే. "ప్రజాసౌఖ్యమునకు నేను పనిచేసితీరవలెను" అని అతడన్నాడు.

క్రీ. పూ. 226 సం॥ న అశోకుడు కీర్తికాయు డయ్యెను. మరణమునకు పూర్వ మాతడు బౌద్ధభిక్షు డయ్యెను.

మౌర్యకాలమునాటి శిథిలములు మన కంతగా లేవు. ఇండియాలో ప్రాచీనకాలమునాటి ఆర్యుల నాగరికతకు సంబంధించినవే మనకు దొరికి

నవి. దొరికినవాటిలో అవియే ప్రాచీనతమమైనవి. ప్రస్తుతము మొహెంజొదారో శిథిలములనుగూర్చి నేను చెప్పుటలేదు. వారణాసిసమీపమున నున్న సారనాథములో అందమగు అశోక స్తంభమును, దానిపై చెక్కిన సింహములను నీవు చూడవచ్చును.

అశోకుని రాజధానియగు పాటలీపుత్రములో శిథిలము లేమియు లేవు. అశోకుడు మరణించినతరువాత 600 సంవత్సరములకు—అనగా 1500 సంవత్సరములకు పూర్వము, చీనాయాత్రికు డగు ఫాహియాన్ పాటలీపుత్రమును దర్శించెను. అప్పు డది ఉచ్ఛస్థితిలోనే ఉండెను. భోగభాగ్యములతో తులతూగుచుండెను. అప్పుడుసైతము అశోకుని శిలా ప్రాసాదము శిథిలావస్థలో నుండెను. ఆ శిథిలములను చూచి ఫాహియాన్ ముగ్ధుడయ్యెను. అతడువ్రాసిన యాత్రా వృత్తాంతములో ఆ ప్రాసాదము మానవుల పనిగా కనబడలేదని వ్రాసికొనెను. శిలానిర్మితమగు ప్రాసాదము కాలగర్భమున నంతరించినది. దాని జాడయైన నిలువలేదు. కాని అశోకుని స్మృతి ఆసియాఖండమంతటను నలముకొన్నది. అతని శాసనములు మన మర్థముచేసికొని మెచ్చుకొనగలిగిన వాక్యములతో మనతో నేటికిని భాషించుచున్నవి. వానినుండి మనము నేర్చుకొనవలసిన దింకను ఎంతయో కలదు. ఈజాబు పెరిగినది. నీకు విసుగుపుట్టించునేమో. అశోకుని శాసనములలోని క్రింది వాక్యములతో జాబును ముగింతును:

> "ఏదోయొక కారణమును పురస్కరించుకొని అన్ని మతములను గౌరవింపవలసినదే. అట్లాచరించు మనుష్యుడు తన మతము నుత్కృష్టము చేసికొనుచున్నాడు. ఇతరమతములకు మేలుచేయుచున్నాడు."

## 25

# అశోకుని కాలమునాటి ప్రపంచము

మార్చి 31, 1932.

అశోకుడు ప్రచారకులను, రాయబారులను దూరదేశములకు పంపియుండెననియు, ఇండియా యూదేశములతో వర్తకముచేయుచు సంబం

ధము కలిగియుండె ననియు తెలిసికొంటిమి. ఆరోజులలో సంబంధములు పెట్టుకొనుట, వర్తకముచేయుట అన్నప్పుడు ఇప్పుడు ఈకాలమున నున్నట్లు కాదని నీవు గుర్తించవలెను. ఈరోజులలో రైళ్ళమీదను,స్టీమర్ల మీదను, విమానములమీదను మనుష్యులును, వర్తకపు సరుకును సులభముగా పోవచ్చును. కాని ఆరోజులలో ప్రతిప్రయాణమును దీర్ఘకాలము పట్టుచుండెను. ప్రమాదకరమైయుండెను. సాహసికులును, బలాఢ్యులును మాత్రమే అట్టి ప్రయాణములు చేయుచుండిరి. కాబట్టి ఆకాలమునాటి వర్తకమునకును. ఈ కాలమునాటి వర్తకమునకును పోలికయే లేదు.

అశోకుడు చెప్పిన ఈ "దూరదేశము" లేమి? అతని కాలమున ప్రపంచ మెట్లుండెను? ఈజిప్టు, మధ్యధరాసముద్రతీరముతప్ప ఆఫ్రికాను గురించి మన కేమియు తెలియదు. ఉత్తర, మధ్య, తూర్పుయూరోపును గురించి, ఉత్తర మధ్యఆసియానుగురించి మనకు తెలిసినది బహుకొద్ది. అమెరికానుగూర్చికూడ మన కేమియు తెలియదు. ప్రాచీనకాలము నుండియు అమెరికాఖండములందు బాగుగా వికసించిన నాగరికతలు కలవని విశ్వసించువారు పెక్కురు గలరు. ఎంతోకాలమునకు పిదప—క్రీ. వె. 15 వ శతాబ్దిలో—కొలంబసు అమెరికాను కనిపెట్టె నని చెప్పుదురు. అప్పుడు దక్షిణ అమెరికాలోని పెరూలోను, పరిసరదేశములందును అత్యున్నతనాగరికత యుండెనని మనకు తెలియును. క్రీ. పూ. మూడవ శతాబ్దిలో ఇండియాలో అశోకుడు పాలించుచున్నప్పుడు అమెరికాలో సంస్కారులగు ప్రజ లుండెడివారనియు, వారు సక్రమపద్ధతిని సంఘముల నేర్పరచుకొని యుండిరనియు ఊహించవచ్చును. కాని వారినిగూర్చి యథార్థవిషయములు మనకు తెలియవు. ఊహించి లాభములేదు. నే నీ విషయము నెత్తుటకు కారణ మేమనగా, మనము విన్నట్టియు, చదివినట్టియు భూభాగములందు మాత్రమే నాగరీకు లున్నారని మనము పొరబడవచ్చును. చాలకాలమువరకు యూరోపుదేశస్థుల ఊహలో—ప్రాచీన చరిత్ర యనగా గ్రీసుయొక్కయు, రోముయొక్కయు, యూదుల

యొక్కయు చరిత్రయే. వారి ప్రాతకాలపు ఊహల ప్రకారము, మిగత ప్రపంచమంతయు ఆరోజులలో వట్టి అడవిమాత్రమే. వారి పండితులును,




వారి పురావస్తు శాస్త్రజ్ఞులును చీనాను, ఇండియాను, ఇంకను ఇతరదేశములనుగూర్చి వారితో చెప్పినప్పుడు తమ జ్ఞాన మెంత పరిమితమైనదో అప్పుడు తెలిసికొనిరి. కాబట్టి మనము జాగ్రత్తగా నుండవలెను. ఈ

మన ప్రపంచములో జరిగిన యావద్విషయములును మన పరిమితజ్ఞానములో ఇమిడిఉన్నవని తలచరాదు.

అశోకునినాటి ప్రాచీననాగరీక ప్రపంచము—క్రీ. పూ. 3-వ శతాబ్దిలో—ముఖ్యముగా యూరోపు ఆఫ్రికా ఖండములందలి మధ్యధరా దేశములు; పశ్చిమఆసియా, చీనా, ఇండియామాత్రమే నని ప్రస్తుతము మన మనుకొనవచ్చును. పశ్చిమదేశములకును, చీనాకును బహుశా ప్రత్యక్షసంబంధ ముండుటకు వీలులేకపోయెను. పశ్చిమఆసియాతో సైతము చీనా సంబంధము పెట్టుకొన వీలులేకుండెను. చీనానుగురించి పశ్చిమదేశములలో విపరీతాభిప్రాయములు ప్రబలియుండెను. చీనాను ఆకాలమున కాథే అనువారు. పశ్చిమదేశములకును, చీనాకును మధ్య ఇండియా సంబంధ మేర్పరుచుచుండెను.

అలెగ్జాండరుమరణానంతర మాతని సేనాపతులు అతని సామ్రాజ్యమును పంచుకొనిరని ఇదివరలో తెలిసికొంటిమి. అందు ప్రధాన భాగములు మూడు: (1) పశ్చిమ ఆసియా, పర్షియా, మెసపొటేమియా—ఇవి సెల్యూకస్ వశమయ్యెను (2) ఈజిప్టు— ఇది టోలెమీవశమయ్యెను (3) మాసిడోనియా—ఇది అంటియోకసు వశమయ్యెను. మొదటి రెండును చిరకాలము నిలిచినవి. సెల్యూకసు ఇండియాకు పొరుగున నుండి ఇండియాలో కొంతభాగము తన సామ్రాజ్యములో కలుపుకొన ప్రయత్నించినట్లు నీవు తెలిసికొనియుంటివి. కాని చంద్రగుప్తు డతనికి మించిన యోధుడు. చంద్రగుప్తు డతనిని వెనుకకు తరిమి, నేటి అఫ్ఘనిస్థానము నతనినుండి గ్రహించెను.

మాసిడోనియా కంతటియదృష్టము పట్టలేదు. ఉత్తరదిక్కునుండి గాలు (Gauls) లను వారును, ఇతరులును దానిని కొల్లగొట్టుచుండిరి. ఈ రాజ్యమున నొక భాగముమాత్రమే గాలుల దాడిని తట్టుకొని స్వతంత్రముగా నిలువగలిగినది. ఇది ఆసియా మైనరులోనున్న పెర్గామం. నేడు టర్కీ ఉన్నతావున నది యుండెను. అది చిన్న గ్రీకునగరరాష్ట్రము.

కాని నూరుసంవత్సరములపై చిల్లరవరకు గ్రీకు సంస్కృతికిని, గ్రీకు లలితకళలకును అది నిలయమైనది. అందమైన భవనములు లేచినవి. పుస్తకభాండాగారము, వస్తు ప్రదర్శనశాల వెలసినవి. సముద్రమున కావలనున్న అలెగ్జాండ్రియాతో ఇది కొంతవరకు తులతూగుచుండెను.

ఈజిప్టులో టోలెమీల రాజధాని అలెగ్జాండ్రియా పట్టణము. అది మహానగరమై ప్రాచీనప్రపంచమున ప్రసిద్ధిగన్నది. ఏథెన్సుఉన్నతి సన్నగిలిపోయెను. అలెగ్జాండ్రియా దాని స్థానము నాక్రమించెను. అది గ్రీకుల సంస్కృతికి కేంద్రమయ్యెను. అచ్చటి పుస్తకభాండాగారము, వస్తుప్రదర్శనశాల దూరదేశముల విద్యార్థుల ననేకుల నాకర్షించెను. వారు తత్త్వశాస్త్రము, గణితము, మతములనుగూర్చియు ప్రాచీనప్రపంచప్రజల మనస్సులను కదిపిన యితరసమస్యలను గూర్చియు చర్చించుకొనుచుండిరి. యూక్లిడుపేరు నీవును, బడికిపోవు బాలబాలికలును వినియుందురు. అతడు అలెగ్జాండ్రియా నివాసి; అశోకుని సమకాలికుడు.

టోలెమీలు గ్రీకులు. కాని వారు ఈజిప్టుదేశీయుల ఆచారవ్యవహారముల నవలంబించిరి. ఈజిప్టులో కొలుచు ప్రాచీనదేవతలనుకూడ కొలువ మొదలిడిరి. జూపిటరు, అపాల్లో, ప్రాచీనగ్రీకుల ఇతరదేవుళ్లు, దేవతలు హోమరుమహాకావ్యములలో పెక్కుసారులు పేర్కొనబడిరి. మహాభారతములోని వేదకాలమునాటి దేవుళ్ల వలెనే ఈ దేవుళ్లను మూలకొాదుగ వలసివచ్చినది. లేదా, పేర్లు మార్చుకొని క్రొత్తవేషములతో కనబడవలసి వచ్చినది. ప్రాచీన ఈజిప్టులోని దేవుళ్లను దేవతలును—ఈసిస్, ఓసిరిస్, హోరస్—ప్రాచీన గ్రీసులోని దేవుళ్లను దేవతలును కలిసిపోయిరి. ఇట్లు మిశ్రమైన నూతనదేవతలను ప్రజలు కొలుచుచుండిరి. ఎవరికి శిరస్సువంచి పూజలు చేసిన నేమి? ఆ దేవతల కే పేళ్లున్న నేమి? వారు పూజచేయుట కేదోయొకటి యున్న వారికి చాలును! నూతనదేవుళ్ళలో ప్రసిద్ధిగన్న దేవుని పేరు సిరపీస్.

అలెగ్జాండ్రియా గొప్ప వర్తకకేంద్రముకూడ. ఇతర నాగరిక దేశములనుండి వర్తకు లచ్చటికి వచ్చుచుండిరి. అలెగ్జాండ్రియాలో హిందూ.

దేశ వర్తకుల వలస యున్నదని చెప్పుదురు. అలెగ్జాండ్రియావర్తకులు దక్షిణఇండియాలో మలబారుతీరమున నివాసమేర్పరుచుకొన్నట్లుకూడ మనకు తెలియును.

ఈజిప్టుకు అనతిదూరమున, మధ్యధరాసముద్రమున కావల రోము నగర మున్నది. అప్పటికే అది గొప్పనగరమైనది. అది ఇంకను ప్రబలమై ఉచ్చస్థితి నందవలసియున్నది. దాని కెదురుగా, ఆఫ్రికా తీరమున, దాని శత్రువును, దానితో స్పర్ధవహించినదియు అగు కార్తేజి ఉన్నది. ప్రాచీన ప్రపంచముయొక్క నిజస్వరూపమును తెలిసికొనుటకు వాటి చరిత్రలు మనము కొంత విపులముగా తెలిసికొనవలెను.

పడమట రోము గన్న ప్రసిద్ధి తూర్పున చీనా పొందుచుండెను. అశోకుని కాలమునాటి ప్రపంచస్వరూపము మనము గ్రహించుటకు చీనా చరిత్రకూడ మనము తెలిసికోవలెను.

## 26

## చిన్లు, హాన్లు

ఏప్రియల్ 3, 1932.

నాయినీనుండి నిరుడు నేను వ్రాసిన జాబులలో చీనా తొలిరోజు లనుగురించియు, హోయాంగ్ హోనది మీద ఏర్పరుచుకొన్న నివాస భూములను గూర్చియు, తొలి రాజవంశములగు హిసియా, షాంగ్ లేదా ఇన్,చౌలను గూర్చియు కొంత వ్రాసియుంటిని.చీనారాజ్య మెట్లు అభివృద్ధి జెందినదో, ఆ విశాల కాలభాగములలో కేంద్రీకృత ప్రభుత్వ మెట్లు వికసించినదో కూడ కొంత వ్రాసియుంటిని. పేరుమట్టుకు మాత్ర మింకను చౌరాజవంశము పాలనము చేయుచున్నది. తరువాత వచ్చిన దీర్ఘకాలములో కేంద్రీకృతత్వ మాగిపోయినది. ప్రభుత్వ క్రమపద్ధతికి భంగము వాటిల్లెను. ఆయా ప్రాంతములందున్న క్షుద్రపాలకులు స్వతంత్రులైరి. ఒకరితోనొకరు కలహించుచుండిరి. పెక్కువందల సంవత్సరములవరకు

నిట్టి దౌర్భాగ్య పరిస్థితులు దేశమున చెలరేగెను. చీనాలో ప్రతివిషయ మును వందలు, లేక వేల సంవత్సరముల కాలములో లెక్కించవలసి యుండును. చివరకు ఒక స్థానికపాలకుడు, చిన్ ప్రభువు, సారహీన మైన ప్రాచీన చౌరాజవంశమును తుదముట్టించ గలిగెను. అతని వంశీ కులను చిన్‌రాజవంశమువా రందురు. చీనా అను పేరు చిన్‌నుండి వచ్చినది సుమా.

క్రీ. పూ. 255 సంవత్సరములో చిన్‌లు పరిపాలనము ప్రారం భించిరి. అంతకు పదమూడు సంవత్సరములకు పూర్వము ఇండియాలో అశోకుని రాజ్యపరిపాలనము ప్రారంభమాయెను, కాన చీనాలోని అశోకుని సమకాలికులను గూర్చి ఇప్పుడు మనము ప్రసంగించుకొనుచున్నాము. మొదటి ముగ్గురు చిన్ చక్రవర్తులును స్వల్పకాలమేరాజ్యముచేసిరి. పిమ్మట క్రీ. పూ. 246 సంవత్సరమున నాల్గవచక్రవర్తి వచ్చెను. అత డొక అసా ధారణ పురుషుడు. అతని పేరు వాంగ్‌చంగ్. కొంతకాలమున కతడు వేరొక పేరు పెట్టుకొనెను. అది షీ హుయాంగ్‌టీ. అతని రెండవపేరే ప్రసిద్ధికి వచ్చినది, దాని యర్థము "ప్రథమ చక్రవర్తి". తన్నుగూర్చియు, తన కాలమునుగూర్చియు అతడు గొప్పగా భావించెడివాడని తోచును. గత కాలమును గౌరవించువాడు కాడతడు. ఇంతేకాదు. గత కాలమును మరచి పొమ్మని ప్రజల నాతడు కోరెను. తనతో, అనగా ఘనుడగు ప్రథమచక్ర వర్తితో చరిత్ర ప్రారంభమైనదని భావించవలసినదిగా ప్రజల నాతడుకోరెను. అంతకు ముందు 2000 సంవత్సరములకు పైగా చీనాలో చక్రవర్తిపరంపర యున్నదన్నమాట అతనికి పట్టలేదు.వారినిగురించి ఎంతమాత్రముస్మరింప రాదనియే అతని యాదేశము. చక్రవర్తులనే కాదు. ప్రాచీనకాలమునాటి మహాపురుషులను సైతము మరచిపోవలెను. గతకాలచరిత్ర నుద్ఘాటించు గ్రంథములన్నిటిని - ముఖ్యముగా చరిత్రగ్రంథములను-కంఫ్యూసియసుకు సంబంధించిన గ్రంథరాజములను పూర్తిగా భస్మముచేసి నాశనము చేయ

వలసిన దని రాజాజ్ఞ జారీచేయబడెను. వైద్య గ్రంథములు, కొన్ని శాస్త్ర గ్రంథములు మాత్రము ఈ దుర్దశకు పాలుగానక్కరలేదు. శాసనములో నతడు చెప్పిన విషయ మేమనగా :

"అధునాతన కాలమును న్యూనపరచుటకు ప్రాచీనకాలము నుపయోగించు వారు బంధు సమేతముగా మరణదండనపాలు కావలెను."

అన్న ప్రకార మతడు చేసెను. తా మభిమానించు గ్రంథములను దాచుకొన్న విద్యావంతులు వందలకొలది ప్రాణములతో పాతిపెట్టబడిరి. ఈ ప్రథమ చక్రవర్తి ఎంతటి సరసుడు, ఎంతటి దయార్ద్ర హృదయుడు! ఇండియాయొక్క గతకాలము నతిమాత్రముగ ప్రశంసించుట నేను వినుట తటస్థించినప్పుడు అతనిని తలచుకొందును. కొంత సానుభూతితో తలచుకొందును. మనలో కొందరిదృష్టి ఎప్పుడును గతముమీదనే. వారు గతమునే స్తుతించుచుందురు. దానిని తలచుకొని ఆవేశము పొంద ప్రయత్నింతురు. ఘనకార్యములు చేయుటకు గతకాలము ప్రేరేపించినచో తప్పకుండ గతకాలమునుండి మన మావేశము నందవలసినదే. కాని నా దృష్టిలో మానవులుగాని, జాతులుగాని నిరంతరము వెనుకకు చూచుట ఆరోగ్యలక్షణము కాదు. ఎవరో చెప్పినట్లు—వెనుకకు పోవుటకుగాని, వెనుకకు చూచుటకుగాని మానవు డుద్దేశింపబడినట్లయితే అతని కన్నులు తలవెనుకనే యుండియుండును. తప్పకుండ మనము మన గతకాలమును గూర్చి తెలిసికొనవలసినదే, మెచ్చుకోదగ్గ విషయములను మెచ్చుకోవలసి నదే. కాని మన కనులెన్నడును ముందుకు చూడవలెను. మన అడుగు లెప్పుడును ముందుకు పడవలెను.

ప్రాతగ్రంథములను, వాటినిచదివినవారిని పాతిపెట్టించియు, తగుల బెట్టించియు షీ హుయాంగ్ టీ అనాగరికముగ ప్రవర్తించెను. అతడు చేసిన పనియంతయు అతనితోనే అంతరించుట దానికి ఫలితము. అతడు ప్రథమ చక్రవర్తి. అతని తరువాత రెండవ, మూడవ ఇత్యాదిగా చక్ర వర్తులు కాలాంతమువరకు పాలించవలెనని అతని ఉద్దేశము. అయినప్ప

టికిని చీనా నేలిన రాజవంశములలో చిన్ రాజవంశము మిక్కిలి కొద్ది కాలము మాత్రమే పాలించెను. పై రాజవంశములు వందలకొలది సంవత్సరము లేలియుండెనని నేను చెప్పియుంటిని. చిన్ల వంశమునకు ముందున్న వంశము 867 సంవత్సరములు పాలించెను. కాని చిన్ల వంశము తలయెత్తెను, విజయము సాధించెను, ప్రబల సామ్రాజ్యము నేలెను, క్షీణించెను, అంతరించెను— ఇదంతయును 50 సంవత్సరముల స్వల్పకాలములో జరిగెను. షీ హుయాంగ్‌టీ ప్రబలులగు చక్రవర్తుల పరంపరలో ప్రథముడై యుండవలసినదే కాని క్రీ. పూ. 209 సంవత్సరమున నతడు మరణించిన పిమ్మట మూడు సంవత్సరములలో అతని వంశ మంతరించెను. వెంటనే ప్రాచీన గ్రంథములు, కంఫ్యూసియసుకు సంబంధించిన గ్రంథరాజములు గుప్తస్థలములనుండి బయటికి వచ్చినవి. యథాప్రకార మవి తమ యున్నతస్థానమును పొందినవి.

చీనాను పరిపాలించిన రాజులందరిలోను ప్రబలుడు షీ హుయాంగ్‌టీ. స్థానికపాలకు లనేకుల గర్వము నాత డడంచెను. జాగీరుదారు పద్ధతిని (Feudalism) నాశనముచేసెను. బలమగు కేంద్ర ప్రభుత్వమును స్థాపించెను. అతడు చీనానంతయు జయించెను. అన్నామునుకూడ వశపరచుకొనెను. గొప్ప గోడను కట్టుటకు ప్రారంభించిన దతడే. ఇది చాల ఖర్చుతో కూడుకున్నపని. పరదేశ శత్రువులు తమపైబడకుండ రక్షించుకొనుటకై, పెద్ద సైన్యమును ఉంచుకొనుటకంటె గోడకట్టుటయే మంచిదని వా రనుకొనియుందురు. గొప్ప దండయాత్ర సీగోడ ఆపలేదు. కాని చిన్న దాడులను మాత్ర మది ఆపివేసినది. చీనాదేశస్థులు శాంతిని కోరిరనియు, బలవంతులైనప్పటికిని యుద్ధసంబంధమగు కీర్తిని వా రాసించలేదనియు దీనినిబట్టి మనము గ్రహింపవచ్చును.

షీ హుయాంగ్‌టీ, ప్రథమ చక్రవర్తి, మరణించెను. అతని తరువాత పరిపాలన చేయుటకు అతని వంశమున రెండవవాడు లేడయ్యెను. కాని అతని కాలమునుండియు చీనా ఎప్పుడును ఏకమైయుండుట నేర్చుకొన్నది.

పిమ్మట వేరొక రాజవంశము రంగస్థలమునకు వచ్చినది. అది హాన్ రాజవంశము. ఇది 400 సంవత్సరములు వెలిగినది. మొదటి పాలకులలో నొక చక్రవర్తిని కూడ ఉండెను. చక్రవర్తిపరంపరలో ఆరవవాడు వూ-టీ. అతడుకూడ చీనానేలిన మిక్కిలి సమర్థులు, కీర్తిశాలులు నగు చక్రవర్తులలో నొకడు. 50 సంవత్సరములకు పైబడి అతడు చక్రవర్తిగా రాజ్యమేలెను. ఉత్తరదేశముపై వరుసగా దాడులు సాగించుచున్న తార్తారుల నత డోడించెను. తూర్పున కొరియామొదలు పడమర కాస్పియన్ సముద్రము పర్యంతము చీనా చక్రవర్తి సర్వాధికారి. మధ్య ఆసియాలోని తెగలవారందరు అతనిని తమ ప్రభువుగా నంగీకరించిరి. ఆసియాపటమును చూడుము. క్రీస్తుపుట్టుటకు పూర్వము మొదటి రెండు శతాబ్దులలోను అతని పలుకుబడి ఎంతవరకు విస్తరించినదో, చీనాఅధికార మెట్టిదో కొంత గ్రహించగలవు. ఈ కాలమున రోము గొప్పతనమునుగూర్చి మన మెంతో చదువుదుము. ప్రపంచమునం దెల్ల రోము మిన్నయని భావించవచ్చును. రోమును "ప్రపంచముయొక్క యజమానురాలు" అందురు. అప్పటికి రోము గొప్పదే. ఇంకను గొప్పతనము సంపాదించుచున్నది. కాని చీనాసామ్రాజ్య మంతకన్న విశాలమైనది, ప్రబలమైనది.

బహుశా వూ-టీ కాలములో చీనా రోములు సంబంధ మేర్పరచుకొని యుండును. నేడు పర్షియా, మెసపొటేమియా లుండు స్థలములలో నివసించుచుండిన పార్థియనుల ద్వారా చీనా రోముల మధ్య వర్తకము సాగెను. కొన్నాళ్ళ తరువాత రోముకును, పార్థియా దేశమునకును యుద్ధము తటస్థించినప్పుడు వర్తక మాగిపోయెను. సముద్రమార్గముగుండ రోము తిన్నగా చీనాతో వర్తకముచేయ ప్రయత్నించెను. ఒక రోమన్‌నావ చీనా వచ్చెను. కాని ఇది జరిగినది క్రీస్తువెనుక 2వ శతాబ్దిలో. మన మింకను క్రీస్తుశకమునకు పూర్వమందున్న కాలముననే ఉన్నాము.

హాన్‌వంశము పాలించు కాలముననే బౌద్ధమతము చీనాకువచ్చెను. క్రీస్తుశక ప్రారంభమునకు ముందే చీనాలో బౌద్ధమతముసంగతి తెలియును. తరువాతి కాలములో ఆనాటి చక్రవర్తికొక స్వప్నము వచ్చినదట. స్వప్నములో 16 అడుగుల పొడుగుగల పురుషు డొకడతనికి కనిపించెనట. అతని శిరస్సుచుట్టును తేజ స్సావరించియున్నదట. నాటినుండియు చీనాలో బౌద్ధమతము వ్యాపింప దొడగెను. ఆ చక్రవర్తికా దృశ్యము పడమటిదిక్కున కనిపించుటచే ఆ దిక్కున కతడు దూతలను పంపగా వారు బుద్ధ విగ్రహమును, బౌద్ధ గ్రంథములను తమతో కూడ తెచ్చిరి. బౌద్ధమతముతోపాటు చీనాకు ఇండియాదేశపు లలితకళలు వచ్చినవి. చీనానుండి కొరియాకు, కొరియానుండి జపానుకు వారి ప్రభావము వ్యాపించెను.

హాన్ కాలమునకు సంబంధించిన మరిరెండు ప్రధాన విషయములు గమనింపతగినవి. కర్రదిమ్మలతో అక్షరములు అచ్చుగుద్దుట చీనాలో కనిపెట్టబడినది కాని 1000 సంవత్సరములవరకు దాని నంతగా వినియోగించలేదు. అయినప్పటికిని యూరోపుకన్న చీనా 500 సంవత్సరములు ముందున్నదన్న మాట.

ప్రభుత్వ శాఖలలో పనిచేయు ఉద్యోగస్థులకు పరీక్షలు పెట్టుట రెండవ విషయము. బాలబాలికలకు పరీక్షలన్న తలనొప్పి. వారికి నేను సానుభూతి చూపుదును. పరీక్షలుచేసి ఉద్యోగస్థులను నియమించు చీనాదేశస్థుల పద్ధతిమాత్రము ఆ రోజులలో అసాధారణమైనదే. మొన్నమొన్నటివరకు ఇతర దేశములలో తమ ఇష్టమునుబట్టి ఉద్యోగస్థులను నియమించుచుండిరి. ఒక ప్రత్యేక వర్గమునుండియో, వర్ణమునుండియో నియమించుచుండిరి. చీనాలో పరీక్షలో కృతార్థులైనవా రెవ్వరైనను ఉద్యోగస్థులు కావచ్చును. ఇది అత్యుత్తమ పద్ధతికాదు, నిజమే. కంఫ్యూసియస్ గ్రంథ రాజములలో నుత్తీర్ణుడైన వ్యక్తి మంచి ఉద్యోగస్థుడు కాకపోవచ్చును. ఇష్టాదులనుబట్టి ఉద్యోగము లిచ్చుటకన్న నిది మెరుగే. ఈపద్ధతి చీనాలో 2000 సంవత్సరముల కాలము నిలిచినది. ఈ మధ్యనే దాని నంతముచేసిరి.

# 27

# కార్తేజికి ప్రతికూలముగా రోము

ఏప్రియల్ 5, 1932

దూరప్రాచ్యమునుండి మన మిప్పుడు పశ్చిమదేశములకు పోయి రోముఅభివృద్ధిని గమనింతము. క్రీ. పూ. 8-వ శతాబ్దిలో రోమును ప్రతిష్ఠించిరని చెప్పుదురు. తొలి రోమను లార్యసంతతివారై యుండ వచ్చును. టైబరునది సమీపమున నున్న ఏడు కొండలమీద వారికి కొన్ని నివాసభూము లుండెను. ఇవి వృద్ధియై నగరమైనవి. ఈ నగరరాష్ట్రము అభివృద్ధిజెందుచు పోయెను, ఆనాటికానాడు విశాలమగుచు పోయిపోయి సిసిలీ కెదురుగానున్న మెస్సీనాకడనున్న దక్షిణాగ్రమువరకు ఇటలీలో వ్యాపించెను.

గ్రీసునగరరాష్ట్రములు నీకు జ్ఞాపకముండవచ్చు. ఎక్కడికి వెళ్ళి నను నగరరాష్ట్రముల భావమును గ్రీకులు తమతోకూడ తీసికొనిపోవు చుండిరి. మధ్యధరాసముద్రతీరమం దంతటను గ్రీకుల వలసలు, గ్రీకుల నగరరాష్ట్రములు నిండియున్నవి. ఇప్పుడు రోమునుగురించి మనము ప్రసంగించుకొనుచున్నవి వానికి భిన్నముగా నుండును, ప్రప్రథమమున, బహుశా రోము, నగరరాష్ట్రమువంటిదే అయియుండవచ్చును. కాని అది సమీపతెగల నోడించి త్వరలో వ్యాపించినది. రోమురాష్ట్రభూము లీవిధ ముగా పెరిగెను. ఇటలీలో ఎక్కువభాగము రోమురాష్ట్ర మయ్యెను, అంత పెద్దభూభాగము నగరరాష్ట్ర మనిపించుకొనదు. ఈ భూభాగము రోమునుండి పరిపాలింపబడుచుండెను. రోములో ఒక వింతమాదిరి దొరతన ముండెను. చక్రవర్తిగాని, రాజుగాని దానిని పాలించుట లేదు. నేటిమాదిరి ప్రజాప్రభుత్వము (Republic) అక్కడ లేదు. అయినను ఆ ప్రభుత్వము ఒకమాదిరి ప్రజాప్రభుత్వమే. భూస్వాములగు ధనిక

కుటుంబములు అందు అధికారము చలాయించుచుండెను. దేశమును పాలించునది సెనేటు (శిష్టసభ) అని చెప్పుదురు. ఎన్నుకోబడ్డ ఇద్దరు పురుషులు—వీరినే కాంసలులు అందురు—సెనేటును నియమింతురు. చాలకాలమువరకు ఉన్నతవంశస్థులే సెనేటులో సభ్యులై యుండిరి. రోమనుప్రజలు రెండుతెగలుగా నుండిరి. ధనికులగు ఉన్నతవంశస్థులు (Patricians) ఒకతెగ. వీరే సాధారణముగా భూస్వాములై యుండిరి. సామాన్య పౌరులు (Plebeians) రెండవతెగ. ఈరెండుతెగల పోరాటములతోనే, అనేకవందల సంవత్సరములపాటు, రోమనురాష్ట్ర చరిత్ర నిండిపోయినది. ఉన్నతవంశస్థుల చేతిలో అధికారమంతయు నుండెను. అధికారముతోనే ధనమును వచ్చును. సామాన్యజనులు సేవకులుమాత్రమే. వారి కధికారమును లేదు, ధనమును లేదు. అధికారమును సంపాదించుటకు సామాన్యజనులు పోరాటము సల్పుచునేయుందురు. దానికి ఫలితముగా కాలాంతమున వారికి అధికారలేశము లభించును. దీర్ఘమగు ఈ పోరాటములో సామాన్యజనులు ఒకవిధమగు సహాయనిరాకరణమును వినియోగించి విజయమును సాధించిరికూడ. వారందరును రోమును విడిచివెళ్ళి ఒక నూతననగరమున నివాసమేర్పరుచుకొనిరి. ఉత్తమ వంశస్థులు భీతావహులైరి. సామాన్యజనులు లేనిదే వారికి గడవదు. కాన వారితో రాజీచేసికొని కొన్ని చిన్న హక్కులను వారి కిచ్చిరి. క్రమముగా సామాన్యజనుడుకూడ ఉన్నతోద్యోగము చేయ సాధ్యమయ్యెను. సెనేటు సభ్యుడగుటకూడ సాధ్యమయ్యెను.

ఉత్తమవంశస్థులకును, సామాన్యజనులకును జరిగిన పోరాటమును గురించియే మనము చెప్పుకొనుచున్నాము. దీనినిబట్టి రోములో ఇంకెవ్వరును లేరని కాదు. ఈ రెండుతెగలేకాక రోమురాష్ట్రములో అసంఖ్యాకులగు బానిస లుండిరి. వారి కెట్టిహక్కులును లేవు. వారు పౌరులు కారు. వారికి వోటిచ్చుఅధికారము లేదు. వారు తమ యజమాని సొంతఆస్తి. కుక్కలవలెను, ఆవులవలెను వారిని యజమాను లమ్మివేయవచ్చును. లేదా ఇష్టము

వచ్చినట్లు శిక్షించవచ్చును. కొన్ని షరతులమీద వారిని విడిచిపెట్టవచ్చును కూడ. అట్లు విడిచిపెట్టబడ్డవారు ఒక ప్రత్యేకతెగ యైరి. ఆ తెగకు బంధ విముక్తులని పేరు. పశ్చిమదేశములందు ప్రాచీనకాలమున బానిసలకు గిరాకీ హెచ్చుగా నుండెను. అందుకై బానిసల నమ్ముటకు పెద్ద బానిసమార్కెట్టులు పొడచూపెను. పురుషులను, స్త్రీలను, చిన్నపిల్లలనుసైతము పట్టుకొనుటకు దూరదేశములకు దండయాత్రలు బయలుదేరెను. దొరికినవారిని బానిసలుగా అమ్ముచుండిరి. ప్రాచీన గ్రీసురోముల వైభవమునకును, ప్రాచీన ఈజిప్టు వైభవమునకును విస్తారముగా వ్యాపించిన బానిస పద్ధతియే పునాది.

ఇండియాలోకూడ ఇంతమట్టుకు ఇట్టి బానిసపద్ధతి కలదా? బహుశా లేదనియే చెప్పవలెను. చీనాదేశములోను లేదు. కాని ప్రాచీన ఇండియా చీనాలలో బానిసత్వము అసలే లేదని చెప్పుట కాదు. ఉన్న బానిసత్వమేమో గృహసంబంధమైనది. ఇంటిపనులు చేయు సేవకులు బానిసలుగా భావింపబడిరి. ఇండియాలోగాని, చీనాలోకాని కూలిపని చేయు బానిసలు, అనగా భూమిమీదనో, ఇంకొకతావుననో పనిచేయు పెద్ద బానిససంఘములు ఉన్నట్లు తోచదు. ఈ రెండు దేశములును అవమానకరమగు బానిసత్వము లేకుండ చేసికొన్నవి.

రోము వృద్ధిచెందినది. దానివల్ల ఉత్తమకులస్థులు బాగుపడిరి. ఎక్కువధనవంతులు భాగ్యవంతులయిరి. సామాన్యజనులు దరిద్రముగానే ఉండిరి. ఉత్తమకులస్థులు వారి నణచిపెట్టిరి. ఉత్తమకులస్థులును, సామాన్యప్రజలును కలిసి బానిసల నణచిపెట్టిరి.

రోము అభివృద్ధిచెందుచున్నకాలములో ఎట్లు పరిపాలింపబడెను? సెనేటుచేతనని నేను చెప్పితిని. ఎన్నుకోబడ్డ ఇద్దరు కాంసలులు సెనేటును నియమించుచుండిరి. కాంసలుల నెవ రెన్నుకొనుచుండిరి? వోటర్లగు పౌరులు. ప్రారంభమున రోము, నగరరాష్ట్రమువలె చిన్నదిగా నున్నప్పుడు పౌరులందరును రోములోనో, తత్సమీపముననో నివసించు

చుండిరి. ఒక్కచో కలిసికొని వోటుచేయుట వారికి కష్టముకాదు. రోము వృద్ధినందినప్పుడు పౌరులు పెక్కురు రోము కెంతోదూరమున నివసించు చుండిరి. వోటుచేయుట వారికి సులభము కాదు. 'నేడు ప్రాతినిధ్య ప్రభుత్వ' మని పేర్కొనబడు ప్రభుత్వ మానాటికి పరిణమించలేదుకాన ఆచరణలో లేదు. నేడు ప్రతి ఎన్నికఫిర్కాయు జాతీయసభకో, పార్లమెంటుకో, కాంగ్రెసుకో తన ప్రతినిధి నెన్నుకొనును. ఆవిధముగా ఒక చిన్నసభలో జాతియంతకును ప్రతినిధు లుండవచ్చును. ప్రాచీనరోమనుల కీపద్ధతి తట్టలేదని తోచును. కాబట్టి దూరమందున్న వోటర్లు వచ్చుట కసాధ్యముగా నున్నను వారు రోములోనే ఎన్నికలు పెట్టుకొనుచుండిరి. దూరమందున్న వోటర్లకు నిజముగా ఏమి జరుగుచున్నదియు తెలియదు. అప్పుడు వార్తాపత్రికలు లేవు, అచ్చుపుస్తకములు లేవు. చదువగలవారు కొద్దిమంది మాత్రమే. రోముకు దూరముగా నున్న పౌరులకు వోటుచేయుట కిచ్చిన హక్కు వారి కెంతమాత్రము ప్రయోజనకారిగా లేదు. వారికి వోటుచేయు హక్కున్నది. కాని అట్టి హక్కును దూరమే వారికి లేకుండచేసినది. ఎన్నికలలో పాల్గొనువారును, ముఖ్యనిర్ణయములు చేయువారును రోములో నిజముగా వోటర్లే యని నీవు గ్రహించియుందువు. ఆరుబయట కట్టిన ఆవరణలలో వారు వోటువేసెడువారు. వోటర్లలో పలువురు బీదలగు సామాన్యజనులే. పెద్దయుద్యోగములను, అధికారమును కోరు ధనికులగు ఉత్తమకులస్థులు తమకు వోటువేయమని యీ బీదవారికి లంచములిచ్చెడి వారు. నేటి ఎన్నికలలోవలెనే రోమనుల ఎన్నికలలోకూడ లంచములు, మోసములు పరిపాటిగా ఉన్నవన్నమాట.

ఇటలీలో రోము ప్రాబల్యమునందుచుండగా ఉత్తర ఆఫ్రికాలో కార్తేజి ప్రబలమగుచుండెను. కార్తేజిప్రజలు ఫొనీషియనుల సంతతివారు. సముద్రయానము, వర్తకము అన్న వారికిని ఇష్టమే. వారిదికూడ ప్రజా ప్రభుత్వమే. విశేషమేమన, అది ధనాఢ్యులగువారి ప్రజాప్రభుత్వము, అది నగర ప్రజాప్రభుత్వము. అందు బానిసల జనసంఖ్య అత్యధికము.

తొలిరోజులలో రోముకును, కార్తేజికిని మధ్య, దక్షిణఇటలీలోను, మెస్సీనాలోను గ్రీకుల వలస లుండెను. రోమును, కార్తేజియు ఒకటై గ్రీకులను తరిమివేసిరి. అట్లు చేసినప్పుడు కార్తేజి సిసిలీని తీసికొనెను. రోము ఇటలీ చిట్టచివరి భాగమువరకును ఆక్రమించెను. రోము, కార్తేజిల మధ్యనున్న స్నేహము, సంబంధము ఆట్టే కాలము నిలువలేదు. త్వరలోనే రెంటికిని వివాదలు పుట్టెను. రెంటికిని తీవ్రస్పర్ధలు రేగినవి. రెండు ప్రబలజాతులు ఎదురెదురుగా నున్నప్పుడు మధ్యధరాసముద్ర మొక లెక్కలోని పని కాదు. ఇద్దరును అత్యాశకలవారే. రోము అభివృద్ధిలోనున్నది. యౌవనమున కుండు అత్యాశ, స్థైర్యము దానికి గలవు. మొట్టమొదట నడుమంత్రపు సిరితో మిడిసిపడు రోమును కార్తేజి తృణీకారదృష్టితో చూచియుండును. సముద్రాధిపత్యము తన కున్నదిగదా యని నమ్మకముతో నుండియుండవచ్చును. నూరుసంవత్సరములపైగా—మధ్యమధ్య సంధిచేసికొనుచు—అవి పోరాడెను. వన్యమృగములవలె పోరాడెను. అసంఖ్యాకులగు జన సంఘములకు తీరని దుఃఖము కల్పించెను. ఇట్టి సంగ్రామములు మూడు జరిగెను. వీటిని ప్యూనిక్‌సంగ్రామము లందురు. మొదటి ప్యూనిక్ సంగ్రామము క్రీ. పూ. 264 సం॥ నుండి 241 సం॥ వరకు 23 సంవత్సరములు జరిగెను. రోము విజయము నందెను. 22 సంవత్సరము లైనపిమ్మట రెండవ ప్యూనిక్‌సంగ్రామము తటస్థించెను. చరిత్రలో ప్రసిద్ధికెక్కిన సేనానాయకుని - హానిబల్ అనువానిని కార్తేజి పంపెను. 15 సంవత్సరములపాటు హానిబల్ రోమును హింస పెట్టెను. రోమనుప్రజలు భీతావహు లగునట్లు చేసెను. క్రీ. పూ. 216 సం॥ న రోమనుసైన్యములను కానేవద్ద ఓడించెను. అప్పుడు జరిగిన శత్రునష్టమునకు మేరలేదు. ఇది యంతయును హానిబల్ కార్తేజినుండి సహాయము పొందకుండనే చేసెను. రోమనులు సముద్రాధిపత్యము

సంపాదించియుండుటచే కార్తేజినుండి అతనికి సహాయము రాకుండచేయ గలిగిరి. పరాజయము వచ్చినప్పటికిని,దారుణవిపత్తు సంభవించినప్పటికిని, హానిబల్ నిరంతరము బెదిరించుచున్నప్పటికిని రోమనుప్రజలు అధైర్య పడలేదు సరికదా. తాము ద్వేషించు శత్రువుతో పోరాటము సాగించిరి. హానిబల్‌ను బహిరంగముగా ఎదుర్కొని పోరాడుటకు భయపడి వారు అట్టి యుద్ధములు చేయ మానుకొనిరి. అతనిని హింసపెట్టుటకుమాత్రమే ప్రయత్నించిరి. అతనికి కార్తేజినుండి సహాయము రాకుండ రాకపోకలను నిరోధించిరి. ఈవిధముగా బహిరంగయుద్ధములకు సావకాశ మీయకుండ ప్రయత్నించిన రోమనుసేనాని ఫేబియసు. పదిసంవత్సరములపాటు అతడు బహిరంగయుద్ధములు చేయకుండ తప్పించుకొనెను. అతడు గొప్పవాడని కాని, అతని పేరు జ్ఞాపకముంచుకోదగ్గ దనికాని అతని పేరు నే నుదాహరించలేదు. అతని పేరును బట్టి ఇంగ్లీషుభాషలోని కొక క్రొత్తమాట వచ్చినది. అది ఫేబియన్. ఫలితమును తేల్చనీయని ఫేబియన్ ఎత్తులు అనుమాట యున్నది.వారుయుద్ధములలోను, విపత్తులలోను ప్రవేశించకుండ తప్పించుకొందురు. నాన్చినాన్చి పనిచేసి ఫలము నొందగోరుదురు. ఇంగ్లాండులో ఫేబియన్‌సంఘము కలదు. దానికి సాంఘికవాద మిష్టము. తొందరపడి పనిచేయుటవల్ల లాభము లేదనియు, హఠాత్తుగా వచ్చిన మార్పులు మంచివి కావనియు దాని నమ్మకము.

ఇటలీలో అధికభాగమును హానిబల్ ఎడారిగా మార్చివేసెను. కాని రోముపట్టుదల, హఠము చివరకు విజయమునందినవి. క్రీ. పూ. 202 సం॥ న జామాయుద్ధములో హానిబల్ పరాజితుడయ్యెను. అమితముగా ద్వేషించు రోమను లాతనికి నిలువ నీడలేకుండ తరిమికొట్టిరి. చివర కాతడు విషము మ్రింగెను.

కార్తేజికి పూర్తిగా గర్వనాశన మయ్యెను. రోము నెదిరింప దాని కిప్పుడు గుండెలు లేవు. అర్ధశతాబ్దముపాటు రోము కార్తేజిల మధ్య శాంతి ఏర్పడెను. అయినను రోముకు తృప్తిలేదు. కార్తేజిప్రజలపై మూడవ

ప్యూనిక్ సంగ్రామము రోము తెచ్చిపెట్టెను. ఈసంగ్రామమున శత్రునష్ట మమితముగా జరిగెను. కార్తేజి పూర్తిగా నాశనమయ్యెను. మధ్యధరా ప్రాంతరాజ్ఞి అని పేరుగన్న కార్తేజి మహానగరము ఒకప్పుడు సగర్వముగా నిలుచున్న స్థలమును నేడు నాగలి దున్నుచున్నది.

## 28

# రోమనుల ప్రజాప్రభుత్వము సామ్రాజ్యమగుట

ఏప్రియల్ 9, 1932.

కార్తేజి పూర్తిగా పరాజయ మంది వినాశనమైనపిమ్మట రోము సర్వోత్కృష్టమై పశ్చిమప్రపంచమున ఎదురులేకుండ నిలిచెను. అది గ్రీకునగరరాష్ట్రముల నింతకుముందే జయించెను. ఇప్పుడు కార్తేజి వశములో నున్న భూభాగముల నన్నిటిని స్వాధీనముచేసికొనెను. స్పెయిన్ రెండవ ప్యూనిక్ సంగ్రామానంతరము రోమువశమయ్యెను. ఇంత చేసినప్పటికిని రోమురాజ్యమంతయు మధ్యధరాదేశములుమాత్రమే. ఉత్తరమధ్యయూరోపు యావత్తును రోముఏలుబడిలో లేక స్వతంత్రముగా నుండెను.

విజయమునకు ఫలితముగా రోములో భోగభాగ్యము లతిశయించెను. ఓడిపోయిన భూములనుండి బంగారము, బానిసలు రోములో వచ్చిపడెను. ఇవి ఎవరి వశమైనట్లు? రోములో పరిపాలకులు సెనేటుసభ్యు లని యిదివరలో చెప్పియుంటిని. ధనవంతులగు ఉత్తమవంశస్థు లందు సభ్యులు. ఈ ధనికసంఘము రోములోని ప్రజాప్రభుత్వమును నడుపుచుండెను. రోము ప్రబలమై విశాలమగుచున్నకొలది వీరు మరియు భాగ్యవంతు లగుచుండిరి. దీనికి ఫలితము ధనవంతులు మరీ ధనవంతు లగుట, బీదవారు బీదవారుగానే యుండుట, లేదా మరీ బీదవారగుట, బానిసల

జనసంఖ్య హెచ్చెను. ఇటు భోగములు, అటు హైన్యము ఒకమారే ప్రక్కప్రక్కల నడుచుచుండెను. ఇట్టి సందర్భములందే సామాన్యముగా దేశమందు కల్లోలములు పుట్టును. మానవుల సహన మసాధారణమైనది. అట్టి సహనమునకుకూడ హద్దున్నది. ఇట్టి హద్దు దాటినప్పుడే విప్లవములు పుట్టును.

సర్కసులలో ఆటలను పెట్టియు, పోటీపందెములను పెట్టించియు ధనవంతులు బీదవారిని ఊరుకోబెట్ట ప్రయత్నించిరి. చూచువారి వినోదము కొరకు సర్కసులలో మల్లులు ఒకరితోనొకరు పోరాడి ఒకరినొకరు చంపుకొనుచుండిరి. ధనవంతుల నిర్బంధముమీద వారట్లు చేయవలసి వచ్చెను. బానిసలును, యుద్ధఖైదీలును అనేకులు ఈవిధముగా క్రీడార్థమై హత్యచేయబడిరి.

రోమనురాజ్యములో అల్లరులు అధికమయ్యెను. తిరుగుబాట్లు, హత్యలు, ఎన్నికల సమయములలో లంచములు, దుష్ప్రవర్తనము అతిశయించెను. అణచిపెట్టబడిన బీదబానిసలుసైతము, స్పార్టాకస్ అను మల్లుని నాయకత్వమున తిరుగుబాటు చేసిరి. కాని దయాదాక్షిణ్యములు లేకుండ చితుకగొట్టబడిరి. వారిలో 6000 మంది 'అప్పియన్ వే' అను రోడ్డుమీద కొరత వేయబడిరని చెప్పుదురు.

సాహసికులు, సేనానులు క్రమక్రమముగా ప్రముఖులై సెనేటును మరుగుపరచిరి. అంతర్యుద్ధము తటస్థించెను. అమితముగా జననష్టము కలిగెను. సేనానులు పోటీపడి ఒకరితోనొకరు పోరాడుచుండిరి. తూర్పున పార్థియా (మెసపొటేమియా)లో రోమనుసైన్యములు క్రీ. పూ. 53 సం॥న కార్హే యుద్ధములో గొప్పపరాజయ మందిరి. పార్థియనులు తమ్మెదిరించిన రోమనుసైన్యమును నాశనముచేసిరి.

రోమనుసేనాను లనేకముండిరి. అందు ప్రసిద్ధులిద్దరు-పొంపాయి, జూలియస్‌సీజరు. ఫ్రాన్సును ఆకాలములో గాల్ అనువారు. సీజరు గాల్ దేశమును, బ్రిటనుదేశమును జయించెను. పొంపాయి తూర్పుగా వెళ్లి

కొన్ని విజయములు సాధించెను. కాని ఓరిద్దరి మధ్యను తీవ్రస్పర్థలు పెరిగెను. ఇద్దరును అత్యాశ కలవారు. పోటీ సహించరు. ఇద్దరును సేనానులను మాటలతో మాత్రము గౌరవించుచుండిరి. కాని సెనేటు ప్రాముఖ్యము తగ్గిపోయెను. సీజరు పొంపాయిని పరాజితుని చేసి రోమను ప్రపంచములో ప్రధానపురుషు డాయెను. రోములో ప్రజాప్రభుత్వ మున్నది కాన అతడు ఉద్యోగరీత్యా ప్రతివిషయములోను అధికారము చలాయించుటకు సాధ్యపడకుండెను. కాబట్టి అతనిని రాజునో, చక్ర వర్తినో చేయవలెనని ప్రయత్నములు జరిగినవి. అతని కిష్టముగానే యుండెనుకాని చిరకాలమునుండి దేశములో పాదుకొనియున్న ప్రజా ప్రభుత్వసంప్రదాయమును చూచి అతడు జంకవలసివచ్చెను. ఈ సంప్ర దాయము మిక్కిలి ప్రబలముగా నుండుటచేతనే బ్రూటసును, ఇతరులును, ఫోరం (Forum) మెట్లమీదనే అతనిని పొడిచిచంపిరి. షేక్స్పియర్ వ్రాసిన జూలియస్‌సీజరునాటకము నీవు చదివియుందువు. అం దీరంగము కలదు.

క్రీ. పూ. 44 సం॥న జూలియస్‌సీజరు హత్యచేయబడెను. అతడు చనిపోవుటవల్ల ప్రజాప్రభుత్వమునకు ప్రమాదము తప్పలేదు. సీజరు దత్తపుత్రుడైన ఆక్టేవియన్‌యును, మార్కు-ఆంటొనీయును సీజరు హత్యకు ప్రతీకారము చేసిరి. రాజత్వము మరల వచ్చెను. ఆక్టేవియన్ రాజ్యములో ప్రధానపురుషుడు - చక్రవర్తి యయ్యెను. ప్రజారాజ్య మంత రించెను. సెనేటు నిలిచియుండెనుకాని దానికి అధికార మేమియు లేదు.

తాను ప్రధానపురుషుడు, చక్రవర్తి యైన పిమ్మట ఆక్టేవియన్ అగ ష్టసు సీజ రనుపేరును, బిరుదును వహించెను. అతని తరువాత వచ్చిన వారందరును సీజరులని పిలువబడిరి. సీజరు పదమునకు చక్రవర్తియను నర్థము వచ్చెను. కైజరు, జారు అను పదములు సీజరుపదమునుండియే పుట్టినవి.

కైజ రను మాట హిందూస్థానీ పదముకూడ—కైజర్-ఇ-రూమ్, కైజర్-ఇ-హింద్. ఇంగ్లాండురాజైన జార్జికి కైజర్-ఇ-హింద్ అను

బిరుదు కలదు. ఆ బిరుదు అతని కిష్టమైనది. జర్మను కైజరు గతించెను. ఆస్ట్రియా కైజరు, టర్కీకైజరు, రష్యాజారుకూడ గతించిరి. ఈనాడు ఇంగ్లాండురాజొక్కడే, రోముకొరకు బ్రిటనును జయించిన జూలియస్ సీజరుపేరు, లేదా బిరుదము ధరించియుండుట తలచిన వింతగా నుండును.

జూలియసుసీజరుపేరు సామ్రాజ్యవైభవమును సూచించు పదమైనది. గ్రీసులోని ఫర్సాలస్‌వద్ద పొంపాయి సీజరు నోడించియుండిన నేమి జరిగెడిదో? బహుశా పొంపాయి చక్రవర్తి అయ్యెడువాడు. పొంపాయిపదమునకు చక్రవర్తి యను అర్థము వచ్చియుండెడిది. అప్పుడు జర్మనుపొంపాయి (విల్‌హెల్మ్ ii) ఉండియుండును. జార్జిరాజుకూడ పొంపాయి-ఇ-హింద్ అయియుండును.

. రోమనుప్రజాప్రభుత్వము సామ్రాజ్యముగా పరిణమించుచున్న ఆరోజులలో ఈజిప్టుదేశమున, సుందరవతియని లోకప్రఖ్యాతి గన్న ఒక స్త్రీ యుండెను. ఆమెపేరు క్లియోపాత్ర. ఆమెకీర్తి అకలంకితమని చెప్పవీలులేదుకాని, తమ సౌందర్యమును పురస్కరించుకొని చరిత్రగతిని మార్చినట్లు చెప్పబడుస్త్రీలలో ఆమె యొకతె. జూలియస్‌సీజరు ఈజిప్టుకు వెళ్ళినప్పుడు ఆమె చిన్నపిల్ల. తరువాత ఆమె మార్కు ఆంటొనీతో చెలిమిచేసెను. అతని కుపకార మేమియు చేయలేదు. ఒక గొప్ప నౌకాయుద్ధము జరుగుచుండగా ఆమె తన నావలతో అతనిని ద్రోహబుద్ధితో విడనాడెను. చాలకాలముక్రిందట ఒక ప్రసిద్ధ ఫ్రెంచి రచయిత, పాస్కల్ అనువాడు ఇట్లు వ్రాసెను: "క్లియోపాత్రముక్కు కొంచెము పొట్టిగా నున్నచో ప్రపంచస్వరూపమే మారియుండెడిది."

ఇది అతిశయోక్తిగా తోచును. క్లియోపాత్రముక్కు కారణముగా ప్రపంచము మారియుండదు. ఈజిప్టుకు వెళ్లినతరువాత సీజరు తాను రాజుననో, లేదా చక్రవర్తిననో, ఒకవిధమగు పాలకుడగు భగవంతుడ ననో అనుకొనియుండును. ఈజిప్టులో ప్రజాప్రభుత్వములేదు. రాజాధి

పత్య మున్నది. అక్కడి పాలకుడు సర్వ స్వతంత్రుడేకాదు—భగవంతు నితో తుల్యుడనికూడ ప్రజలు భావించుచుండిరి. ఇది ప్రాచీనకాలము నుండియు ఈజిప్టులో వ్యాపించిన భావన. అలెగ్జాండరు మరణానంతరము ఈజిప్టు నేలిన గ్రీకు టోలెమీలు ఈజిప్టుదేశపు ఆచారములను, నమ్మక ములను చాలవరకు అవలంబించియుండిరి. ఈ టోలెమీల కుటుంబమునకు చెందినది క్లియోపాత్ర, కాన ఆమె గ్రీకు, లేదా మాసిడోనియను రాచ కన్నె. పాలకుడగు భగవంతుడు అను భావన క్లియోపాత్ర ప్రోద్బలము వల్లనో, ఎందువల్లనో రోములో ప్రవేశించి అక్కడ పాదుకొనెను. జూలియస్ సీజరు జీవితకాలమందే, రోములో ప్రజాప్రభుత్వము వర్ధిల్లు చుండగా అతని శిలావిగ్రహములు ప్రతిష్ఠింపబడి పూజలందుచుండెను. రోమను చక్రవర్తులలో ఇది యొక ఆచారమైనట్లు ముందుముందు మనము తెలిసికొందుము.

రోముచరిత్రలో ఒక ప్రధానఘట్టమును మనము చేరితిమి. ప్రజా ప్రభుత్వ మంతరించిన ఘట్టము. క్రీ. పూ. 27 వ యేట ఆక్టేవియను చక్రవర్తి అయ్యెను. అగస్టసు సీజరు అను బిరుదము నాతడు వహించెను. రోమును గూర్చినట్టియు, దాని చక్రవర్తులను గూర్చినట్టియు కథ ముందు ముందు మరల ఎత్తికొందము. ప్రజాప్రభుత్వ మంతరించు కాలమున నున్న రోమను రాజ్యములనుగూర్చి ఇప్పుడు తెలిసికొందము.

రోము ఇటలీని పాలించెను. పశ్చిమమున స్పెయిను, గాల్ (ఫ్రాన్సు) దేశములను పాలించెను. తూర్పున గ్రీసును, ఆసియా మైనరును పాలిం చెను. ఆసియా మైనరులో పెర్గామం అను గ్రీకురాష్ట్ర మున్నదన్నమాట జ్ఞాపకమున్నదా? ఉత్తర ఆఫ్రికాలో ఈజిప్టు మిత్రరాజ్యముగాను, రక్షిత రాజ్యముగాను పరిగణింపబడినది. కార్తేజియు, మరికొన్ని మధ్యధరా దేశ భాగములునుకూడ రోమువశమునందుండెను. ఉరమరగా ఉత్తర మున రైనునది పొడుగునను రోమనురాజ్యముల పొలిమేర వ్యాపించెను. జర్మనీ, రష్యా, ఉత్తర, మధ్య యూరోపుదేశముల ప్రజలు రోమను

ప్రపంచమునకు బయటనుండిరి. మెసపొటేమియాకు తూర్పున నున్న ప్రజలుకూడ అంతే.

ఆరోజులలో రోము ఉన్నతిలోనుండెను. యూరోపులో పలువురు, ఇతరదేశచరిత్రల నెరుగక, రోమే ప్రపంచమునందంతటిలోను అగ్ర స్థానము వహించియుండెనని తలతురు. ఇది యథార్థము కాదు. ఈ కాలమునందే, గొప్పదగు హాన్ రాజవంశము ఆసియానుండి కాస్పియన్ సముద్రమువరకు నున్న భూమినంతయు పాలించెను. రోమనులు పరాజయమందిన, మెసపొటేమియాలోని కార్ యుద్ధములో పార్థియనులు బహుశా మంగోలియనుల సహాయమును పొందియుండవచ్చును.

కాని రోమనుచరిత్ర, ముఖ్యముగా రోమను ప్రజా ప్రభుత్వచరిత్ర, అన్న యూరోపియనుల కిష్టము. నేటి యూరోపియను రాజ్యములకు రోమనురాజ్యము ఒకవిధమగు మూలపురుషునిగా వారు భావింతురు. కొంతవరకు ఇది నిజమె. కాబట్టి ఇంగ్లీషు విద్యార్థులచేత అధునాతన చరిత్ర చదివించినను చదివింపకున్నను, గ్రీకు రోమనుచరిత్రలుమాత్ర మభ్యసింపజేతురు. తన గాల్ దేశ దండయాత్రనుగూర్చి జూలియస్ సీజరు వ్రాసిన వృత్తాంతమును లాటిను భాషలో నాచేత చదివించుట నాకు జ్ఞాపకమున్నది. సీజరు యోధుడుమాత్రమే కాదు. అతడు చక్కని రసవంతమగు శైలిలో వ్రాయ నేర్పు గల గ్రంథకర్తకూడ. అతడు వ్రాసిన 'డి బెల్లో గాల్లికో' ("గాలులతో చేసిన యుద్ధము") అను గ్రంథము యూరోపులో వేలకొలది పాఠశాలలలో నేటికిని పఠింపబడుచున్నది.

అశోకుని కాలమునాటి ప్రపంచమును పరిశీలించుటకు ఇంతకు ముందు మొదలుపెట్టితిమి. ఆ పరిశీలన పూర్తిఅయ్యెను. అంతే కాదు. దానిని దాటి చీనాలోనికిని, యూరోపులోనికిని పోతిమి. క్రీస్తుశక ప్రారంభ కాలమునకు మిక్కిలి చేరువగా వచ్చితిమి. మన మిప్పుడు ఇండియాకు తిరిగిపోయి అచ్చటి ప్రజలనుగూర్చి మనకు తెలిసిన విషయములు ఈ కాలమువరకు గమనింతము. అశోకుని మరణానంతరము ఆ దేశమున

గొప్ప మార్పులు కలిగెను. దక్షిణమునను ఉత్తరమునను గొప్ప సామ్రాజ్యములు లేచినవి.

ప్రవాహవత్తుగా జరిగిపోవుచున్న ప్రపంచచరిత్ర ఒక్కటే అని నీకు తెలియజెప్పుటకు ప్రయత్నించితిని. ఈ తొలిరోజులలో దూరదేశములకు సంబంధము సకృత్తుగా నుండెడిదని నీకు జ్ఞాపకముండవచ్చును. అనేకవిధములుగా అభివృద్ధిచెందిన రోముకు భూగోళశాస్త్రము, దేశపటముల సంగతి తెలియదు. తెలిసికొనుటకు ప్రయత్నములనుసైతము చేయలేదు. నేటి విద్యార్థికిగాని, విద్యార్థినికిగాని రోమను గొప్ప సేనాపుంకన్నను, రోమను సెనేటులోని బుద్ధిమంతులకన్నను—వారు ప్రపంచమునకు అధీశ్వరుల మనుకొన్నారు—ఎక్కువ భూగోళశాస్త్ర జ్ఞానముకలదు. వారు ప్రపంచమున కధీశ్వరుల మనుకొన్నట్లే, కొన్నివేలమైళ్ల దూరమున ఆసియాఖండమున కావలి మూలనున్న చీనా పాలకులుకూడ తాము ప్రపంచమున కధీశ్వరు లనుకొనిరి.

## 29

# దక్షిణ ఇండియా ఉత్తర ఇండియాను మరుగుపరచెను

ఏప్రియల్ 10, 1932.

దూరప్రాచ్యములో నున్న చీనాకును, పశ్చిమమున నున్న రోముకును ప్రయాణములు చేసి ఇండియాకు తిరిగివచ్చితిమి. అశోకుడు మరణించిన వెనుక మౌర్యసామ్రాజ్య మాట్టేకాలము నిలువలేదు. కొద్ది సంవత్సరములలో నది శుష్కించిపోయెను. ఉత్తర రాష్ట్రములు కూలిపోయెను. దక్షిణమున నొక క్రొత్త ప్రభుత్వము తలయెత్తెను. అది ఆంధ్రప్రభుత్వము. 50 సంవత్సరములవరకు, అంతరించుచున్న సామ్రాజ్యమును అశోకుని సంతతివారు పరిపాలించుచుండిరి. చివరకు వారి

సర్వసేనానాయకుడు. పుష్యమిత్రుడను బ్రాహ్మణుడు వారిని బలవంత ముగా తొలగించెను. అతడే రాజయ్యెను. అతనికాలమున బ్రాహ్మణ మతము పునరుజ్జీవిత మయ్యెనని చెప్పుదురు. బౌద్ధభిక్షువులు కొంతవరకు హింసింపబడిరికూడ. హిందూదేశ చరిత్ర నీవు చదివిన బ్రాహ్మణమతము బౌద్ధమతమును ఎదుర్కొన్న విధము ఇంతకన్న తెలివితేటలతో కూడు కొన్నదని గ్రహింతువు. దానిని హింసించుటవంటి బండపద్ధతు లది యవ లంబించలేదు. కొంత హింస యుండవచ్చును. కాని అది రాజకీయము లకు సంబంధించినది కాని మతమునకు సంబంధించినది కాదు. బౌద్ధ సంఘములు గొప్పవి. పలుకుబడిగలవి. పలువురు పాలకులు రాజకీయ ముగా దానికున్న పలుకుబడిచూచి భయపడుచుండిరి. కావుననే దానిని దుర్బలముచేయుటకు వారు ప్రయత్నించిరి. బౌద్ధమతమును తనలో కలుపుకొనియు, దానిని కొంతవరకు జీర్ణముచేసికొనియు, తన యింటనే దాని కుండుటకు తావుచూపియు బ్రాహ్మణమతము దానిని చాలవరకు జన్మదేశమున లేకుండచేసినది.

నూతన బ్రాహ్మణమతము మరల ప్రాతపరిస్థితులలో పడలేదు. బౌద్ధమతము చేసినదంతయు కాదనలేదు. ఆనాటి బ్రాహ్మణమత నాయ కులు సునిశిత బుద్ధులు. పూర్వకాలమునుండియు మంచిని గ్రహించి జీర్ణముచేసికొనుట వారి యభ్యాసము. ఆర్యులు మొట్టమొదట ఇండియాకు వచ్చినప్పుడు వారు ద్రావిడ సంస్కృతిని, ఆచారములను చాలవరకు గ్రహించి తమవిగా చేసికొనిరి. తెలిసియో, తెలియకో వారు మొదటి నుండియు ఈ విధముగానే ఆచరించినట్లు వారి చరిత్ర వెల్లడిచేయు చున్నది. బౌద్ధమత విషయమునకూడ వా రట్లే ప్రవర్తించిరి. బుద్ధుని అవతార పురుషునిగా, దేవునిగా వారు భావించిరి. వారి దేవుళ్ళలో బుద్ధు డొకడయ్యెను. ప్రజలు పూజించుటకు బుద్ధుడు మిగిలెను కాని అతని ప్రత్యేక సందేశము మాత్రము విస్మరింపబడెను. బ్రాహ్మణమతము, అనగా హిందూమతము కొద్ది మార్పులతో ప్రాతపుంతలలో పోదొడగెను.

బుద్ధుని బ్రాహ్మణమతములో కలుపుకొనుటకు చాలకాలము పట్టెను. కాని మనము రాబోవు విషయముల నిప్పుడు చర్చించుకొనుచున్నాము. ఏల యన బౌద్ధమతము అశోకుని మరణానంతరము అనేకవందల సంవత్సరముల కాలము ఇండియాలో నిలువవలసియున్నది.

మగధలో ఒకదాని తరువాత నొకటిచొప్పున వచ్చిన రాజులను, రాజవంశములను మన మెత్తికోవద్దు. అశోకుడు మరణించిన సుమారు 200 సంవత్సరములకు మగధరాజ్యము ఇండియాలో ప్రధాన స్థానమును గోల్పోయెను. కాని అప్పుడు సైతము బౌద్ధ సంస్కృతికి అది గొప్ప కేంద్రముగానే యుండుచు వచ్చెను.

ఈలోపుగా ఉత్తరమందును, దక్షిణమందును ముఖ్యమగు విషయములు జరుగుచుండెను. మధ్య ఆసియాలోని పలుతెగలు — బాక్ట్రియనులు, శకులు, సిథియనులు, టుర్కీలు, కుషాణులు — ఉత్తరమున ఎడతెరిపిలేకుండ దండయాత్రలు చేసిరి. మధ్య ఆసియాలో అనేక తెగల మనుష్యు లుండెడివారనియు, వారు చరిత్రలో మరల మరల బయటికి వచ్చి ఆసియా అంతటను, యూరోపులోకూడ వ్యాపించిరనియు ఇదివరలో నీకు వ్రాసియుంటిని. క్రీ. పూ. 200 సంవత్సరములలో అనేక సార్లు అట్టి దండయాత్రలు ఇండియాపై జరిగెను. కాని ఈ దండయాత్రలు దేశమును జయించుటకుగాని, దోపిడికొరకుగాని కావు. అవి నివాసభూములకొరకు మాత్రమే. మధ్యఆసియా తెగలవా రందరు దేశాటన తత్పరులు. వారిసంఖ్య వృద్ధియగుచురాగా వారిదేశము వారిని పోషింపలేకపోయెను. కాబట్టి వారు స్వదేశమునువిడిచి క్రొత్తభూములు చూచుకోవలసి వచ్చెను. అంతకన్నను బలవత్కారణము వెనుకనుండి వచ్చిన పోటు. ఒక ప్రబలమైన తెగ ఇతర తెగలను తరిమివేయును. వీరు ఇతర దేశములపై దండయాత్రలు సలుపకతీరదు. కాబట్టి ఇండియాపై దండయాత్రలు చేసిన తెగలు తరుచుగా స్వదేశమును వీడి అన్యదేశమును శరణుచొచ్చినవారే. చీనా సామ్రాజ్యము, హాన్ల పరిపాలనలోవలె ప్రబల

ముగా నున్నప్పుడు ఈ దేశద్రిమ్మరులను తరిమివేసెను. వా రింకొకచోట నూతన నివాసము లేర్పరుచుకొనవలసి వచ్చెను.

మధ్య ఆసియానుండి దిగిన దేశద్రిమ్మరి తెగలు ఇండియాను శత్రు దేశముగా భావించలేదు. వారిని బర్బరులని (అనాగరికులని) హిందూ దేశస్థులు పిలిచెడివారు. ఆనాటి ఇండియా పరిస్థితులనుబట్టి చూచిన వారు అనాగరికులనియే చెప్పవలెను. కాని వారిలో పలువురు బౌద్ధులు బౌద్ధ ధర్మ మునకు నిలయమైన ఇండియా వారికి ఏడుగడ యని ఎంచుకొనుచుండిరి.

పుష్యమిత్రుని కాలమునందు సైతము వాయవ్యమునుండి ఒక దండయాత్ర వచ్చెను. బాక్ట్రియాదేశమునుండి మీనాండరు అనువాడు-భక్తుడగు బౌద్ధుడు ఈ దండయాత్రచేసెను. ఇండియా పొలిమేర ఆవల బాక్ట్రియాదేశ మున్నది. సెల్యూకసు సామ్రాజ్యములో భాగమై కొంత కాల ముండి తరువాత అది స్వతంత్రమైనది. మీనాండరు దండయాత్ర విఫలమాయెను కాని అతడు కాబూలును, సింధుదేశమును నిలుపుకో గలిగెను.

తరువాత శకుల దండయాత్ర వచ్చినది. వారు తండములుగా వచ్చి ఉత్తర ఇండియా, పశ్చిమ ఇండియా అంతట వ్యాపించిరి. టుర్కీ-దేశద్రిమ్మరులలో శకు లొక గొప్ప తెగవారు. కుషాణు లను ఇంకొక గొప్ప తెగవారిని మాతృదేశమునుండి వెడలగొట్టిరి. వారు బాక్ట్రియా, పార్థియా దేశములపైబడి పిమ్మట క్రమక్రమముగా ఉత్తర హిందూస్థాన మున-ముఖ్యముగా పంజాబు, రాజపుత్రస్థానము, కతియవారులలో నివాస మేర్పరుచుకొనిరి. వారిని ఇండియా నాగరీకులను చేసెను. వారు దేశాటన మును కట్టిపెట్టిరి.

ఈ బాక్ట్రియను పాలకులు, టుర్కీ-పాలకులు ఇండియాలో నచ్చ టచ్చట ఉండుటవల్ల ఇండో-ఆర్యుల సంఘమున కేలాటి ఇబ్బందియు కలుగలేదు. ఈ పాలకులు బౌద్ధులు. బౌద్ధమత సంఘములను వా రనుస రించుచుండిరి. ఈ సంఘములైనను ఇండో-ఆర్యుల ప్రజా ప్రాతినిధ్యము

గల గ్రామసంఘముల పంపిణీమీదనే ఆధారపడియున్నవి. ఈ పాలకుల ప్రభుత్వమందు సైతము ఇండియా, కేంద్ర ప్రభుత్వాధికారము క్రింద నుండి స్వయంపాలనము చేసికొను గ్రామసంఘముల — ప్రజాప్రభుత్వ ముల—సమూహముగానే ఉండెను. ఈ కాలమందు కూడ తక్షశిలయు, మధురయును బౌద్ధ విద్యానిలయములై చీనానుండియు, పడమటి ఆసియా నుండియు విద్యార్థుల నాకర్షించుచుండెను.

వాయవ్యమునుండి తడవతడవగా వచ్చు దండయాత్రలవల్లను, మౌర్య సామ్రాజ్యపతనమువల్లను ఫలమేమనగా దక్షిణ హిందూదేశ ప్రభుత్వములు ప్రాచీన హిందూ-ఆర్యుల పద్ధతులను నిలుపుకోగల్గెను. హిందూ-ఆర్యుల ప్రాబల్యము ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చెను. దండయాత్రలు కారణముగా పలువురు సమర్థులు బహుశా ఉత్తర ఇండియానుండి దక్షిణ ఇండియాకు నివాసములు మార్చుకొనిరి. వేయి సంవత్సరముల తరువాత, ముస్లిములు ఇండియాపై దండయాత్ర వెడలి నప్పుడు సరిగా ఈ విధముగానే జరిగెనని ముందుముందు నీవు తెలిసి కొందువు. ఇప్పుడుకూడ ఉత్తర హిందూస్థానమంత హెచ్చుగా దక్షిణ హిందూస్థానము పరదేశముల దండయాత్రలకు పాలుకాలేదు. పరదేశు లతో అంతగా దానికి సంబంధము కలుగలేదు. ఉత్తర హిందూస్థానమున నివసించు మన మందరమును మిశ్రమ సంస్కృతిలో పెరిగితిమి— ముస్లిము, హిందూ సంస్కృతులు, కొంత పాశ్చాత్య సంస్కృతి వీటి యొక్క సమ్మేళనము. మన భాషసైతము—హిందీ అనినను, ఉర్దూ అనినను, హిందూస్థానీ అనినను, ఏపేరు దానికి పెట్టినను అది మిశ్రమ భాషయే. దక్షిణదేశమున నీవు చూచితివిగదా, ప్రధానముగా శాస్త్ర సిద్ధ మైన సంస్కృతియే ఇంకను కలదు. అనేకవందల సంవత్సరముల కాలము, ప్రాచీన ఆర్య సంప్రదాయమును దక్షిణ హిందూస్థానము కాపాడుటకు, నిలుపుటకు ప్రయత్నించెను. ఈప్రయత్నఫలముగా సంఘము బిగిసిపోయెను. అందువల్లనే నేడుకూడ అసహనము ఆ సంఘమున

బలిసిపోయెను. గోడలు ప్రమాదకరమైన సహచరులు. అప్పుడప్పుడు బయటనున్న చెడుగు లోనికి రాకుండను, ఇష్టములేని మనుష్యులు లోనికి రాకుండను అడ్డుపెట్టును. కాని అవి నిన్ను ఖైదీగా, బానిసగా కూడ చేయుచున్నవి. నీవు నీ స్వాతంత్ర్యమును అమ్మి పవిత్రతను కొను చున్నావు. అన్నిటికన్న మిక్కిలి భయంకరములగు గోడలు నీ మనస్సులో పెరుగునవి. ప్రాచీనమన్న కారణమున దుష్టసంప్రదాయమును విడనాడనీయ వవి. అధునాతనమన్న కారణముచేత నూతనాభిప్రాయము నంగీకరించనీయవు.

వేయి సంవత్సరములకు పైగా మతమునందేగాక కళలయందును, రాజకీయములందును హిందూ-ఆర్యుల సంప్రదాయములను నిలుపుటవల్ల దక్షిణ హిందూస్థానము ప్రశస్తమగు కార్యమును చేసినది. ప్రాచీన హైందవకళ చూడదలచిన నీవు దక్షిణ హిందూస్థానమునకు పోవలసి నదే. గ్రీకు రాయబారి మెగాస్థనీసు వ్రాసిన వృత్తాంతమునుబట్టి చూచిన దక్షిణదేశమందలి ప్రజాసంఘములు రాజు అధికారము నెట్లు అరికట్టినవో తెలియును.

మగధ క్షీణించినప్పుడు విద్యావంతులేకాదు, కళాప్రపీణులు, వాస్తు శాస్త్రజ్ఞులు, శిల్పులు, వివిధవృత్తులవారు కూడ దక్షిణమునకు తరలివెళ్ళిరి. దక్షిణ ఇండియా యూరోపుతో విరివిగా వర్తకమును సాగించెను. ముత్యములు, దంతము, బంగారము, బియ్యము, మిరియాలు, నెమిళ్ళు, కోతులు సైతము బాబిలనుకు, ఈజిప్టుకు, గ్రీసుకు, కొన్నాళ్ళయిన తరు వాత రోముకు పంపుచుండెను. మలబారు తీరమందలి టేకుకలప ఇంతకు ముందే చాల్డియా, బాబిలనులకు వెళ్లుచుండెను. ఈ వ్యాపారమంతయు, లేదా ఎక్కువభాగము ద్రావిడులచే నడిపింపబడు హిందువుల ఓడలమీదనే జరుగుచుండెను. దీనినిబట్టి ప్రాచీన ప్రపంచమున దక్షిణ ఇండియా ఎంతటి ప్రముఖస్థానము నాక్రమించెనో నీవు గ్రహింపగలవు. దక్షిణ మున రోమక నాణెములు విస్తారముగా దొరికెను. మలబారు తీరమున

అలెగ్జాండ్రియాకు సంబంధించిన వలసలున్నట్లును, అలెగ్జాండ్రియాలో ఇండియనుల వలస లున్నట్లును ఇదివరలో చెప్పియున్నాను.

అశోకుడు మరణించినతోడనే దక్షిణమున ఆంధ్ర ప్రభుత్వము స్వతంత్రమయ్యెను. ఆంధ్రము ఇప్పుడొక కాంగ్రెసు రాష్ట్రమని నీకు తెలియు ననుకొందును. మద్రాసు కుత్తరముగా ఇండియాకు తూర్పు తీరమువెంబడి అది యున్నది. ఆంధ్రదేశములో మాటాడుభాష తెలుగు. అశోకుని అనంతరము ఆంధ్ర ప్రభుత్వము శీఘ్రగతిని వ్యాపించెను. ఈ సముద్రమునుండి ఆ సముద్రమువరకు అది దక్కనులో విస్తరించినది.

అన్యదేశములలో వలస లేర్పరుచుటకై ఉద్యమములెన్నో దక్షిణమున తలయెత్తినవి. వాటినిగురించి తరువాత ముచ్చటింతును.

శకులు, సిథియనులు, ఇతరులు ఇండియాపై దండయాత్ర సలిపి ఉత్తరమున స్థిరనివాసము లేర్పరుచుకొన్నట్లు చెప్పియుంటిని. వారు ఇండియాలో కలిసిపోయి హిందూదేశస్థులైరి. ఉత్తర హిందూస్థానమున నున్న మనము ఆర్యుల సంతతివారమేకాదు, వారి సంతతివారముకూడ. ముఖ్యముగా ధైర్యశాలులు, చక్కనివారు అగు రాజపుత్రులును, కథియవారులోని దృఢకాయులగు ప్రజలును వారి సంతతివారే.

# 30

# కుషాణుల పొలిమేర సామ్రాజ్యము

ఏప్రియల్ 11, 1932.

వెనుకటి జాబులో వరుసగా జరిగిన శక, టుర్కీ దండయాత్రలనుగూర్చి చెప్పియుంటిని. బంగాళాఖాతమునుండి అరేబియా సముద్రము వరకు దక్షిణమున వ్యాపించిన ప్రబలమగు ఆంధ్ర ప్రభుత్వవృద్ధిని గూర్చియు చెప్పియుంటిని. శకులు కుషాణులచే ముందుకు తరుమగొట్టబడిరి. కొంతకాల మైనపిమ్మట ఈ కుషాణులే రంగస్థలము నాక్రమించిరి.

క్రీ. పూ. మొదటి శతాబ్దిలో ఇండియా పొలిమేరదేశమున వారు రాజ్యము నేర్పరుచుకొనిరి. అది గొప్ప సామ్రాజ్యముగా వృద్ధినందెను. ఈ కుషాణ సామ్రాజ్యముక్రింద వారణాసివరకును, దక్షిణమున వింధ్యపర్వతముల వరకును ఉత్తరమున కాష్గారు, యార్ఖండ్, ఖోటన్‌వరకును, పడమర పర్షియా పొలిమేరలు, పార్థియావరకును వ్యాపించెను. దీనినిబట్టి చూడ ఉత్తర హిందూస్థానమంతయు—సంయుక్తరాష్ట్రములు, పంజాబు, కాశ్మీరములతో సహా—మధ్యఆసియాలో పెద్ద భాగమును కుషాణపాలకుల పాలనమందుండెను. ఈ సామ్రాజ్యము సుమారు 300 సంవత్సరములు ఉండెను. ఈ కాలమందే దక్షిణ ఇండియాలో ఆంధ్రరాజ్యము వృద్ధిలో నుండెను. కుషాణుల రాజధాని మొదట కాబూలు అయిఉండును. పిమ్మట పెషావరుకు మార్చబడి అక్కడనే నిలిచెను. పెషావరునే పురుషపుర మందురు.

అనేకవిధములుగా కుషాణ సామ్రాజ్యము చెప్పుకోదగ్గది. అది బౌద్ధసామ్రాజ్యము. దానిని పాలించిన ప్రసిద్ధ చక్రవర్తులలో నొకడు కనిష్క చక్రవర్తి, బౌద్ధ ధర్మాభిమాని. రాజధానియగు పెషావరుసమీప మున తక్షశిల యుండెను. అది చిరకాలము బౌద్ధసంస్కృతికి కేంద్రమై యుండెను. కుషాణులు మంగోలియనులో, వారికి దగ్గర సంబంధము కలవారో యని నీకు చెప్పితినా? కుషాణరాజధానినుండి మంగోలియనుల మాతృభూములకు రాకపోకలు తీయకుండ జరుగుచు నుండియుండును. బౌద్ధవిద్య, బౌద్ధసంస్కృతి చీనాకును,మంగోలియాకును పోయియుండును. ఈవిధముగానే పశ్చిమ ఆసియా బౌద్ధభావములతో స్థిరపరిచయము కలి గించుకొనియుండవలెను. అలెగ్జాండరు కాలమునుండియు పశ్చిమఆసియా గ్రీకుల పాలనమందే యుండెను. గ్రీకులు పలువురు తమ సంస్కృతి నచ్చట ప్రవేశపెట్టిరి. ఈ గ్రీసు, ఆసియాల మిశ్రమ సంస్కృతి హైందవ బౌద్ధ సంస్కృతితో సమ్మేళన మందెను. ఈ విధముగా చీనాను, పశ్చిమ ఆసియాను ఇండియా సంస్కరించెను. ఇదేవిధముగా ఇండియా ఆ దేశ

ముఖవల్లను సంస్కరించబడెను. ఆసియాఖండముమీద మహాకాయునివలె కుషాణ సామ్రాజ్యము తిష్ఠవేసికొని కూర్చుండెను. పడమర గ్రీసు రోమను ప్రపంచము, తూర్పున చీనా ప్రపంచము, దక్షిణమున ఇండియా ప్రపంచము వీటిమధ్య కుషాణ సామ్రాజ్యము కూర్చుండెను. ఇండియా




కును రోముకును, ఇండియాకును చీనాకును మధ్య దారిలో నున్న ఇంటివలె అది యుండెను.

ఇట్లు మధ్యగా నుండుటవల్ల ఇండియాకును, రోముకును దగ్గిర సంబంధ మేర్పడుట సహజముకదా. కుషాణుల రాజ్యకాలము రోమను ప్రజాప్రభుత్వము చివరిరోజులతోను, రోమను సామ్రాజ్యము తొలి 200 సంవత్సరములతోను సరిపోవును. రోమను ప్రజాప్రభుత్వము చివరరోజు-

లలో జూలియసు సీజరు బ్రదికియుండెను. అగస్టసు సీజరువద్దకు కుషాణచక్రవర్తి ఒక గొప్ప రాయబారమంపెనని చెప్పుదురు. భూమార్గముల ద్వారాను, సముద్రమార్గముల ద్వారాను కూడ వర్తక మభివృద్ధి గాంచెను. ఇండియానుండి రోముకు పంపిన వస్తువులలో కొన్ని అత్తరువులు, సుగంధ ద్రవ్యములు, పట్టులు, జరీవేసిన పట్టుబట్టలు, సన్ననూలు బట్టలు (మస్లినులు), జరీబట్టలు, రత్నములు. ప్లినీ అను పేరుగల రోమను గ్రంథకర్త "రోమునుండి ఇండియాకు బంగారు ప్రవహించిపోవుచున్నది, మొర్రో"యని విలపించెను. ఈ భోగద్రవ్యములవల్ల రోమను సామ్రాజ్యమునకు 10 కోట్ల సెస్టర్సీలు ఖర్చు అగుచున్నట్లు అతడు చెప్పెను. అనగా సుమారు కోటిన్నర రూపాయలన్నమాట, లేదా పదిలక్షల పౌను లన్నమాట.

ఈ కాలమున బౌద్ధమఠములలోను, బౌద్ధసంఘ సమావేశముల లోను వాదములు, చర్చలు జరుగుచుండెను. నూతన భావములుగాని, నూతన వేషములలో ప్రాతభావములుగాని దక్షిణ పశ్చిమములనుండి వచ్చుచుండెను. సరళమగు బౌద్ధమత ధర్మములపై క్రమక్రమముగా వాటి ప్రభావమును అవి చూపదొడగెను. బౌద్ధమతమందు మార్పులు ప్రవేశించిన కొంతకాలమున కది రెండుశాఖలుగా చీలిపోయెను. మహాయాన మనియు, హీనయాన మనియు వాటిపేళ్ళు. నూతన వ్యాఖ్యానముల వల్లను, నూతన భావములవల్లను మత విషయములోను, జీవిత విషయములోను అదివరలోనున్న అభిప్రాయములు మారజొచ్చెను. లలితకళలు, వాస్తుశాస్త్రముకూడ ఈ మార్పులు గ్రహించెను. ఈ మార్పు లెట్లు కలిగినవో చెప్పుట సులభముకాదు. బౌద్ధాభిప్రాయముల నాకేమార్గమునకు త్రిప్పిన కారణములు రెండై యుండవచ్చును, అవి బ్రాహ్మణమత ప్రభావము, గ్రీసు ప్రభావము.

వర్ణధర్మములమీదను, మతాచార్యుల స్వార్థముమీదను, కర్మకాండముమీదను బౌద్ధమతము ధ్వజమెత్తినదని నీకు అనేకసార్లు చెప్పి

యుంటిని. గౌతముడు విగ్రహారాధన నామోదించలేదు. తాను భగ వంతుడ ననలేదు. తన్ను పూజింపమనలేదు. అతడు జ్ఞానసిద్ధి నొందిన వాడు—బుద్ధుడు. ఇందువల్లనే బుద్ధునకు విగ్రహము లేదు. ఆనాటి వాస్తుశాస్త్రము ప్రతిమానిర్మాణము నెత్తికొనలేదు. కాని బ్రాహ్మణులు, బౌద్ధహిందూమతములను వేరుచేయు కారణములను తొలగింపనెంచి, హిందూ భావములను, సంకేతములను బౌద్ధమతములో జొప్పింప ప్రయ త్నములు చేయుచునేయుండిరి. గ్రీసురోము ప్రపంచమందలి శిల్పులు దేవతల ప్రతిమలను చేయుచుండెడివారు. ఈ విధమున క్రమముగా బౌద్ధాలయములలోనికి విగ్రహములు ప్రవేశించెను. మొట్టమొదట బుద్ధ విగ్రహములు కాక బోధిసత్త్వుల విగ్రహములు ప్రవేశించెను. బౌద్ధ సంప్రదాయము ననుసరించి బోధిసత్త్వు లనగా బుద్ధుని వెనుకటి యవ తారమూర్తులు. ఇట్లు కొన్నాళ్లు జరిగినపిమ్మట బుద్ధవిగ్రహములు చేసి పూజింప మొదలిడిరి.

మహాయానబౌద్ధ మీ మార్పుల నంగీకరించెను. అవి బ్రాహ్మణ భావములకు చేరువలో నుండెను. కుషాణప్రభువులు మహాయాన బౌద్ధము నంగీకరించిరి. అది వ్యాపించుటకు తోడ్పడిరి. హీనయానబౌద్ధ మన్నను, ఇతరమతము లన్నను వారికి అసహనము లేదు. జొరాష్ట్రియన్ మత మును కూడ కనిష్కుడు ప్రోత్సహించెనని చెప్పుదురు.

మహాయానహీనయానముల తారతమ్యమునుగూర్చి పండితులు చేసిన వాదోపవాదములు చదువుటకు ముచ్చటగానుండును. ఇందుకొరకై బ్రహ్మాండమైన సంఘసమావేశములు సమకూర్చుచుండెడివారు. కని ష్కుడు కాశ్మీరములో సంఘసభ్యుల నందరిని సమావేశపరిచెను. ఈ విషయమై వాదోపవాదములు అనేకవందల సంవత్సరముల కాలము జరిగెను. ఉత్తరహిందూస్థానమున మహాయానము విజయముకాంచెను. దక్షిణమున హీనయానము విజయము కాంచెను. చివర కీ రెండు మత ములును హిందూమతములో నైక్యమయ్యెను. నేడు మహాయాన

బౌద్ధము చీనా, జపాను, టిబెట్టులలోను, హీనయాన బౌద్ధము సింహళము, బర్మాలలోను నిలిచియున్నవి.

మానవుల కళాభిరుచి వారి మనస్సులను ప్రతిబింబించును. కాబట్టియే తొలికాలమున బౌద్ధభావములు సరళముగా నుండి తరువాత బహుళమగు సంకేతములకు తావిచ్చుటవలన హైందవకళకూడ అలంకారయుక్తమై మిక్కిలి శ్రద్ధతో నిర్వహింపబడెను. ముఖ్యముగా వాయవ్యమున గాంధారమందలి మహాయానశిల్పము, మిక్కిలి సున్నితముగా, అలంకార శోభితముగా నిర్మింపబడిన ప్రతిమలతో నిండియున్నది. హీనయాన శిల్పముసైతము ఈ నూతనభావముల నుపేక్షించి యుండలేకపోయెను. క్రమముగా దాని నిగ్రహము సడలెను. సరళమగు దాని శిల్పవైఖరి మారినది. సున్నితమగు చెక్కడపుపని, సంకేతములు ప్రబలినవి.

ఈ కాలమునకు సంబంధించిన కొన్ని గుర్తులు నేడు మనకు లభ్యమగుచున్నవి. అందు మిక్కిలి అందమైనవి అజంతాచిత్రములు.

ఇక మనము కుషాణుల సెలవు తీసికొందము. కాని ఇది జ్ఞాపకముంచుకొనుము. శకులు, టుర్కీజనులు—వీరివలెనే కుషాణులు కూడ పరాజితమగు దేశమును పరదేశరాజులు వచ్చి పాలించినట్లు ఇండియాను పాలించలేదు. మతబంధములు వారి నిండియాకును, ఇండియాలోని ప్రజలకును కట్టివేసెను. ఇంతేకాదు. ఆర్యసంప్రదాయము ననుసరించి వారు ఇండియాలో రాజ్యమేలిరి. చాలవరకు ఆర్యపద్ధతుల ప్రకారము నడుచుకొనిరి కాబట్టియే ఉత్తర హిందూస్థానమును 300 సంవత్సరములపాటు ఏలగలిగిరి.

# 31

# ఏసుక్రీస్తు : క్రైస్తవమతము

ఏప్రియల్ 12, 1932.

ఇండియా వాయవ్యమున కుషాణ సామ్రాజ్యము చీనాలో హాన్ రాజవంశమును, మనలను చరిత్రలోని ముఖ్యహద్దును దాటించి తీసికొని

పోయినవి. మనము తిరిగి దానివద్దకు పోవలెను. ఇంతవరకు క్రీ. పూ. సంవత్సరములలో జరిగిన విశేషములను చెప్పుకొంటిమి. క్రీ. పూ. అనగా క్రీస్తు పుట్టుటకు పూర్వము. ఇప్పుడు మనము క్రీస్తుశకములో నున్నాము. అనగా క్రీస్తు పుట్టినట్లు చెప్పబడు తేదీనుండియు క్రీస్తుశకము ప్రారంభమగుచున్నది. నిజమునకు ఈ సంవత్సరమునకు నాలుగు సంవత్సరముల ముందు క్రీస్తు పుట్టెనని చెప్పుదురు. కాని మన కేతేదీయైనను ఒక్కటే. క్రీస్తు పుట్టినతరువాత వచ్చు సంవత్సరములను క్రీ. వె. అనుట ఆచారము. క్రీ. వె. అనగా క్రీస్తుపుట్టిన వెనుక.

క్రీస్తు అసలుపేరు ఏసు. అతని కథ బైబిలులోని నూతన నిబంధనమం దున్నది. ఇది నీకు కొంత తెలిసియుండును. సువార్తలందలి వృత్తాంతములో క్రీస్తు యౌవనకాలమునుగూర్చి చెప్పలేదు. నాజరత్‌లో క్రీస్తు జన్మించెను. గెలిలీలో మతబోధ చేసెను. ముప్పది సంవత్సరముల వయస్సు దాటినపిమ్మట జెరూసెలం వచ్చెను. వెంటనే అతనిని విచారించి పాంటియస్ పైలేటు అను రోమకరాష్ట్రపాలకుడు అతనికి శిక్షవిధించెను. ఏసు ఏమి చేసెనో, మతబోధ చేయుటకు ముందు ఎక్కడికి పెళ్లెనో తెలియరాదు. మధ్య ఆసియా అంతటను, కాశ్మీరము, లడక్, టిబెట్టులలోను, ఇంకను ఉత్తరమున నున్న దేశములలోను, ఏసు లేక ఇసా సంచరించెనని నేటికికూడ గట్టినమ్మకము కలదు. అతడు ఇండియాను కూడ దర్శించినట్లు కొందరి నమ్మకము. ఇదమిత్థమని ఏది చెప్పుటకును వీలులేదు. ఏసుజీవితమును శ్రద్ధగా చదివిన పండితులు అతడు ఇండియానుగాని, మధ్యఆసియానుగాని దర్శించలేదని చెప్పుదురు. అతడు దర్శించినను దర్శించి యుండవచ్చును. అట్లు చేయుట అసంభవము కాదు. ఆ రోజులలో ఇండియాలోని గొప్ప విశ్వవిద్యాలయములు, అందు ముఖ్యముగా వాయవ్యముననున్న తక్షశిల దూరదేశ విద్యార్థుల నాకర్షించినది. జ్ఞానార్జనకై ఏసుకూడ అక్కడికి వచ్చియుండవచ్చును. అనేకవిషయములలో ఏసుబోధలు బుద్ధుని బోధలవలెనే ఉండుటచే

అతడు బహుశా దాని సంగతి బాగుగా ఎరిగియుండవచ్చును. కాని బౌద్ధ మత మన్యదేశములో బాగుగా వ్యాపించియుండెనుగాన, ఇండియాకు రాకుండనే దానిని గురించి తెలిసికొని యుండవచ్చును.

అభిప్రాయభేదములకును, తీవ్రకలహములకును మతములు దారి తీయునని బడికిపోవు ప్రతిబాలికకు తెలియును. ప్రపంచమతముల ప్రారంభ దశలను గురించి తెలిసికొని వాని నొకదానితో నొకటి పోల్చిచూచుట లాభకరముగా నుండును. వాటి దృష్టులలో వాటి బోధలలో సమాన విష యము లనేకమున్నవి. ఇట్లుండ మనుష్యులేల తెలివితక్కువగా వివర ములకొరకును, అముఖ్యవిషయముల కొరకును కొట్లాడుదురో తెలి యదు. తొలిబోధలకు క్రమేణ క్రొత్తవిషయములు చేరినవి. అవి విరూ పము నొందినవి. వాటిని పోల్చుకొనుటయే కష్టసాధ్యమయ్యెను. సంకు చితబుద్ధులు, సహనములేని దురభిమానులు, తొలి ఆచార్యుల స్థానము నాక్రమించిరి. చాలసార్లు మతము రాజకీయములకును,సామ్రాజ్యతత్వమున కును ఊడిగము చేసినది. ప్రజల లాభముకొరకు కాదు, ప్రజలద్వారా లాభము పొందుటకు ప్రజలలో మూఢవిశ్వాసమును ప్రోత్సహించుట రోమకనీతి. మూఢవిశ్వాసముతో నున్న ప్రజలను అణచిపెట్టుట సుల భము. పెద్ద తత్వశాస్త్ర విషయములను గురించి రోమక కులీనులు చర్చలు పెట్టుకొందురుకాని తమకు ప్రియమైన విషయములు ప్రజా సామాన్యమునకు మంచివికావు. శ్రేయస్కరములు కావు. మాకియావిల్లి యను ప్రసిద్ధ ఇటలీదేశస్థుడు రాజనీతిపై నొక గ్రంథమును వ్రాసెను. పరిపాలనకు మత మావశ్యకమనియు, తాను అసత్యమని నమ్మిన మత మును సైతము పోషించుట పాలకుని విధి యనియు అత డందు వ్రాసెను. నేటికాలమునందుకూడ సామ్రాజ్యము మతవేషము ధరించి ముందుకు పోవుచున్నట్లు అనేక నిదర్శనములు కలవు. మతము ప్రజలకు నల్లమందు వంటిదని కారల్ మార్క్సు వ్రాసినాడన్న అదొక వింతకాదు.

ఏసు ఒక యూదుడు. యూదులు నాడును నేడునుకూడ పట్టుదల గల అసాధారణ పురుషులు. డేవిడ్, సాలమనుల కాలములో ఒక వెలుగు

వెలిగి తరువాత వారు దురదృష్టముల పాలైరి. ఈ వెలుగైనను కొద్ది పాటిదే. కాని వారి దృష్టిలో అది ఎంతో ఘనమైనది. ప్రాతకాలమునాటి బంగారుయుగమని వారు దానిని భావించుచుండిరి. ఆ యుగము మరల విదిష్టకాలమున వచ్చుననియు, అప్పుడు యూదులు గొప్పవారు, ప్రబలురు అగుదురనియు వారి భావన. రోమక సామ్రాజ్యమందంతటను, ఇతర భూములందును వారు వ్యాపించిరి. కాని వారందరును తమకు కీర్తికాలము రానున్నదనియు, తమ రక్షకుడు దానిని ప్రవేశపెట్టు ననియు నమ్మకముతో ఒక కట్టుమీద నుండిరి. ఇల్లు లేక తలదాచుకొనుటకు తావులేక, అపరిమితముగా హింసింపబడుచు, బాధింపబడుచు, ఒక్కొక్కసారి మృత్యుముఖమును చొచ్చుచు యూదులు తమ వ్యక్తిత్వమును నిలువ బెట్టుకొని 2000 సంవత్సరములపాటు కట్టుగా నుండుట చరిత్రలో అద్భుతవిషయము.

రక్షకుడు వచ్చునని యూదులు ఆశపెట్టుకొనియుండిరి. ఏసు అట్టి వా డనుకొనిరేమోకాని వారికి వెంటనే ఆశాభంగము కలిగెను. నాటి పరిస్థితులకును, సంఘమునకును వ్యతిరేకముగా ఏసు విప్లవ వాక్యములను పలికెను. ముఖ్యముగా మతమన్న వ్రతములు, కర్మలు మాత్రమే అని నమ్మిన భాగ్యవంతులను, దంభాచారులను ఏసు నిరసించెను. ధనము, కీర్తి వచ్చునని వారికి చెప్పుటకుబదులు, ఉన్నదంతయు వదలుకొమ్మని చెప్పెను. ఇట్లు వదలుకొనిన అస్పష్టము, కల్పితము నగు 'పరలోక రాజ్యము' వారికి చేకూరునని చెప్పెను. అతడు కథల ద్వారాను, నీతి కథలద్వారాను బోధలు గావించెను. కాని అతడు పుట్టుకతోనే విప్లవకారుడై యుండెననుట స్పష్టము. అప్పుడున్న పరిస్థితు లతనికి నచ్చలేదు. వానిని మార్చుట కతడు పూనుకొనెను. యూదులు కోరిన దిదికాదు. కాన వారిలో పలువురు అతనికి వ్యతిరేకులైరి. అతనిని రోమక అధికారులకు పట్టి యిచ్చిరి.

మతముల విషయమున రోమకులు అసహనబుద్ధి కలవారు కారు. అందుకు కారణము సామ్రాజ్యమున అన్నిమతములును ఉండవచ్చును.

ఎవరైనను దేవతలను నిందించినను వారిని దండించెడివారు కారు. టిబిరియసు అను ఒక చక్రవర్తి చెప్పినట్లు, "దేవతలను నిందించిన దేవతలే ఆ విషయమును చూచుకొందురు." కాన రోమకరాష్ట్రపాలకు డగు పాంటియస్‌పైలేటు సమక్షమున ఏసును నిలబెట్టినప్పుడు అతడు విచారించు సమయమున మతమునకు సంబంధించిన అంశములను గమనించి యుండడు. రాజకీయ విప్లవకారుడని ఏసును భావించిరి. సాంఘిక విప్లవకారుడని యూదులు భావించిరి. ఆ భావనతోనే అతనిని విచారించి శిక్ష విధించి గోల్గోతావద్ద సిలువను వేసిరి. తుది నిముషములలో అతడత్యంతవేదన నొందుచున్నసమయమున అతని ప్రధానశిష్యులు అతనిని పరిత్యజించిరి. అతనిని కాదనిరి. ఇట్లు వారు వంచనచేయుటవల్ల అతని దుఃఖము దుర్భరమయ్యెను. అందువల్లనే మరణమునకు ముందు అతడు జాలినిగొల్పు ఈ మాట లనెను: "ఓ నా భగవంతుడా, నా భగవంతుడా, నన్నేల విడిచిపెట్టితివి?"

మరణకాలమునకు ఏసువయస్సు దాదాపు 30 సంవత్సరములు మాత్రమే. సువార్తలలో అతని మరణకథ చక్కని భాషలో వర్ణింపబడినది. అది చదివినప్పుడు మన మనస్సు జాలితో నిండును. ఎంతో కాలము గడచినపిమ్మట క్రైస్తవమతము వ్యాప్తిలోనికి వచ్చినది. లక్షలకొద్ది జనులు ఏసుపేరును పూజింతురు. కాని అతని బోధల ననుసరించువారు లేరు. అతనిని సిలువవేసినప్పుడు పాలస్తీనా దాటి అతనిపే రెవ్వరికిని తెలియదని మనము జ్ఞాపకముంచుకొనవలెను. రోములోని ప్రజల కతని సంగతి తెలియదు. పాంటియస్ పైలేటుసైతము జరిగినదాని నంత ముఖ్యవిషయముగా భావించలేదు.

ఏసు నంటియున్న అనుచరులు, శిష్యులు భయపడిపోయి అతనిని కాదనిరి. కాని ఏసు మరణానంతరము ఒక క్రొత్తవాడు, పౌలు అను పేరు గలవాడు, ఏసును ఎన్నడును చూడనివాడు, తనకు క్రైస్తవ మత సిద్ధాంతమని తోచినదానిని వ్యాప్తినందించ ప్రారంభించెను. పౌలు

బోధించిన క్రైస్తవము ఏసుబోధలకు భిన్నముగా నుండెనని పలువురు తలంతురు. పౌలు సమర్థుడు, చదువుకొన్నవాడు. ఏసువలె సాంఘిక విప్లవకారుడు కాడు. పౌలు కృతార్థు డయ్యెను. క్రైస్తవమతము క్రమముగా వ్యాపింపదొడగెను. ప్రారంభమున రోమకులు దాని నుపేక్షచేసిరి. క్రైస్తవులు యూదులలో ఒక తెగవారని వారు భావించిరి. కాని క్రైస్తవులు మీదిమీదికి వచ్చుచుండిరి. ఇతర మతము లన్నిటిమీద శత్రుత్వము వహించుచుండిరి. చక్రవర్తి ప్రతిమను పూజించుటకు వా రియ్యకుండిరి. రోమకులకు వీరి ప్రవర్తన మర్థముకాలేదు. అది సంకుచిత బుద్ధివలె తోచెను. అందువల్ల క్రైస్తవులు తలతిక్క మనుష్యు లనియు, కలహశీలురనియు, విజ్ఞానవిహీను లనియు, మానవాభివృద్ధి నరికట్టువా రనియు వారు తలచిరి. క్రైస్తవమతమును రోమకులు సహించియుండెడివారే, కాని చక్రవర్తిప్రతిమను పూజింప నిరాకరించుట రాజద్రోహమైనది. రాజద్రోహమునకు శిక్ష మరణదండనమే. అంతేకాదు. క్రైస్తవులు మల్లప్రదర్శనములను కూడ గర్హించుచుండిరి. అప్పుడు క్రైస్తవులను హింసించుట ప్రారంభమైనది. వారి ఆస్తులు ప్రభుత్వము స్వాధీనము చేసికొనెను. వారు సింహముల కాహారముగా వేయబడిరి. మతమునకై ప్రాణము లర్పించిన క్రైస్తవవీరుల కథలు నీవు చదివియుందువు. సినీమాలలోకూడ చూచియుందువు. ఒక పవిత్రకార్యమునకై ప్రాణము లర్పింప సిద్ధపడువానిని, అట్టి మరణ మనన్యలబ్ధ మని భావించువానిని అణచిపెట్టుట కష్టము. అట్టికార్యమును కూడ అణచిపెట్టుట కష్టము. రోమకసామ్రాజ్యము క్రైస్తవుల నణచిపెట్టలేకపోయెను. చివరకు క్రైస్తవమతమునకే విజయము చిక్కెను. నాల్గవశతాబ్ది మొదటిరోజులలో ఒక రోమక చక్రవర్తి క్రైస్తవు డయ్యెను, సామ్రాజ్యమున క్రైస్తవమతము రాజసమ్మతమగు మత మాయెను. ఇతని పేరు కాంస్టెంటైను. ఇతడే కాంస్టాంటినోపుల్ పట్టణమును ప్రతిష్ఠించెను. తరువాతమరల నితనిసంగతి ఎత్తుకొందము.

క్రైస్తవము అభివృద్ధి చెందుకాలమున ఏసు దేవుడగునా, కాదా యను విషయమై తీవ్రకలహములు చెలరేగెను. నేను చెప్పిన విషయము నీకు జ్ఞాపకమున్నదో లేదో—గౌతమబుద్ధుడు తాను దేవుడనని చెప్పుకో లేదు. కాని అతనిని అవతారపురుషుడుగా, దేవుడుగా పూజించుచుండిరి. అట్లే ఏసుకూడ తాను దేవుడ నని చెప్పుకోలేదు. నేను దేవుని పుత్రుడ నని, మానవుని పుత్రుడనని పలుమారులు చెప్పుకొని యుండెను కాన దైవత్వముకాని, అమానుషత్వముకాని అతడు తనయం దారోపించుకొనవ లేదు. కాని మానవులు తమ మహాపురుషులను దేవుళ్ళనుగా చేయు చుందురు. వారికి దేవత్వ మారోపించి, వారి బోధలను విస్మరింతురు. 600 సంవత్సరముల తరువాత మహమ్మదుప్రవక్త వేరొక గొప్ప మత మును స్థాపించెను. కాని వెనుకటి సందర్భముల నెరిగినవాడు కావున, అతడు విస్పష్టముగా అనేకమార్లు తాను మానవుడనే అనియు, దేవుడను కాననియు చెప్పెను.

కాబట్టి ఏసుబోధల నర్థముచేసికొని అనుసరించుటకు బదులు క్రైస్తవులు ఏసు దేవుడగునా కాదా యనియు, త్రిమూర్తిత్వమును గురించియు వ్యర్థకలహములు పెంచుకొని వాదులాడుచుండిరి. అక్రైస్త వులని ఒకరినొకరు నిందించుకొనుచుండిరి. ఒకరి నొకరు హింసించు కొనుచుండిరి. తలలు నరుకుకొనుచుండిరి. ఒకమారు ఒక మాటలోని రెండచ్చులు కలిసియుండుటనుగూర్చి తీవ్రవాదములు చెలరేగెను. ఈ విష యము ఏసుదైవత్వమునకు సంబంధించినది. వాదములనుండి ఘోర యుద్ధములోనికి భిన్నతెగల క్రైస్తవులు దిగిరి. అనేకు లీయుద్ధమందు హత్యచేయబడిరి.

క్రైస్తవము ప్రబలమగు కాలమున నీతగవులు పుట్టెను. పశ్చిమ దేశమున మొన్నమొన్నటివరకు వేర్వేరు క్రైస్తవతెగలలో ఈ తగవులు జరుగుచునే యుండెను.

క్రైస్తవమతము, ఇంగ్లాండుకుగాని, పశ్చిమ యూరోపుకుగాని పోవుటకు ముందు దానిని రోములో గర్హించి నిషేధించుకాలమున ఇండి

యాకు వచ్చినదని తెలిసికొన్న ఆశ్చర్యపడుదువు. ఏసు మరణించిన సుమారు నూరుసంవత్సరములకు క్రైస్తవమత ప్రచారకులు సముద్ర మార్గమున దక్షిణఇండియాకు వచ్చిరి. మర్యాదగా వారి నాహ్వానించి, తమ క్రొత్తమతమును ప్రచారము చేసికోవచ్చునని ఆనాటి ప్రజలు చెప్పిరి. అనేకులను వారు మతాంతరులను జేసిరి. వారి సంతతివారు, కష్టమువచ్చినను సుఖము వచ్చినను సరేయని, నేటివరకు అక్కడనే నిలిచిపోయిరి. వారిలో పెక్కురు ప్రాతక్రైస్తవతెగలకు చెందినవారు. ఆ తెగలు నేడు యూరోపులో అంతరించినవి. కొన్ని నేడు ఆసియామైనరులో ప్రధాన స్థానముల నేర్పరుచుకొనియుండిరి.

రాజకీయముగా క్రైస్తవమతము నేడు ప్రబలముగా నున్నది. యూరోపులో ప్రబలజాతుల మత మదికాబట్టి. అహింసను, సాంఘికపరిస్థితులపై తిరుగుబాటును ఉపదేశించిన విప్లవకారుడగు ఏసు ఎక్కడ. సామ్రాజ్యములతో, ఆయుధసామగ్రితో, యుద్ధములతో. ధనారాధనతో మిడిసిపడుచు నేడతనిని బిగ్గరగా ప్రకటించు అతని అనుచరు లెక్కడ! వింతగా లేదూ? పర్వతోపదేశ మెక్కడ, నేటి యూరోపియనుల, అమెరికనుల క్రైస్తవమెక్కడ? వీటి కేమైన పోలిక ఉన్నదా? పడమటి దేశములలో నేడు, అతని అనుచరులమని చెప్పుకొను పలువురకన్న బాపు (మహాత్మా గాంధీ) ఏసుబోధల కతిసమీపములో నున్నాడని పలువురు భావించుటలో ఆశ్చర్యమేమున్నది?

## 32

# రోమక సామ్రాజ్యము

ఏప్రియల్ 23, 1932.

అమ్మా, నీ కెన్నాళ్ళనుంచో జాబు వ్రాయలేదు. అలహాబాదునుంచి వచ్చిన వార్తలు నా మనస్సును కలచివేసినవి. ముఖ్యముగా మా అమ్మ. అనగా మీ నాయనమ్మను గురించి వచ్చిన వార్తలు. మా అమ్మ, ఓపిక

లేక దుర్బల శరీరముతో ఉన్న మా అమ్మ, పోలీసువాళ్ళ లాఠీదెబ్బలు తినవలసి వచ్చినదట. నే నీజైలులో సుఖముగా ఉన్నాననే మాట నాకు రోషము కలిగించుచున్నది. కాని నా ఊహలను నిరంకుశముగా పోనిచ్చి నందువల్ల లాభము లేదు. అవి మన కథ కడ్డువచ్చును.

మనము రోమునకు తిరిగిపోదము. ప్రాచీనసంస్కృత గ్రంథము లలో రోముకు రోమకనామము వాడబడినది. రోములో ప్రజాప్రభుత్వ మంతరించినట్లును, రోమకసామ్రాజ్యము తలయెత్తినట్లును చెప్పు కొన్నాము. జూలియస్ సీజరు దత్తపుత్రుడు ఆక్టేవియన్ అగస్టసుసీజ రను పేర మొదటి చక్రవర్తి యయ్యెను. అతడు రాజనామము వహించ లేదు. అందుకు కొంత కారణము ఆ పేరు తన తాహతుకు సరిపోయినంత గొప్పది కాదని. కొంత కారణము ప్రజాప్రభుత్వ బాహ్యాచిహ్నముల నాతడు నిలుపదలచెను. కాబట్టి అతడు 'ఇంపరేటర్' అను నామము వహించెను. ఈ పదమునకు సేనాని అని యర్థము. 'ఇంపరేటర్' అను పదము అత్యుత్తమ మగు బిరుదుగా పరిణమించెను. దీనినుండియే చక్ర వర్తి యను అర్థముగల ఎంపరర్ అను మాట వచ్చినదని నీకు తెలిసి యుండును. తొలి రోమకసామ్రాజ్యము రెండుమాటల నిచ్చినది. ఆమాట లను ప్రపంచమందలి ప్రభువులు పెక్కురు తాము కోరి వాడుకొను చుండెడివారు. ఆ మాటలు 1 ఎంపరర్ (చక్రవర్తి) 2 సీజరు లేదా కైజరు లేదా జారు. ఒకేమారు ఒకడే చక్రవర్తి యుండవలెనని తొలుత భావించుచుండిరి. యావత్ప్రపంచమునకు అతడు ప్రభువు. "ప్రపంచము నకు యజమానురాలు" అను బిరుదు రోమున కుండెడిది. పాశ్చాత్యదేశ ప్రజలు ప్రపంచమందెల్ల రోము మిన్నయై యుండెనని తలంచుచుండిరి. అది కల్ల. చరిత్రజ్ఞానము, భూగోళజ్ఞానము లేనివారు చెప్పిన మాట. రోమక సామ్రాజ్యము చాలవరకు మధ్యధరా సామ్రాజ్యము మాత్రమే. తూర్పున మెసపొటేమియా దాటి అది విస్తరించలేదు ఆయాకాలము లందు అంతకన్న గొప్పవియు, ప్రబలమైనవియు, సంస్కృతి సంపన్న

ములును అయిన రాజ్యములు చీనాలోను, ఇండియాలోను ఉండెను. అయినను, పాశ్చాత్యప్రపంచమునకు సంబంధించినంతవరకు రోము ఒక్కటియే ఏకైక సామ్రాజ్యము. కాన ప్రాచీనుల దృష్టిలో అది ప్రపంచ సామ్రాజ్యముగా పరిగణింపబడెను. దాని పలుకుబడికూడ మిక్కిలి గొప్పది.

రోమునుగురించిన అద్భుతవిషయము ఒకటి కలదు. అది రోము నంటియుండు భావన. ప్రపంచనాయకత్వము, సార్వభౌమత్వము అను భావన. రోము పతనమైనప్పుడు సైతము దానిని రక్షించి, బలము నిచ్చిన దీ భావనయే. దాని సామ్రాజ్య మంతరించినను ఈ భావనమాత్రము నిలిచినది.

రోమును గురించియు, దాని నేలిన రాజపరంపరను గూర్చియు వ్రాయుటకు నాకు కొంచెము కష్టముగా నున్నది. కారాగారమం దున్నప్పుడు ప్రాతగ్రంథములు చదివి తెలిసికొన్న విషయములు కలగాపులగముగా నా మనస్సులో ఉన్నవి. నీ కేవిషయమును గురించి వ్రాయవలెనో నిర్ణయించలేకున్నాను. కారాగారవాసమే తటస్థించకున్న ఒక ప్రసిద్ధ రోమకచరిత్ర గ్రంథమును నేను చదివియుండెడివాడనే కాను. ఆ పుస్తకము చాల పెద్దది. ఇతర వ్యావృత్తులలో తగుల్కొనుటచే ఆ గ్రంథమును పూర్తిగా చదువుటకు సావకాశము చిక్కెడిదికాదు. దాని పేరు "రోమక సామ్రాజ్యక్షీణదశ, దాని పతనము." గిబ్బను అను పేరు గల ఇంగ్లీషు గ్రంథకర్త దానిని వ్రాసెను. స్విట్జర్లాండులో లాక్‌లీమన్ తీరమున, 150 సంవత్సరముల క్రితము, అది వ్రాయబడినది. కాని నేడు చదివినను అది మనోహరముగా నుండును. కొంత ఆడంబరముగా నున్నప్పటికిని అందలిభాష మధురమైనది. నవలకన్న ఎక్కువ ఆకర్షణీయముగా నున్న దందలి కథ. పదిసంవత్సరముల క్రితము లక్నోజిల్లా జైలులో నేను దానిని చదివితిని. ఒక నెలపైగా గిబ్బనుతో సహవాసము చేసితిని. అతని భాష జనింపజేసిన ప్రాచీనకాలపు చిత్రములచే నావరింప

బడి నెల యుంటిని. ఇంతలో నన్ను హఠాత్తుగా విడుదలచేసిరి. అప్పటికి పుస్తకము పూర్తికాలేదు. తరువాత ప్రాచీనరోముకును, కాంస్టాంటి నోపిల్‌కును తిరిగిపోయి మిగిలిన నూరుపుటలను చదువుటకు నాకు సావకాశమే కలుగలేదు.

ఇది పదిసంవత్సరముల క్రితము మాట. చదివినదానిలో చాల వరకు నేను మరచితిని. మిగిలినది నా మనస్సులో నిలిచి దానిని తబ్బిబ్బు చేయుచున్నది. చిందరవందరగా నున్న ఈ విషయములను నీకు చెప్పుటకు నా కిష్టములేదు.

మొట్టమొదట రోమక సామ్రాజ్యమును, లేదా సామ్రాజ్యములను యుగములగుండా చూతము. తరువాత కథ పూర్తిచేయుటకు ప్రయత్నించ వచ్చును.

క్రీస్తుశక ప్రారంభమున అగస్టసు సీజరుతో సామ్రాజ్యము ప్రారంభమైనది. కొద్దికాలము చక్రవర్తులు సెనేటును గౌరవించెడివారు. కాని త్వరలోనే ప్రజాప్రభుత్వ చిహ్నాలు మాయమైనవి. చక్రవర్తి సర్వాధికారి యయ్యెను. నిరంకుశప్రభు వయ్యెను. దేవునితో తుల్యు డాయెను. ఆతనిని దైవాంశ సంభూతుడని భావించి ఆతని జీవితకాలమందే ప్రజ లాతని పూజించిరి. మరణానంతర మాతడు సంపూర్ణ దేవు డయ్యెను. ఆనాటి గ్రంథకర్త లందరును, తొలిచక్రవర్తులు పెక్కురు సద్గుణరాసు లని వర్ణించిరి. ముఖ్యముగా అగస్టసు అట్టివాడు. అగస్టసు పాలించిన కాలమునకు అగస్టసుయుగమనియు, బంగారు యుగమనియు పేరు పెట్టిరి. ఆ కాలమున సద్గుణములు ఎల్లెడల వ్యాపించెను. సాధువులు బహూకరింపబడిరి. దుష్టులు శిక్షింపబడిరి. నిరంకుశ ప్రభుత్వములక్రింద నుండు గ్రంథకర్తల తీరు పైవిధముగా నుండును. రాజును స్తుతించిన లాభకరమేకదా వారికి ? మిక్కిలి ప్రసిద్ధిజెందిన లాటిను గ్రంథకర్తలు కొందరు—వర్జిల్, ఓవిడ్, హొరేస్ అనువారు ఈకాలమున నుండిరి. వీరి గ్రంథములను మేము బడులలో చదువవలసియుండెను. ప్రజాప్రభు-

త్వము చివరరోజులలో ఎడతెగకుండ అంతర్యుద్ధములు, చిక్కులు తటస్థించినవి. తరువాత విశ్రాంతి, నెమ్మది కలిగినవి. అప్పుడు వర్తకము, నాగరీకము అభివృద్ధినందినవి. ఈవిధముగా సుఖదినములు వచ్చిన వని ప్రజ లనుకొనియుందురు.

కాని ఈనాగరీక మెట్టిది? ఇది భాగ్యవంతుని నాగరికత. ఈ భాగ్యవంతులైనను, ప్రాచీనగ్రీసులోని కళాభిరుచి గల మేధావులగు భాగ్యవంతులవంటివారు కారు. వట్టి సామాన్యులు. భోగము లనుభవించుటే వారి ముఖ్యవ్యాపారము. ప్రపంచ మన్నిప్రాంతములనుండియు ఆహారపదార్థములు, భోగపదార్థములు వారికై వచ్చుచుండెను. ఈజాతి ప్రజలు అంతరించలేదు. ఇంకను ఉన్నారు. వైభవము, పటాటోపము, ఉత్సవములు, సర్కసులో క్రీడలు, మృత్యువునోట ప్రవేశించు మల్లులు ఆరోజులలో కలరు. ఈవైభవమువెనుక సామాన్యప్రజల దుఃఖ మున్నది. పన్నులు ఎక్కువగా వేయుచుండిరి. చెల్లించు భారము ముఖ్యముగా ప్రజాసామాన్యముపై బడుచుండెను. చేయవలసిన పనులన్నియు బానిసలు చేయుచుండిరి. మందులువేయుట, తత్వవిచారము, ఆలోచనలు చేయుట కూడ రోములోని ఘనులు కారు, చాలవరకు బానిసలే! విద్య నభ్యసింపజేయుటకు ప్రయత్నములు లేవు. లోకమునకు యజమానులమని వారు చెప్పుకొనుటయేగాని, ఆ లోకమునుగూర్చి యథార్థవిషయములను నేర్చుకొన వారు యత్నించలేదు.

చక్రవర్తితరువాత చక్రవర్తి వచ్చెను. కొందరు చెడ్డవారు. కొందరు మరీ చెడ్డవారు. క్రమముగా సైన్యము సర్వాధికారములు వహించెను. చక్రవర్తులను కీలుబొమ్మలవలె ఆడించుచుండెను. సేనాధికారుల అనుగ్రహము పొందుటకు వారు ప్రాకులాడజొచ్చిరి. సామాన్య ప్రజలనుండియు, పరాజితదేశములనుండియు ధనమును పిండి పుచ్చుకొని సేనాధికారులకు లంచములిచ్చుచుండిరి. ముఖ్యమగు ఆదాయములలో నొకటి బానిసవ్యాపారము. తూర్పుదేశములలో బానిసలకోసము రోమక

సైన్యములు వేటాడుచుండెను. బానిసవర్తకులు సైన్యముతో పోయి బాని సల నక్కడే కొనుచుండిరి. ప్రాచీనగ్రీకులు పవిత్రముగా చూచుకొను డీలాసుద్వీపము బానిసవ్యాపారమునకు మార్కెట్టయినది. ఒక్కొక్క మారు దినమునకు 10,000 బానిసలు అమ్ముడుబోవుచుండిరి! రోము లోని "కలోసియం" లో జనప్రియుడగు ఒక చక్రవర్తి తడవకు 1200 మల్లులను ప్రదర్శించెడివాడట—ఈ మల్లులు బానిసలే. చక్రవర్తిగారికిని అతని ప్రజలకును వినోదము కల్పించుటకై వారు మరణించవలసి యుండెను.

సామ్రాజ్యకాలమున రోమకనాగరికత ఈ తీరున నుండెను. అయినను మన గిబ్బను ఇట్లు వ్రాయుచున్నాడు: "ప్రపంచచరిత్రలో అమిత సౌఖ్యముతోను, భాగ్యవంతముగాను మానవజాతి ఏ కాలభాగ మున నున్న దన్నప్పుడు, డొమీషియన్ మరణానంతరమును, కమ్మోడస్ పట్టాభిషేకమునకు పూర్వమునను ఉన్నదని నిస్సందేహముగా ప్రతిమాన వుడును చెప్పును"—అనగా ఈ కాలము క్రీ. వె. 96 మొదలు క్రీ. వె. 180 వరకు నుండు 84 సంవత్సరములు. గిబ్బను చదువుకొన్నవాడే. కాని అతని అభిప్రాయముతో పలువురు ఏకీభవించరు. అతడు 'మానవ జాతి' అన్నాడు. దాని కర్థము ముఖ్యముగా మధ్యధరా ప్రపంచమని. అతనికి ఇండియా, చీనా, ప్రాచీన ఈజిప్టులనుగూర్చి తెలిసినది కొంచెము. అసలే తెలియకపోవచ్చునుకూడ.

రోమునుగూర్చి కఠినముగా మాటాడుచున్నానుకాబోలు. రోమను రాజ్యములో కొంతవరకు శాంతి, నెమ్మదులు కలుగుట మంచిదే. పొలి మేరలలో తరుచు యుద్ధములు జరుగుచుండెను కాని, సామ్రాజ్యములో, తొలిరోజులలో ముఖ్యముగా, రోమకశాంతి యుండెను. భద్రతకూడ ఉండెను. దీనినిబట్టి వర్తకము వృద్ధినందెను. రోమకప్రపంచమం దెల్ల రును పౌరులుకావచ్చును. కాని బానిసలు కాలేరుసుమా. చక్రవర్తి సర్వాధి కారియనియు, పౌరుల కున్న హక్కులు స్వల్పమనియు జ్ఞాపకముంచు

కొనుము. రాజకీయ విషయములను చర్చించుట రాజద్రోహముగా నెన్న బడవచ్చును. పై తరగతుల ప్రజలకు ఒకేవిధమగు దొరతనమును, ఒకే శాసనమును ఉండెను. ఇంతకన్న నిరంకుశమగు ప్రభుత్వములో, వెనుకటి రోజులలో బాధపడిన పలువురు ప్రజల కిది సదుపాయముగానే ఉండెను.

క్రమక్రమముగా రోమనులు సోమరులైరి. తమ సేనలలో చేరి పోరాడుటకుకూడ వారికి అర్హత పోయినది. గ్రామములలోని వ్యవసాయ దారులు తమ భారములు భరించలేక మరింత దరిద్రులైరి. పట్టణముల లోని ప్రజలును దరిద్రులైరి. కాని ప్రజలనుండి ఎట్టి ప్రమాదమును కలుగ కుండ, వారిని లాలించి సంతోషపెట్టుటకు చక్రవర్తులు ప్రయత్నింప దొడగిరి. ఇందులకై రోములో నున్నవారి కుచితముగా ఆహారము నిచ్చు చుండిరి. వారికి వినోదము కల్పించుటకు సర్కసులో క్రీడ లుండెడివి. ఆ విధముగా వారిని మంచిచేసికొనిరి. కాని ఉచితముగా ఆహారము పంచిపెట్టుట కొద్దిస్థలములలోనే జరుగుచుండెను. ఇందుకై ఉచితముగా పిండి ఈజిప్టు మున్నగు దేశములనుండి వచ్చుచుండెను. అందలి బానిస జనులు బాధలను, దుఃఖములను సహించి ఈ పిండిని తయారుచేయు చుండిరి.

సేనలలో రోమను ప్రజలు ఐచ్ఛికముగా చేరకుండుటచే, సామ్రా జ్యములో లేని జనులను—వీరిని బర్బరు లనువారు—చేర్చుచుండిరి. రోమనుసైన్యములలో చాలభాగము రోముకు శత్రువులైన బర్బరుల మిత్రులో, బంధువులో ఉండిరి. పొలిమేరలవద్ద ఈ బర్బర తెగలు నిరంతరము రోమనులకు ఒత్తిడి కలిగించుచుండిరి. రోము బలహీన మగుచున్నకొలది బర్బరులు ప్రబలులై సాహసింప మొదలుపెట్టిరి. తూర్పున ముఖ్యముగా ప్రమాదకరముగా నుండెను. ఈ పొలిమేర రోముకు దూరముగా నుండుటచే దానిని రక్షించుకొనుట కష్టముగా నుండెను. అగస్టస్ సీజరు అనంతరము 300 సంవత్సరములకు కాంస్టన్ టైను అను చక్రవర్తి ఒక గొప్ప పని చేసెను. అతడు తన రాజధానిని

రోమునుండి తూర్పుకు మార్చెను. బోస్ఫొరస్ తీరమున, నల్లసముద్ర మధ్యధరాసముద్రములకు మధ్య బైజాంటియం అను ప్రాచీన నగరము దగ్గిర, అత డొక నగరమును ప్రతిష్ఠించెను. దానికి కాంస్టాంటినోపుల్ అని తన పేరుపెట్టెను. దానిని క్రొత్త రోము అనికూడ పేర్కొను వారు. కాంస్టాంటినోపుల్ రోమకసామ్రాజ్యమునకు రాజధాని యయ్యెను. నేడుకూడ ఆసియా పలుప్రాంతములలో కాంస్టాంటినోపులును రూమ్ అనియో, రోమ్ అనియో పిలుతురు.

## 33

## రోము చీలిపోయి నామమాత్రావశిష్టమగుట

ఏప్రియల్ 24, 1932.

రోము సామ్రాజ్యావలోకనమును ఈ దినమున సాగింతము. క్రీస్తుశకము నాల్గవ శతాబ్దాదిని—క్రీ. వె. 326 లో—కాంస్టాంటైను, బైజాంటియంవద్ద కాంస్టాంటినోపుల్‌ను ప్రతిష్ఠించి, తన రాజధానిని ప్రాత రోమునుండి బోస్ఫొరస్ మీదనున్న ఈ కొత్త రోమునకు మార్చెను. దేశపటమును చూడుము. కాంస్టాంటినోపుల్ నగరము యూరోపు అంచున, ఆసియాను చూచుచున్నట్లు కనిపించును. ఈ రెండు ఖండములకును అది సంబంధ మేర్పరచుచున్నది. గొప్ప వర్తక మార్గము లనేకము భూమిగుండా, సముద్రముగుండా దానిమీదనుండియే పోవు చుండెను. నగరమునకు, రాజధానికికూడ అస్థలము తగియున్నది. కాంస్టాంటైను చక్కని స్థలమును ఎన్నుకొనెను కాని అతడును, అతని తరువాత వచ్చిన చక్రవర్తులును, రాజధానిని మార్చినందువల్ల వచ్చిన ఫలితము ననుభవింపవలసి వచ్చెను. ప్రాతరోము ఆసియామైనరుకును, తూర్పునకును దూరముగా నున్నట్లే, క్రొత్త రాజధాని గాల్, బ్రిటన్ మున్నగు పశ్చిమదేశములకు సుదూరమైనది.

ఈ ఇబ్బంది తొలగించుకొనుటకు ఇద్దరు చక్రవర్తులు ఉమ్మడిగా పాలించవలసి వచ్చెను. ఒకడు రోములోను, రెండవవాడు కాంస్టాంటి నోపుల్‌లోను. దీనివల్ల సామ్రాజ్యము రెండు విభాగము లైనది: తూర్పు సామ్రాజ్య మనియు, పడమటి సామ్రాజ్యమనియు. రోము రాజధానిగా గల పడమటి సామ్రాజ్యము విభజనానంతరము చిరకాలము జీవించ లేదు. తాను బర్బరులని పిలిచినవారినుండి రక్షించుకొనలేకపోయెను. గాతు లను జర్మానిక్ తెగవారు వచ్చి రోమును కొల్లగొట్టిరి. తరువాత వాండలులు, హూణులు వచ్చిరి. పశ్చిమ సామ్రాజ్యము కూలిపోయెను. హూణశబ్ద మిదివరలో నీవు వినియుందువు. గత మహాసంగ్రామములో ఇంగ్లీషువారు జర్మనుల నుద్దేశించి ఈ మాట సామాన్యముగా వాడెడివారు. జర్మనులు క్రూరులు, అనాగరికులు అని తెలుపుటకు వా రట్లు వాడు చుండిరి. నిజమునకు యుద్ధకాలమున అందరును మతిచెడి, నేర్చిన నాగ రికతను మరచి, మర్యాద మరచి, క్రూరముగాను అనాగరికముగాను ప్రవర్తింతురు. జర్మను లీవిధముగా ప్రవర్తించిరి. ఇంగ్లీషువారును, ఫ్రెంచివారునుకూడ ఇట్లు ప్రవర్తించిరి. ఈ విషయమున వారిలో తార తమ్యము చూడనవసరములేదు.

హూణశబ్దము పెద్ద తిట్టుగా భావింపబడుచున్నది. వాండలుశబ్దము కూడ అంతే. బహుశా హూణులును, వాండలులును మోటుమనుష్యు లును, క్రూరులును అయియుండవచ్చును. ఎక్కువగా చెరుపు చేసియుండ వచ్చును. వారిని గురించిన వృత్తాంత మంతయు వారి శత్రులైన రోమ నులు చెప్పినదే. వారు పక్షపాతులు కారని చెప్పుటకు వీలులేదు. ఏమైనను గాతులు, హూణులు, వాండలులు పశ్చిమ రోమక సామ్రాజ్యమును పేక ముక్కలమేడను పడగొట్టినట్లు పడగొట్టిరి. వారు విజయమందుట కొక కారణము బహుశా—సామ్రాజ్యమున రోమనురైతులు దైన్యదశ నమిత ముగా ననుభవించుచుండిరి. హెచ్చుపన్ను లిచ్చుకొనుచుండిరి. అప్పుల పాలై యుండిరి. ఎట్టి మార్పు వచ్చినను వారికి సమ్మతముగానే ఉండెను.

మన ఇండియాలోని బీదరైతు నేడు దారిద్ర్యదుఃఖము ననుభవించలేక ఎట్టిమార్పు నైనను అంగీకరించుటకు సిద్ధముగా నున్నాడుకదా.

పడమటి రోమకసామ్రాజ్య మా విధముగా నేలకొరగెను. కొన్ని శతాబ్దుల తరువాత వేరొకరూపముతో అది లేవనున్నది. తూర్పు సామ్రాజ్యము మాత్రము, హూణాదుల ఒత్తిడి వహించుట కష్టముగానున్నను, నిలిచియుండెను. ఈ ఒత్తిడిని సహించి నిలుచుటయే కాదు, అరబ్బుల తోను, తరువాత తురుష్కులతోను నిరంతరము పోరాడవలసి వచ్చినప్పటికిని అది శతాబ్దులకాలము నిలిచియే యుండెను. 1100 సంవత్సరముల కాల మది నిలిచియుండుట ఎంతటి ఆశ్చర్యము! క్రీ. వె. 1453 సం॥ న ఆటమన్ తురుష్కులు (ఆస్మన్‌లీస్‌లు) కాంస్టాంటినోపుల్‌ను స్వాధీనము చేసికొనుటవల్ల అది పతనమయ్యెను. నాటినుండియు, అనగా నేటికి 500 సంవత్సరముల కాలము నుండియు కాంస్టాంటినోపులు—దీనినే నేడు ఇస్తాంబుల్ అందురు— తురుష్కుల స్వాధీనమందే యుండెను. అప్పటినుండి వారు యూరోపులోనికి చొచ్చుకొనిపోయి చివరకు వియన్నాప్రాకారమును సమీపించిరి. తరువాతి శతాబ్దులలో వారు క్రమక్రమముగా వెనుకకు తరుమగొట్టబడిరి. పన్నెండు సంవత్సరములకు పూర్వము, మహాసంగ్రామమున వారి కోటమి కలిగినపిమ్మట, కాంస్టాంటినోపులును పోగొట్టుకొనవలసినదే. ఆ నగర మప్పుడు ఇంగ్లీషువారి స్వాధీనములో నుండెను. తురుష్కుల సుల్తాను వారి చేతులలో కీలుబొమ్మ యయ్యెను. కాని ఒక గొప్ప నాయకుడు, ముస్తాఫా కెమాల్‌పాషా అనువాడు, తరుణమునకు వచ్చి తనవారిని రక్షింప బూనుకొనెను. ధైర్యసాహసములతో పోరాడి తుదకు విజయమును కాంచెను. నేడు టర్కీ ప్రజాప్రభుత్వ రాజ్యము. సుల్తానుప్రభుత్వ మంతరించినది. కెమాల్‌పాషా * టర్కీకి అధ్యక్షుడయ్యెను. 1500 సంవత్సరములపాటు సామ్రాజ్యమునకు రాజధానియై మొదట తూర్పురోమక సామ్రాజ్యమునకు, తరువాత తురుష్క-

---

* ఇతడు 1939 లో మరణించెను.

సామ్రాజ్యమునకు—నేడు తురుష్క రాజ్యములోనే ఉన్నది కాని రాజధాని మాత్రము కాదు. దాని సామ్రాజ్యవాసనలకు దూరముగా నుండగోరి తురుష్కులు దూరముగా ఆసియా మైనరులోనున్న అంగోరా (అంకరా)ను రాజధానిగా చేసికొనిరి.

2000 సంవత్సరములగుండా తొందరగా మనము ప్రయాణముచేసితిమి. ఒకదానితరువాత నొకటిగా వచ్చిన మార్పులను, కాంస్టాంటినోపులు ప్రతిష్ఠను, ఈ క్రొత్తనగరమునకు రోమకసామ్రాజ్య రాజధానిని మార్చుటను గమనించితిమి. కాని కాంస్టాంటైను వేరొక వింత కార్యమును చేసెను. అతడు క్రైస్తవు డాయెను. అతడు చక్రవర్తి. ఆ కారణమున క్రైస్తవమతము సామ్రాజ్యములో అధికారులచే అంగీకరింపబడిన మతమయ్యెను. క్రైస్తవమత పరిస్థితులం దీ మార్పు, తలవని తలంపుగా వచ్చిన మార్పు, పీడితమతము రాజమతమైన మార్పు వింతగానుండెను. కొంతకాలమువరకు ఈమార్పు దానికి ఎక్కువ లాభకారి కాలేదు. క్రైస్తవులలో వేర్వేరుతెగలు ఒకరితో నొకరు కలహించుకొన ప్రారంభించిరి. చివరకు లాటిన్ తెగయును, గ్రీకుతెగయును తెగతెంపులు చేసికొనిరి. లాటిన్ తెగ రోమును ప్రధానస్థానముగా చేసికొని, రోములోని బిషప్పును తమ నాయకునిగా చేసికొనెను. అతడే తరువాత పోపు అయ్యెను. గ్రీకు తెగ కాంస్టాంటినోపులును ప్రధాన స్థానముగా చేసికొనెను. లాటిన్ చర్చి ఉత్తర, పశ్చిమ యూరపులో నంతట వ్యాపించెను. దానినే రోమన్ కేతలిక్ చర్చి అందురు. గ్రీకుచర్చికి ఆర్తొడాక్సు చర్చి అని పేరువచ్చినది. తూర్పు రోమక సామ్రాజ్య మంతరించిన పిమ్మట రష్యాలో ఆర్తొడాక్సు చర్చి వృద్ధినందెను. బోల్షివిజం (సామ్యవాదము) నేడు రష్యాలో వ్యాపించియుండుటవల్ల ఈ చర్చికిగాని, ఇంకొక చర్చికిగాని అక్కడ అధికారస్థానము లేదు,

తూర్పు రోమక సామ్రాజ్యమని చెప్పుచుంటివి. కాని రోముతో దీని కెట్టి సంబంధమును లేదు. వారు వాడుకొను భాష సైతము లాటిను

భాష కాదు; గ్రీకుభాష. ఒకవిధముగా నిది అలెగ్జాండరు గ్రీకు సామ్రాజ్యముయొక్క ఉత్తరభాగమని చెప్పవచ్చును. చాలకాలమువరకు పశ్చిమ దేశములు తన్ను కాదని స్వతంత్రముగా నుండకూడదని చెప్పినను, పశ్చిమ యూరోపుతో దాని కెట్టి సంబంధమును లేకుండెను. అయినప్పటికిని తూర్పు సామ్రాజ్యము రోమకపదమును వదలిపెట్టలేదు. ప్రజలను రోమను లనుచుండిరి— ఆ పదములో ఏదో మహత్తు ఉన్నట్లు! ఇంతకన్న వింతవిషయము —సామ్రాజ్యమున అగ్రస్థానమును గోల్పోయి నప్పటికిని రోము ప్రతిష్ఠ తగ్గలేదు. దానిని జయించుటకు వచ్చిన బర్బరులు సైతము జంకుచు దానిని గౌరవముతో చూచిరి. గొప్పపేరు, భావనలు— వీనియొక్క శక్తి అంత బలవత్తరమైనది.

సామ్రాజ్యమును పోగొట్టుకొని, రోమనులు, వేరొక విధమైన సామ్రాజ్యమును స్థాపించ బూనుకొనిరి. ఏసుశిష్యుడైన పీటరు రోముకు వచ్చి మొదటి బిషప్పయ్యెనని చెప్పుదురు. పలువురు క్రైస్తవుల దృష్టిలో ఈ కారణమున రోము పవిత్రస్థలమైనది. రోములోని బిషప్పుల గురుస్థానమునకు ప్రత్యేక ప్రాముఖ్యము వచ్చెను. మొదట రోములోని బిషప్పు ఇతర బిషప్పులవంటివాడే. కాని చక్రవర్తి కాంస్టాంటినోపులు వెళ్ళినపిమ్మట అతనికి ప్రాధాన్యము వచ్చినది. ఆ కాలమున అతనిని మించినవా రెవరును లేరు. పీటరు అధిష్ఠించిన పీఠముపై కూర్చుండు అధికార మతనికి వచ్చుటచేత అతడు బిషప్పులలో ప్రముఖుడయ్యెను. పిదప నతనిని పోపు అని పేర్కొన దొడగిరి. నేటివరకును ఈ పోపు లున్నారని నీకు తెలుసును. వారు రోమన్ కేతలిక్ చర్చికి ముఖ్యాధికారులు.

రోమను చర్చికిని, గ్రీకు ఆర్థొడాక్సు చర్చికిని భేదము పుట్టుటకు ఒక కారణము విగ్రహారాధన మనిన వింతగా నుండును. వారి పవిత్ర స్త్రీ పురుషుల (సెయింట్) విగ్రహములను, ముఖ్యముగా ఏసు తల్లియైన మేరీ విగ్రహమును ఆరాధించుట రోమన్ చర్చి ప్రోత్సహించును. ఆర్థొడాక్సు చర్చివా రిది యెంతమాత్రము కూడదందురు.

ఉత్తర తెగల (tribes) వారిచే రోము ఆక్రమిత మయ్యెను. తెగల నాయకులు అనేకతరములపాటు దాని నేలిరి. వారు సైతము తరుచుగా కాంస్టాంటినోపులు చక్రవర్తి సార్వభౌమత్వ మంగీకరించుచుండిరి. ఈ కాలమున రోములోని బిషప్పు మతాధికారము అతిశయించెను. అతడు ప్రబలుడై కాంస్టాంటినోపులు చక్రవర్తిని ధిక్కరించెను. విగ్రహారాధన విషయమై వివాదములు పెరిగినప్పుడు, అతడు తూర్పుతో రోముకు ఎంతమాత్రము సంబంధము లేకుండ తెగతెంపులు చేసికో నిర్ణయించెను. ఈ లోపుగా అనేక విషయములు జరిగినవి. వానిని ముందుముందు తెలిపెదను. అరేబియాలో ఒక క్రొత్తమతము, ఇస్లామ్ అనుపేర, తలయెత్తినది. అరబ్బులు ఉత్తర ఆఫ్రికా, స్పెయిను దేశములపై దండెత్తి యూరోపు నకిబొడ్డుపై బడుచుండిరి. ఉత్తర, పశ్చిమ యూరోపులో క్రొత్తరాజ్యములు తలయెత్తుచుండెను. తూర్పు రోమక సామ్రాజ్యమును అరబ్బులు తీవ్రముగా ఎదుర్కొనుచుండిరి.

ఉత్తర జర్మానిక్ తెగలోని ఫ్రాంకుల మహానాయకుని సహాయమును పోపు అపేక్షించెను. తరువాత ఫ్రాంకుల నాయకుడగు కారల్ (ఛార్లెస్) రోమునకు చక్రవర్తి యయ్యెను. ఇది యొక క్రొత్త సామ్రాజ్యము, లేదా రాజ్యము. కాని వారు దానిని రోమకసామ్రాజ్య మనిరి. తరువాత దానినే "పవిత్రరోమక సామ్రాజ్య"మనిరి. రోమన్ కని సామ్రాజ్యముండుట అసంభవమని వారి ఊహ. చార్లిమాన్—అతడే ఘనుడగు చార్లసు—రోముతో సంబంధము లేనివాడైనను, అతడు చక్రవర్తియు (ఇంపరేటర్), సీజరును, అగస్టసును అయ్యెను. క్రొత్త సామ్రాజ్యము ప్రాత సామ్రాజ్యశేషమే యని వారి తలంపు. కాని దానికొక క్రొత్తపదము చేరినది. అది ''పవిత్రము" అయినది. అది ప్రత్యేకముగా క్రైస్తవ సామ్రాజ్యము, దాని జ్ఞానపిత పోపు కాన నది పవిత్రమైనది.

భావనల వింతశక్తి ఎట్టిదో మరల నీవు చూచుచున్నావు. మధ్య యూరోపులో నివసించు ఒక ఫ్రాంకో, ఒక జర్మనో, రోమక చక్రవర్తి

యగుచున్నాడు. ఈ "పవిత్ర" సామ్రాజ్యముయొక్క ముందుకథకూడ ఇంతకన్న విచిత్రముగా నుండును. సామ్రాజ్యమా—నామమాత్రావశిష్ట మైనది. కాంస్టాంటినోపులువద్దనున్న తూర్పు రోమక సామ్రాజ్యము ప్రభుత్వము సాగించుచున్నది. ఈ పశ్చిమ సామ్రాజ్యమో, కాలము గడచినకొలది మారిపోయినది, అంతరించినది, మరల అవతారమెత్తినది. అది నిజముగా ఛాయా సామ్రాజ్యము మాత్రమే. రోమక నామప్రభావము వల్లను, క్రయిస్తవ చర్చి ప్రభావమువల్లను అనుకొనుటకు మాత్ర మది యున్నది. నిజమునకు లేదు. అది ఊహాసామ్రాజ్యము మాత్రమే. ఎవరో జ్ఞాపకములేదు, వాల్టైరు కాబోలు— ఈ పవిత్ర రోమక సామ్రాజ్య మెట్టిదో నిర్వచించిరి: "అది పవిత్రముకాదు, రోమను కాదు, సామ్రాజ్యమును కాదు." అని. ఇండియన్ సివిల్ సర్వీసును—దురదృష్ట వశమున ఈ బాధ మనల నింకను వదలలేదు—ఎవరో ఈ విధముగానే నిర్వచించిరట: "అది ఇండియన్‌కాదు, సివిల్‌కాదు, సర్వీసుకాదు" అని.

ఏమైనను ఈ ఛాయా సామ్రాజ్యము 1000 సంవత్సరములపాటు పేరుకుమట్టుకు నడిచిపోయెను. అది నూరు సంవత్సరముల క్రితము, నెపోలియన్ కాలమున, చివరకు అంతమునకు వచ్చినది. ఈ అంతములో విశేషమేమియు లేదు. ఈ అంతము నెవరును గమనించియుండరు—నిజమున కది నిలిచినది కొద్దికాలమువరకే. ఈ ఛాయ, ఈ భూతము చివరకు అంతమైనది. కాని అది వివిధవేషములతో మరల లేచినది—కయిజరులు, జారులు మున్నగు వేషములతో! 14 సంవత్సరములకు పూర్వము అంతమైన మహాసంగ్రామమున ఇందు పెక్కు వేషములు సమాధిచేయబడినవి.

# 34

# ప్రపంచ ప్రభుత్వము - అను భావన

ఏప్రియల్ 25, 1932.

ఈ జాబులు వ్రాసి తరుచు నీకు శ్రమ కలిగించుచున్నానేమో? నీమనస్సు కలవరపరుచుచున్నానేమో? రోమక సామ్రాజ్యములనుగూర్చి

వ్రాసిన వెనుకటి రెండుత్తరములు ముఖ్యముగా నిన్ను చికాకుపరచి యుండవచ్చును. వేలకొలది సంవత్సరములగుండా వెనుకకు ముందుకు వేలకొద్ది మైళ్లు తిరిగితిని. నీ మనస్సు కలవరపాటు చెందినట్లయిన ఆ తప్పు నాదే. నిరుత్సాహము చెందకుము. చదువుచుండుము. నేను చెప్పిన విషయములు నీకెక్కడనైన తెలియకున్నచో ఫరవాలేదు. ముందుకు చదువుకుపొమ్ము. నీకు చరిత్ర బోధించుట ఈ జాబుల ఉద్దేశము కాదు. చరిత్రదృశ్యములు కొన్ని నీకు చూపి చరిత్రపై నీకభిమానము కలుగునట్లు చేయుటయే వీని ఉద్దేశము.

రోమక సామ్రాజ్యములన్న నీకు విసుగు పుట్టియుండవచ్చును. నాకు విసుగుగానే ఉన్నది. ఈ దినమున కొంచెము సహనముతో వాటిని చూతము. తరువాత కొంతకాలమువరకు సెలవు పుచ్చుకొందము.

ఈ దినములలో ఎక్కువగా జాతీయత, దేశాభిమానము అను మాటలు వినబడుచున్నవి. నేడు ఇండియాలో నున్న సుమారు మన మందరమును జాతీయవాదులమే. ఈ జాతీయత చరిత్రలోనికి క్రొత్తగా వచ్చినది. ఈ జాబులలో దాని పుట్టుక, వృద్ధులనుగూర్చి కొంత మనము నేర్చుకొందము. రోమక సామ్రాజ్యముల కాలములో అట్టి భావములు లేనేలేవు. సామ్రాజ్య మనగా ప్రపంచమునేలు ఒక గొప్ప ప్రభుత్వమని ఆకాలమున ఊహించుచుండిరి. ప్రపంచమునంతను పాలించిన సామ్రాజ్యముకాని, ప్రభుత్వముకాని ఇంతవరకు లేదు. భూగోళశాస్త్రము తెలియక పోవుటవల్లను, దూరప్రయాణములు చేయుట, దూరదేశములకు వస్తువుల నెగుమతిచేయుట ఆరోజులలో దుర్ఘటముగా నుండుటచేతను అప్పటి ప్రజలు అట్టి ప్రభుత్వ మున్నదని యూహించిరి. యూరోపులోను, మధ్యధరా ప్రాంతమందును, సామ్రాజ్యముకాకముందునుండియు రోమును అట్టి అతీతప్రభుత్వముగా నెంచిరి. మిగిలిన ప్రభుత్వము లన్నియు దాని కొదిగియుండెను. దాని పలుకుబడి ఎంత గొప్పగా నున్నదనగా— ఆసియామైనరులో గ్రీకురాష్ట్రమైన పర్గామం, ఈజిప్టు వంటి దేశములు తత్పరిపాలకులచే రోమను ప్రజలకు బహూకరింపబడినవి. రోము సర్వ

శక్తివంతమైన దేశమనియు, దుర్జయమనియు వారనుకొనుచుండిరి. కాని నే నిదివరలో చెప్పినట్లు, రోము, ప్రజాప్రభుత్వ రాజ్యముగా నున్నను, సామ్రాజ్యముగా నున్నను, ఏలిన భూమి మధ్యధరాదేశములే. యూరోపున కుత్తరమున నున్న బర్బరులు దానికి లొంగియుండలేదు. అది వారి నంతగా దృష్టిలో పెట్టుకొనలేదు. రోము పరిపాలించిన దేశవిస్తీర్ణమెంతయైనను, ప్రపంచప్రభుత్వ మను భావన దాని యందిమిడి యున్నది. ఆనాటి పాశ్చాత్యులు పలువురచే నీ భావన ఆమోదించబడినది. ఇందువల్లనే రోమకసామ్రాజ్యములు చిరకాలము నిలిచినవి. వెనుక సరుకు లేకున్నను వాటి పేరుప్రతిష్ఠలు అధికముగా నుండెను.

ప్రపంచమునంతను పాలించు ప్రభుత్వము అను భావన రోముతోనే పుట్టలేదు. పూర్వకాలమున ఇండియా చీనాలలో ఇట్టి భావన యుండుట మనము తెలిసికొంటిమి. చీనారాజ్యము కాస్పియన్ సముద్రమువరకు వ్యాపించి రోమను సామ్రాజ్యముకన్న విశాలముగా నుండెను. చీనా చక్రవర్తిని వారు స్వర్గపుత్రు డనెడివారు. చీనావారు అతనిని సార్వభౌముడు (బ్రహ్మాండాధిపతి) అని తలచుచుండిరి. కొన్ని తెగలు, కొందరు ప్రజలు చక్రవర్తిమాట వినక కష్టములు కలిగించెడివా రనుట వాస్తవమే. కాని వారు "బర్బరులు". ఉత్తర యూరోపియనులను రోమనులు "బర్బరు" లనెడివారుగదా. అట్లే.

ఇట్లే ఇండియాలోకూడ, ప్రాచీనకాలమునుండియు చక్రవర్తి రాజుల (సర్వభూమిని ఏలువారి) ప్రశంస కలదు. వారి దృష్టిలో ప్రపంచము బహుచిన్నది. ఇండియా పెద్దదేశమే. అందుచే దానినే ప్రపంచమనుకొనెడివారు. ఇండియాపై ప్రభుత్వము ప్రపంచప్రభుత్వముగా వారు భావించుచుండిరి. ఇండియాకు బాహ్యమందున్న దేశములలోని ప్రజలు "బర్బరులు", మ్లేచ్ఛులు. మన దేశమునకు పురాణపురుషుడగు భరతుని పేరు వచ్చినది. ఇది భారతవర్షమైనది. భరతుని చక్రవర్తిగా, ప్రపంచమునంతను ఏలినవానినిగా చెప్పుకొనుట సంప్రదాయము. యుధిష్ఠిరుడును, అతని సోదరులును ఈ చక్రవర్తిత్వముకొరకే దిగ్విజయ యాత్ర వెడలి

నట్లు మహాభారతము చెప్పుచున్నది. అశ్వమేధయాగము ప్రపంచప్రభుత్వ మునకై చేసిన సవాలు; అది సంకేతము.

అశోకుడు తొలుత చక్రవర్తిత్వమునకు ప్రయత్నించి, తరువాత పశ్చాత్తప్తుడై యుద్ధమునుండి విరమించెనని తోచును. కొన్ని సంవత్సరముల తరువాత, గుప్తులవంటి రాజులు కొందరు ప్రపంచప్రభుత్వము నకు ఆసించిరి.

ప్రాచీనకాలమున సార్వభౌమత్వము, సార్వభౌములు అను పదములు తరుచు వాడుచుండెడివారు. ఎంతోకాల మైనపిమ్మట జాతీయతయు, క్రొత్తవిధమైన సామ్రాజ్యతత్వమును తలయెత్తినవి. ఈ రెండును ప్రపంచమునకు తీరని నష్టము తెచ్చిపెట్టెను. మరల ఈ దినములలో ప్రపంచ ప్రభుత్వ మను మాట వినిపించుచున్నది. అనగా పెద్దసామ్రాజ్యము కాదు, సార్వభౌముడు కాదు; ఒకవిధమగు ప్రపంచప్రజాప్రభుత్వము. ఒక జాతిగాని, ప్రజలుగాని, ఒక తెగగాని వేరొకజాతిని, ప్రజలను, తెగలను తమ లాభముకొరకై హింసించకుండ నిది వారించును. ఇట్టిది త్వరలో సంభవమో అసంభవమో చెప్పుట కష్టము. కాని ప్రపంచము దీనస్థితిలో నున్నది. ఈ దైన్యమును తొలగించుటకు వేరొండు మార్గమున్నట్లు తోచదు.

ఎన్నియోసారులు, ఉత్తర యూరోపులో బర్బరులను గురించి వ్రాసితిని. రోమకు లావిధముగా వారిని పిలిచేవాడు కాబట్టి నే నామాట వాడితిని. మధ్య ఆసియాలోని దేశ ద్రిమ్మరులవలెను, ఇతర తెగలవలెను వీరు రోములోని తమ పొరుగువారికంటెను, ఇండియాలోనివారికంటెను తక్కువ నాగరీకులే కాని వారు ఎక్కువ చురుకుగానుండిరి. కొంతకాల మైన పిమ్మట వారు క్రయిస్తవులైరి. వారు రోమును జయించినప్పటికిని, కనికరములేని శత్రువులవలె వారు రాలేదు. ఉత్తర యూరోపులోని నేటి జాతులు ఈ బర్బరుల—గాతులు, ఫ్రాంకులు మున్నగువారి—సంతతి వారే.

రోమను చక్రవర్తుల పేళ్లు నీకు నేను చెప్పలేదు. వారెందరో ఉన్నారు. కొందరు దుష్టులు. కొందరు రాక్షసులవంటి దుర్మార్గులు. నీవు నీరోపేరు వినియుండవచ్చును. అంతకన్న దుష్టులు పలువురున్నారు. ఒక స్త్రీ—ఐరీని అను పేరుగలది చక్రవర్తియగు తన కుమారుని, తాను చక్రవర్తిని యగుటకు హత్యచేసినది. ఇది జరిగినది కాంస్టాంటి నోపులులో.

ఒక చక్రవర్తి మిక్కిలి యుత్తముడైయుండెను. అతని పేరు మార్కస్ అరీలియస్ అంటోనినస్. అతడు తత్వవేత్తయని చెప్పుదురు. అతడు వ్రాసిన గ్రంథమొకటి—అతని ఆలోచనలు, చింతనలు కలది—చదువదగ్గది. అత డంత మంచివాడైనప్పటికిని అతని కొడుకు రోములో పుట్టిన దుర్మార్గు లందరికంటె దుర్మార్గుడు.

రోమక సామ్రాజ్యము మొదటి 300 సంవత్సరములలో రోము పశ్చిమ ప్రపంచమునకు కేంద్రముగా నుండెను. అది యొక గొప్ప నగరమై యుండవలెను. అత్యున్నత భవనము లందుండియుండవలెను. సామ్రాజ్య మన్నిమూలలనుండియు, బయటనుండియు కూడ జను లా పట్టణమునకు వచ్చుచుండిరి. అపురూపమైన ఆహారపదార్థములు, అమూల్యవస్తు సముదాయములు దూరదేశములనుండి లెక్కలేనన్ని ఓడలమీద వచ్చి దిగుచుండెను. ప్రతి సంవత్సరమును ఒక ఈజిప్టు రేవుస్థలమునుండి ఇండియాకు 120 నౌకలు వెళ్లుచుండెడివని చెప్పుదురు. ఋతుపవనములు వీచుకాలమున వారు వెళ్ళెడివారట, అందుచేత వారియోడలు శీఘ్రముగా ఇండియా చేరుకొనుచుండెను. సాధారణముగా వారు దక్షిణ ఇండియా వెళ్లెడివారు. ఓడలలో అమూల్య వస్తువులను నింపుకొని అనుకూలపవనముల సహాయముతో ఈజిప్టు తిరిగివచ్చెడివారు. ఈజిప్టునుండి నాటు మార్గముగుండను, సముద్రమార్గముగుండను ఆ వస్తువులను రోముకు కొనిపోయెడువారు.

కాని ఈ వర్తకమంతయు భాగ్యవంతుల లాభముకొరకే. కొద్దిమంది భోగము లనుభవించుచుండగా పలువురు మాడుచుండిరి. 300

సంవత్సరముల కాలము రోము పశ్చిమ ఖండమున సర్వోత్కృష్టమై యుండెను. పిమ్మట కాంస్టాంటినోపులు ప్రతిష్ఠించిన వెనుక నూత్న నగరము ఘనతను రోముకూడ పంచుకొనెను. ఈ దీర్ఘ కాలములో రోము బుద్ధివికాసమునకు తోడ్పడు ఘనకార్యమేమియు, కొద్దికాలములో ప్రాచీన గ్రీసుచేసినట్లు, చేయలేదు. రోమను నాగరికత గ్రీకు నాగరికతయొక్క నిర్జీవచ్ఛాయ మాత్రమే యని తోచుచున్నది. ఒకవిధముగా మాత్రము రోమనులు మార్గదర్శకులైనట్లు తోచుచున్నది. అది ధర్మశాస్త్ర విషయమున. యూరోపులో ధర్మశాస్త్రమునకు రోమను ధర్మశాస్త్రము పునాదివంటిదని భావించుటచేత పాశ్చాత్య న్యాయవాదులు రోమను ధర్మశాస్త్రము నభ్యసింపవలసియున్నది.

సాధారణముగా ఇంగ్లీషువారు తమ సంతుష్టికొరకు బ్రిటిషు సామ్రాజ్యమును రోమక సామ్రాజ్యముతో పోల్చుదురు. అన్ని సామ్రాజ్యములును కొంచె మెచ్చుతక్కువగా ఒకే మచ్చులో నున్నవి. పలువురను తమ లాభమునకై హింసించి అవి లావెక్కును. రోమనులకును, ఇంగ్లీషువారికిని మరియొక దగ్గర పోలికయున్నది. వారికి ఊహాశక్తి నిష్పచ్చరము. నీటుగా ఆత్మసంతుష్టితో, ప్రపంచము తమ లాభము కొరకే సృజింపబడినదని నమ్ముచు ఎట్టి సంశయములు, కష్టములు లేక జీవితయాత్ర చేయుదురు.

## 35

# పార్థియా: సస్సనీడులు

ఏప్రియల్ 26, 1932

రోమక సామ్రాజ్యమును, యూరోపును వదలి ఇప్పుడు మనము ఇతర ప్రపంచభాగములను దర్శించుటకు వెళ్లుదము. ఆసియాలో ఏమి జరుగుచున్నదో చూచి పిమ్మట ఇండియాచీనాల గాథ మరల ఎత్తుకొందము. తెలిసిన చరిత్రలు గల ఇతరదేశములు కొన్ని కనిపించు

చున్నవి. వాటినిగురించికూడ మనము కొంత ముచ్చటించుకొందము. కథ సాగుచుపోవునప్పుడు నేను అనేక ప్రదేశములను గురించి ఎన్నో విషయములు చెప్పవలసివచ్చును. చెప్పలేక అసలే మానివేయుదునేమో అని భయముగా నున్నది.

వెనుక వ్రాసిన ఒక ఉత్తరములో పార్థియాలో కార్‌వద్ద రోమక ప్రజాప్రభుత్వ సైన్యములు గొప్ప పరాజయముపొందెనని వ్రాసియుంటిని. పార్థియను లెవరో అప్పుడు నేను చెప్పలేదు. నేడు పర్షియా, మెసపొటేమియా లున్నచోట వారు రాజ్యము నెట్లు స్థాపించుకొనిరో కూడ చెప్పలేదు. అలెగ్జాండరు మరణానంతర మతని సేనాని సెల్యూకసును, అతని సంతతివారును ఇండియా మొదలు పశ్చిమమున నున్న ఆసియామైనరు వరకు వ్యాపించిన సామ్రాజ్యము నేలియుండి రన్నమాట జ్ఞాపకమున్నదా? 300 సంవత్సరములవరకు వా రభివృద్ధిలో నుండిరి. తరువాత పార్థియను లను పేరు గల మధ్యఆసియా తెగవారిచే తరిమివేయబడిరి. పర్షియా (దీనినే పార్థియా అందురు) లోని ఈపార్థియనులే, ప్రజాప్రభుత్వావసాన కాలమందు రోమనుల నోడించిరి. తరువాత వచ్చిన సామ్రాజ్యము వీరిని పూర్తిగా ఓడించలేకపోయెను. 250 సంవత్సరములపాటు పార్థియాను వారు పాలించిరి. తుదకు విప్లవము సంభవించుటచే వారు పోవలసి వచ్చెను. పర్షియనులు పరదేశపాలకులపై తిరుగబడి, వారి స్థానే తమ జాతికిచెందిన తమ మతమువానిని పాలకునిగా నియమించుకొనిరి. అతని పేరు అర్దేషిర్ I. అతని వంశమునకు సస్సనీడు వంశ మని పేరు. పారశీకుల మతమైన "జొరాష్ట్రియానిజము"ను అతడు పోషించెను. ఇతర మతము లన్న అతనికి సహనము లేదు. సస్సనీడులకును, రోమక సామ్రాజ్యమునకును నిరంతరమును యుద్ధములు సాగుచునేయుండెను. వా రొకమారు రోమక చక్రవర్తి నొకనిని పట్టుకొనిరికూడ. పర్షియా సేనలు అనేకపర్యాయములు కాంస్టాంటినోపులుసమీపమునకు కూడ వచ్చెను. ఒకమారు వారు ఈజిప్టును వశపరచుకొనిరి. సస్సనీడు సామ్రాజ్యము జొరాష్ట్రియనుమత మన్న నెక్కువ ఉత్సాహము చూపు

చుండెనని ప్రసిద్ధిగన్నది. ఏడవ శతాబ్దిలో ఇస్లాంప్రవేశించినపుడు సస్స నీడు సామ్రాజ్యము, దాని రాజమత ముకూడ అంతరించెను. ఇట్టిమార్పు సంభవించుటచేత, హింసకు భయపడి జొరాష్ట్రియనులు పలువురు స్వదేశ మును విడుచుట మంచిదని తలచిరి. వా రిండియాకు వచ్చిరి. ఇండియా వారి నాదరించెను. తన శరణుజొచ్చిన ఇతరులనుకూడ ఇండియా ఈ విధముగా ఆదరించుచుండెనుగదా. నేడు ఇండియాలో నున్న పారశీకులు ఈ జొరాష్ట్రియనుల సంతతివారే.

వేర్వేరు మతముల నాదరించు విషయమున ఇండియాను ఇతర దేశములతో పోల్చుట అద్భుతావహముగా నుండును. అనేక ప్రదేశము లలో, ముఖ్యముగా యూరోపులో, ప్రాతకాలమున, రాజమతమునకు చెందనివారిపట్ల అసహనమును, వారిని హింసలపాలు చేయుటయు పరి పాటిగా జరుగుచుండెను. ప్రతిచోటను బలాత్కారము చేయుట కద్దు. యూరోపులో జరిగిన భయంకరమగు విచారణలను (Inquisition) గురించియు, మంత్రగత్తెలను దహించుటను గురించియు నీవు ముందు ముందు చదువగలవు. కాని, ఇండియాలో ప్రాతకాలమున మతసహనము సంపూర్ణముగా నుండెను. హిందూబౌద్ధమతముల మధ్య జరిగిన చిన్న పోరాటమునకును, పాశ్చాత్యదేశములలో మతసంఘములమధ్య జరిగిన తీవ్రయుద్ధములకును పోలికయే లేదు. ఈవిషయమును జ్ఞప్తియందుంచు కొనుట మంచిది. ఎందుకనగా దురదృష్టవశమున మన దేశములో మత కలహములు ఈమధ్య తలయెత్తినవి. చరిత్ర తెలియని కొందరు మొదటి నుండియు ఇండియాకర్మము ఈవిధముగానే కాలినదని తలంతురు. ఈ అభిప్రాయము శుద్ధతప్పు. ఈ కలహములు ఈమధ్యనే వచ్చినవి. ఇస్లాం ఇండియాలో అడుగుపెట్టిన పిమ్మట, వందలకొద్ది సంవత్సరములు ముసలమానులు, ఇండియా అన్నిభాగములలోను, ఇతరమతస్థులతో అర మరికగా మెలగుచుండిరి. వర్తకులుగా వారు వచ్చినప్పుడు వారిని ఇండి యను లాదరించిరి. ఇండియాలో స్థిరనివాసమేర్పరుచుకొమ్మని ప్రోత్స హించిరి. నేను ముందు చెప్పవలసిన విషయముల నిప్పుడే చెప్పుచున్నాను.

ఇండియా జొరాష్ట్రియనులను ఆదరించెను. కొన్నివందల సంవత్సరములకు పూర్వము—క్రీస్తుపూర్వము మొదటి శతాబ్దిలో అక్కడ పెట్టు హింసలు పడలేక రోమునుండి పారిపోయివచ్చిన పలువురు యూదులను కూడ ఇండియా ఈవిధముగానే ఆదరించినది.

పర్షియాలో సస్సనీడులు పాలించు కాలమున, సిరియాలో నున్న పాల్మైరాలో ఒక చిన్న ఎడారిరాజ్యము అభివృద్ధిలో నుండెను. అది కొలదికాలము దేదీప్యమానముగా వెలిగెను. సిరియా ఎడారిమధ్య పాల్మైరా ఒక వర్తకస్థానము. నేడుసైతము మనము చూడగలుగు శిథిలములనుబట్టి అచ్చటి దివ్యభవనముల నూహించుకోగలుగుదుము. ఒకప్పుడు జనోబియా అను స్త్రీ ఆ రాజ్యము నేలుచుండెను. కాని రోమనులామెను ఓడించిరి. స్త్రీ యని కూడ తలంచక వా రామెకు సంకెళ్లు వేసి రోముకు తీసికొనివెళ్లిరి.

క్రీస్తుశకారంభమున సిరియా రమ్యమైన దేశము. నూతననిబంధనములో దానినిగురించి కొంత ప్రశంస కలదు. దుష్పరిపాలనము, నిరంకుశత్వము చెలరేగుచున్నప్పటికిని జనసంకీర్ణమగు గొప్ప పట్టణములందుండెను. పెద్ద కాలువ లుండెను. వర్తకము విరివిగా జరుగుచుండెను. నిరంతరయుద్ధములవల్లను, దుష్పరిపాలనమువల్లను అది 600 సంవత్సరములలో ఎడారిగా మారిపోయెను. పెద్దపట్టణములనుండి జనులు లేచిపోయిరి. భవనము లన్నియు పాడువడినవి.

ఇండియానుండి యూరోపుకు విమానముపై పోవునప్పుడు పాల్మైరా, బాల్‌బాక్ శిథిలములు కానవచ్చును. బాబిలన్ ఎక్కడనుండెడిదియు చూడవచ్చును. చరిత్రలో ప్రసిద్ధినంది నే దంతరించిన అనేక ప్రదేశములను చూడవచ్చును.

# సోవియట్ రష్యా

## రచన : జవహర్‌లాల్ నెహ్రూ

## అనువాదం : పండితారాధ్యుల నాగేశ్వరరావు

పుటలు 72, వెల రూ. 0-12-0

★

"1927 లో సోవియట్ రష్యాలో జరిగిన దశవర్ష వార్షికోత్సవాలను తిలకించివచ్చి, జవహర్ పండితుడు రష్యానుగురించి ఒక గ్రంథం వ్రాశాడు. 13 ఏండ్లనాటి సోవియట్ రష్యా పరిస్థితి ఇందు చక్కగా వివరింపబడింది. నాగేశ్వరరావుగారి అనువాదం కేవలము అనువాదంవలెకాక స్వతంత్ర రచనలా సాగింది."

—ప్రజామిత్ర 16-5-1943.

"ఈ 'సోవియట్ రష్యా' వారి నాలుగో ప్రచురణ. ఇది జవహర్‌లాల్ గారు పది, పన్నెండు సంవత్సరాల క్రింద రష్యాకు వెళ్ళివచ్చి వ్రాసిన గ్రంథం. గ్రంథం చాలాకాలంనాటిది అయినా రష్యానుగురించి దీనిలోగల వర్ణనలలో, విశేషాలలో చాలా గంభీరత, సుందరత ఉన్నాయి.

నాగేశ్వరరావుగారీ గ్రంథాన్ని చక్కటి తెలుగులో అనువదించి ఆంధ్ర లోకానికి అందించారు. ఈ రచయిత, ఈ మండలివారు, ఇంకా ఇలాంటి గ్రంథాలే రచించి, ప్రకటించి తెలుగుకన్నెకు మేలిముసుగులు అమర్చుతా రని ఆశించుతున్నాం."

—కృష్ణా పత్రిక 28-8-1943.

205.

# ప్రపంచ పరిణామము

రచన: జవహర్‌లాల్ నెహ్రూ

అనువాదం: మరుపూరు కోదండరామరెడ్డి

పుటలు 144, వెల రూ. 1-8-0

★

ఇందులో ప్రకృతి పుస్తకం, ఆదిమచరిత్ర రచనా విధానం, భూమి పుట్టువు, ప్రథమ జీవజంతువులు, జంతోత్పత్తి అయినది, మానవాగమనము, ఆదిమ మానవుడు, వివిధజాతుల పుట్టుక, మానవజాతులు—వారి భాషలు—వివిధభాషల సంబంధము, నాగరికత అంటే ఏమిటి? మానవ వర్గాలు రూపొందినవి, మతముల ప్రారంభము-కార్యకలాప విభాగము, వ్యవసాయము కలిగించినమార్పులు, కులపతి ప్రారంభము, కులపతి-అతని అధికారాభివృద్ధి, కులపతి రాజైనాడు, ఆదిమ నాగరికత, ప్రాచీన ప్రపంచ ప్రసిద్ధనగరాలు, ఈజిప్టు-క్రీట్, చైనా-హిందూ దేశము, సముద్రయానము-వాణిజ్యము, భాష-లిపి-సంఖ్యలు, వివిధమానవ వర్గాలు, రాజులు-దేవాలయాలు-గురువులు, సింహావలోకనము, ఫాసిల్సు-శిథిలాలు, హిందూదేశమునకు ఆర్యుల ఆగమనము, హిందూదేశ ఆర్యులెట్లుండినారు?, రామాయణము-మహాభారతము మొదలైన విషయా లిందులో వున్నవి.

"ఇది జవహర్‌లాల్ నెహ్రూ తన కూతురు ఇదివరకు రాసిన ఉత్తరాల సంపుటి. ఉత్తరాలంటే మామూలుఉత్తరాలు కావు. అందులో మన భూమినిగురించి, ప్రాణులు, జంతువుల పుట్టుక, మనుష్యజాతులు, భాషలు, మతములు, నాగరికత-ఇటువంటి విజ్ఞానవిషయాలు ఎన్నో రాశారు. బాల లందరూ చదువవలసిన పుస్తకం." —బాల, జూలై 1946.

| మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B102 |
| పుస్తకం పేరు | ప్రపంచ చరిత్ర 01 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 209 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 6, 10, 11a, 114, 122 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayam |
| స్కాన్ చేసినది | Aswini |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | No |
| పరిస్థితి | good |